## ముఖచిత్రం

29–7–83 ముఖచిత్రంలో చుట్టూ పచ్చని దృశ్యాలతో, నడుమ విశాల నేత్రాలతో ఠీవిగా నిల్చున్న మాధవిని చూస్తుంటే ఒక్క క్షణం పత్రిక పేజీ తిప్పడం ఆగిపోతుంది !

జైన శ్రీనివాస్ (ముదిమాణిక్యం)

## "ఎలాటి గౌరవమూ లేదు"

1–7–83 ఆంధ్రసచిత్రవారపత్రికలో తిరుమల రామచంద్రగారు వ్రాసిన హైదరాబాద్ నోట్‌బుక్ ''మతకలహాలు'' చదివిన తర్వాత కొన్ని నిజానిజాలు పత్రికా ముఖంగా పాఠకులకు తెలుపాలనిపించింది.

మధ్య ప్రాచ్యదేశాలలో ఇంజినీరింగు శాఖలో పనిచేసి మరలి వచ్చిన వారిలో నేనొకరిని. భారతీయులకు మరియు అన్యదేశీయులకు అక్కడ చట్టబద్ధమైన ఎలాటి రక్షణ లేదు. ఏదైనా అన్యాయము జరిగి పోలీసుస్టేషనులో ఫిర్యాదు చేయడానికి వెళితే, ఆరోపివారి దేశస్థుడయితే ఫిర్యాదు నమోదు కూడ చేయరు. మత విషయమైతే, మరీ అధ్వాన్నము. ఉద్యోగరీత్యా వచ్చి నివాసమేర్పచుకున్న భారతీయ శ్రామిక వర్గీయుల వాడలలో ప్రార్థనా నిమిత్తమై తాత్కాలిక మందిరాలను నిర్మించుకోడానికి కూడ అనుమతి నివ్వరు. పండుగలు ఆడంబరముగా చేసుకోవడము కూడ ఒక విధమైన నేరామే ! కొన్ని విలాస మందిరాలలో జాతి భేదముతో అన్యదేశీయులకు ప్రవేశార్హత లేదు.

భారతీయ ముస్లీములు తాము మధ్యప్రాచ్యదేశాలను చూడకపోయినా, చివరకు ఆ గడ్డ గాలి కూడ పీల్చకపోయినా, తాము ఆ దేశాలకు చెందినట్లు భావిస్తారు. కాని నిజానికి అక్కడ వీరికి ఎలాటి గౌరవమూ లేదు. భారతీయ ముస్లిములు మొగలు సామ్రాజ్యకాలములో మతాంతరమైన వారని, వారి భావన. కాబట్టే వీరికి సమపంక్తి భోజనం నిషిద్ధము. ముఖ్యమైన ''రంజాన్'' పండుగలో సహితము భారతీయ ముస్లిములను ప్రార్థనకై వారి మసీదులలో ప్రవేశము లేదు. వీరికై వేరే మసీదులు కేటాయింపబడినవి.

అక్కడ ఈ లాంటి దురవస్థ పొందుతున్న భారతీయ ముస్లీములు, ఇక్కడ అన్ని సౌకర్యములు సమానాంతరముగా పొందుతున్నప్పటికీ నేటి అరేబియాపై ఎందుకంత అభిమానమో! అర్థం కావటము లేదు. భారతదేశంలో పుట్టి పెరిగి, ఉప్పు తింటూ సకల అనుకూలాలు పొందుతున్నప్పటికీ, సోదరవర్గంపై ద్వేషమెందుకు ? ఈ గడ్డపై కక్ష ఎందుకు ? సకల మత సామరస్యాన్ని ప్రదర్శిస్తున్న భారతీయ హిందువుల దోషమా ? లేక బలహీనతా ? లేక అల్పసంఖ్యాకుల ఓట్లు ఆశించి ఏది జరిగినా చర్య తీసుకొని స్వార్థపరులైన రాజకీయ నాయకుల కుతంత్రమా ? ఏది ఏమైనా ఇరువర్గాల ప్రతినిధులు సంప్రదించుకొని మున్ముందు మత కలహాలకు దారితీసే ఎలాంటి సంఘటనలు జరగకుండా చూడడము ఎంతైనా సమంజసము.

జి. హెచ్. రావు (ధోడిపురా, మహారాష్ట్ర)



## హైదరాబాద్ నోట్‌బుక్

22–7–83 తేది సంచిక హైదరాబాదు నోటుబుక్కులో పిల్లల పాట్లు అంటూ పాఠ్య పుస్తకాల విషయం రాశారు. అది వారు అనుకున్నంత సులభం కాదు. అది ''ఏడు చేపల'' కథ లాంటిది.

ఎల్ కేజీలో కూడా చేరటానికి నోట్ పరీక్షలు ప్రారంభం అయిన సంగతి శేఖర్‌గారు కార్టూనిస్టు గుర్తించినట్లు లేదు.

కె. రామారావ్ (హైదరాబాద్)




## వ్యాసాలు

15–7–83 వారపత్రికలో డా॥ గుమ్మనూరు రమేష్‌బాబుగారి సత్యసాయిబాబాపై వ్యాసం వాస్తవ దూరంగా ఉంది. అన్నీ మతాలు ఒకటే అని చెపుతున్నపుడు ఈ మత ఘర్షణలు ఎందుకు జరుగుతున్నాయి. సాయిబాబా దేవుడయితే తనపై వచ్చే విమర్శలకు జవాబు చెప్పొచ్చుగదా ! హేతువాదుల సవాల్‌ను ఎదుర్కొనవచ్చుగదా !

ఎంతో శాస్త్రబద్ధంగా నడుస్తున్న మన పత్రికలో ఇలాంటి మూఢ విశ్వాసాల్ని పెంచే శీర్షికలు రావడం విచారకరం. ముందు ముందు శాస్త్రీయ దృక్పథం గల వ్యాసాలు మాత్రమే ప్రచురించండి.

బి. శ్యాం (పర్ణశాల, భద్రాచలం)

* * *

15–7–83 వారపత్రిలో డా. గుమ్మనూరు రమేష్‌బాబుగారి 'ఆదర్శ దర్శనీయ కేంద్రం పుట్టపర్తి తపోవనం' శీర్షిక చదివిన తర్వాత ఈలేఖ రాయలేకుండా ఉన్నాను. మహిమలు లేవనటం., మూర్ఖత్వమనీ, కళ్లెదుట కనిపిస్తున్నది శక్తి... అంటూ ఆయన రాశారు. అయితే డా॥ కోవూర్, గోరాలు ఈ విషయమై ఎన్నో పరిశోధనలు, చేశారు కదా ! పరీక్షకు, శాస్త్రానికి అందనిది మహిమకాదని, మూఢ విశ్వాసమనీ శాస్త్రం చెపుతున్నప్పుడు కాదనటం వితండవాదం కదా !

కరువుకాటకాలు కేవలం పుట్టపర్తిలోనే ఉన్నాయనుకుంటున్నారు డా॥ రమేష్‌గారు. కాని దేశంలో ఉన్నదే కరువు, దరిద్రం. కాబట్టే వాస్తవాన్ని గుర్తించమని వార్ని కోరుతున్నాను. ఈనాడు కూడా బాబాలు, స్వాములు మనమీద చెలాయిస్తున్నారంటే, ఒక డాక్టరు అందుకు బాకా ఊదటం... చాలా శోచనీయం.

గవరాజు (ఎటపాక భద్రాచలం)

* * *

ప్రశాంతి నిలయం గురించి డాక్టరు గుమ్మనూరు రమేష్‌బాబు రాసిన వ్యాసంలో ఒక పొరపాటు దొర్లింది. పుట్టపర్తి అనంతపురం నుంచి 50 కి. మీ. దూరంలో వుంది అని ఆయనగారి వ్యాసంలో వుంది. కాని అది తప్పు అనంతపురం నుంచి పుట్టపర్తికి 70 కి, మీ. కన్నా దూరం వుంది.

యస్. చంద్రమోహన (ధర్మవరం)

## కథలు

15–7–83 సంచికలో 'తుషార బిందువులో తుఫాను' కథ నచ్చలరించింది. 'వెల్‌డన్' కథా కథనం బాగుంది. ''ఒకరిద్దరులో ఒకరు'' పర్వాలేదు.

బి. సూర్యనాగేశ్వరరావు (సీతారామపురం)

(64వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం . 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 19–8–'83

రుధిరోద్గారి నామ సం. శ్రావణ శు. ఏకాదశి

సంపుటము 75 సంచిక 51

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

విడి ప్రతి వెల రు. 1-50

ఆరు మాసాల చందా రు. 42 90

పోస్టులో ఏడాది చందా రు. 85 80

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం. విజయవాడ-520 003.


## విషయానుక్రమణిక

# దొంగలే దొరలు లేదా ఖుంగ్‌డ్జు ఏమి చెప్పాడు?

అమెరికా తర్వాత సంపన్నమయిన దేశం ఏదంటే — కమ్యూనిస్టు దేశాలని మినహాయించినట్లయితే జపాన్ అనాలి. వాటిని లెక్కలోకి తీసుకున్నా జపాన్ అన్నా తప్పు లేదేమో! సోవియట్‌యూనియన్‌కి సంబంధించిన వివరాలు అంత స్పష్టంగారావు కాబట్టి 'ఏమో' అనాలిసి వస్తోంది. సోవియట్‌యూనియన్ ఒక్కటే ఏమిటి, కమ్యూనిస్టు దేశాలన్నీ తమ తాలూకు లెక్కలని కొంచెం చాటుగానే ఉంచుతాయి. ప్రపంచ బాంకువారి తాజా నివేదికలో కూడా సోవియట్ యూనియన్‌కి సంబంధించిన వివరాలు సరిగ్గా ఇవ్వబడలేదు. రెండు కాకపోతే మూడు— ఏదయినా అవనివ్వండి, 1945 నాటికి మన కన్న తక్కువ కారులు, ఉక్కు తయారు చేస్తూ ఉన్నా జపాన్ ఈ స్థాయిని చేరుకోగలగడం గొప్ప కాదూ?

"మీ రెలాగ ఇంత అభివృద్ధి చెందారు?" అని జపాన్ వాళ్ళని అడిగితే వాళ్ళు సమాధానం చెప్పరు! 1968లో నేను మొదటి సారిగా జపాన్ వెళ్ళాను. ఇంత ప్రగతి సాధించలేకపోయినా అప్పటికే జపాన్ అభివృద్ధి చెందుతోందనటానికి దాఖలాలు లేకపోలేదు. నేను దిగిన హోటలు చిన్నది. నేను ఉన్న గది కిటికీ లోనుంచి ఆ దేశం ప్రధానమంత్రి ఇల్లు కనిపించేది. నా గది చాలా చిన్నది. దాని బాత్‌రూమ్‌కూడా చాలా చిన్నది. హోటలు "రిసెప్షన్" మరీ చిన్నది! అయితేనేమి, ఆ హోటలులో 100 గదులు పయిగా ఉండేవి. ఖాతాదారులకి కొరత ఉన్నట్లు నాకు తోచలేదు. అంతా చాలా శుభ్రంగా ఉండేది. ఎక్కడా చెత్తా, చెదారం కనపడేదికాదు. ఏది కావలిసినా అడగాలి, కాని కావలిసినది వెంటనే జరిగేది. గదిలోనే భోజనం కావాలంటే పెట్టే వాళ్ళు, రైలు టిక్కెట్టు కొని ఇవ్వమంటే కొని ఇచ్చేవాళ్ళు. హోటలు సిబ్బందికి "లేదు"అనటం అలవాటులేదు, అనిపించింది!

జపానులో "కాగితం పని" చాలా తక్కువ. ఒక అంగడికి వెళ్ళి ఒక కాలుక్యులేటరూ, రెండు షర్టులూ కొన్నారనుకోండి — అక్కడ ఉన్న అమ్మాయి ఒక మెషిన్‌మీద లెక్కలేసి ఎంతో చెబుతుంది, అంతే. రసీదులూ, సంతకాలూ ఉండవు. అందరికీ అందరిమీదా నమ్మకమే. చెక్కులకి డబ్బు కావాలా? టిక్కెట్లు కొనాలా? రిజర్వేషన్‌లు జరగాలా? అంతా ఎక్కువ "కాగితం పని" లేకుండానే జరిగిపోతుంది. ఇక మనం భారతదేశంలోనో? కాగితాలమీద రాయటం అన్నదానికి అంతు ఉండదు! మన దేశంలో అవసరం లేనివాటిమీద కాలం, కృషి వృధా చేస్తాము. జపాన్‌లో అందరూ పనిగానే ఉంటారు. కాని మీకు ఏదయినా కావలిస్తే కాదనరు, చేసి పెడతారు. భారతదేశంలో ఎవరికీ నిజంగా పని ఉండదు కాని ఎవరూ మిమ్మల్ని పట్టించుకోరు.

ప్రధానమంత్రి ఇంటిని గురించి చెప్పాను కదా? అది చాలా చిన్న బంగళా, దానికి ఇద్దరే కాపలావాళ్ళు కనిపించారు. వాళ్ళు సయితం చిన్నవాళ్ళుగానే కనిపించారు నాకు! ఇక ఆ యింటికి వచ్చిపోయే జనం సంఖ్య నాకేమీ పెద్దదిగా లేదు. సాయంకాలాలు మాత్రం కొంచెం రద్దీగా ఉండేది. ఢిల్లీలోని 1, సఫ్దర్ జంగ్ రోడ్ ఒక తీర్థక్షేత్రం లాగ ఉంటుంది. తుపాకీలు పట్టుకున్న గార్డులేమిటి, ఖద్దరు ధరించిన రాజకీయ వాదులేమిటి, యువనాయకులేమిటి — కిట కిట లాడిపోతూ ఉంటుంది అక్కడ. భారతదేశంలో కాలానికి విలువలేదు. అందుకనే మిగిలినవన్నీ ప్రియంగా ఉంటాయి. జపాన్‌లో కాలానికి విలువ ఎక్కువ, అందుకనే టి. వి. లూ, కారులూ అంత చవకగా లభిస్తాయి.

**న్యూఢిల్లీ లేఖ**



**డా. జయదుబాషి**

జపాన్ వాళ్ళది క్రమశిక్షణ కల సమాజం. దానికి చెందిన వాళ్ళు ఎవరి పని వాళ్ళు చెయ్యటం ముఖ్యం అనుకుంటారు — ఇంకొకళ్ళ సంగతి అంతగా పట్టించుకోరు ... క్రమశిక్షణతో బాటు జపాన్ వాళ్ళకి శుచి చాలా ఉంది. ఇది దేహానికి సంబంధించినది మాత్రమే కాదు మనస్సుకి సంబంధించినదికూడా. అందుకనే టోక్యోలో చెత్తా, చెదారం కనిపించవు. ఈ శుచి గొప్ప దేశాలవారికి ఉండితీరుతుందను కుంటాను నేను. ఒక పెద్ద భవనం కడుతున్నా సరే చక్కగా కడతారు! కట్టబడే కట్టడానికి తెరలాంటిది తగిలిస్తారు! కిందపడే మట్టి వగయిరాలకి గంట గంటకీ తీసికెళ్ళిపోతూ ఉంటారు. ప్లాట్‌ఫారమ్ శుభ్రంగా ఉంటుంది. మనదేశంలోనో? భవన నిర్మాణం పూర్తి అయిన కొన్ని సంవత్సరాలదాకా చెత్త అలాగేపడి ఉంటుంది. ఢిల్లీలోని ఝండేవాలన్‌లో ఢిల్లీ అభివృద్ధి సంస్థవాళ్ళు ఒక సైకిల్ స్టాండు కట్టారు. కట్టి కొన్ని సంవత్సరాలయి ఉంటుంది. కాని, అప్పటి చెత్త ఇంకా అలాగే ఉంది. ఎవరూ పట్టించుకోరు. ఇంత చెత్తని సహించే దేశం దేనిని మాత్రం సహించదు? భారత దేశంలో మనకి సహనం ఎక్కువ. అన్నిరకాల చెత్తతోబాటు లంచగొండి వ్యాపారులనీ, లంచగొండి రాజకీయవాదులనీకూడా సహిస్తాము మనం అదీ వచ్చిన చిక్కు.

జపాన్ విజయాలని చూసి సంభ్రమం చెందే పాశ్చాత్యులు ఒక సిద్ధాంతాన్ని గురించిచెబుతారు. అంతా "కన్‌ఫ్యూషియస్"అంటారు! కన్‌ఫ్యూషియస్ అనే పేరు తెల్లవాళ్ళు ఒక గొప్ప చీనా దార్శనికుడికి పెట్టిన పేరు. ఆయనని "ఖుంగ్‌డ్జు" అని బెయిజింగ్ ప్రాంతపు చీనావాళ్ళు పిలుస్తారు. ఖుంగ్‌డ్జు ప్రకారం నీతి, క్రమశిక్షణ విద్య కలవారు నాయకులుగా ఉంటేనే సమాజానికి మంచిది. నాయకులు శాంతినీ, ప్రజల సంపదనీ పెంపొందించేవారుగాకూడా ఉండాలి. పయివారు బాగాఉంటే కిందవారూ బాగా వుంటారు. న్యాయంగా పరిపాలించే వ్యక్తికి ప్రజలు విధేయులుగా ఉండాలి.

మంచి నాయకుడిని స్వీకరించాలి. చెడ్డ నాయకుడిని తిరస్కరించాలి. ఇందులో 'మధ్య మార్గం' అంటూ ఉండటానికి వీలులేదు.

అందుకనే జపాన్‌లో యుద్ధం ముగిసినప్పటి నుంచీ ఒకే పార్టీ అధికారంలో ఉంది. కొరియాలో ఒకే పార్టీ ఏలటానికి సయితం ఇదే కారణం. థాయిలాండ్, ఇండోనేసియా సంగతీ ఇంతే! తరువాత, ఫిలిప్పయిన్స్‌లో కొన్ని కుటుంబాల పాలన కొనసాగుతోంది. సింగపూర్‌ని ఏలే వ్యక్తి లీగువాన్‌యూ. అన్నీ ఒక రకం నిరంకుశ పరిపాలనలే. ఎక్కడా అధికారంలోకి రాగలిగిన ప్రతిపక్షాలు లేవు. జపాన్ అంత కాకపోయినా అన్నీ బాగానే అభివృద్ధి చెందాయి, చెందు తున్నాయి;

భారతదేశం సంగతి ఏమిటి? మననీ 1947 నుంచి ఒకే కుటుంబం ఏలుతోందే? [మధ్యలో కొంతకాలం మినహాయిస్తే!] మనది కాగితం మీద ఒక ప్రజాస్వామ్యం. నిజానికి మనం నిరంకుశ పాలనకి అవకాశాలు ఏర్పరచు కున్నాము. 1975 లో భారతదేశంలోని "ప్రథమ కుటుంబం" యొక్క ప్రధానవ్యక్తి అధికారానికి అపాయం వస్తే ఆమె ఏమాత్రం సంకోచంలేకుండా ఉన్నత ప్రజాస్వామ్య వ్యవస్థని స్తంభింప చేసివేశారు, అధికారాన్ని పట్టుకుని వేళ్లాడారు. కన్‌ఫ్యూషియస్‌కీ ఇందిరాగాంధికీ తేడాలు ఉన్నాయి. ఖుంగ్‌డ్జు ఏమో నీతి కల పాలకుడు కావాలంటాడు. ఇండోనేసియా, ఫిలిప్పయిన్స్‌లో ఉన్నటువంటి పాలకులు అతనికి పనికిరారు. ఇండోనేసియాలో, ఫిలిప్పయిన్స్‌లో అధికారంలో ఉన్న కుటుంబాల వాళ్లు కోట్లు సంపాదించుకున్నారు. మార్కోస్ కుమార్తె పెళ్లికి రు. 1000 కోట్లు కర్చు అయిందిట! ఇక్కడ గాంధీ కుటుంబంవాళ్లు ఆసియాడ్, త.దే.స. కోసం రు. 1000 కోట్లు కర్చుచేశారు. ఈ వినోదాలు ప్రజల ధనంతో నడిచినవి. వాటి వలన ప్రయోజనాలు పొందా మనుకున్నవాళ్లు కొందరు వ్యక్తులు. భారత దేశం యొక్క అభివృద్ధి చాలా మందకొడిగా, తక్కువగా జరుగుతూ ఉంటుంది. ఇది అందరికీ తెలుసు. మనం ఎప్పుడూ డబ్బుకోసం యాచిస్తూనే ఉంటాము. అయినాసరే మనకి పెద్ద ఎత్తున వినోదాలు కావాలి.

జపాన్‌లో దొంగలు లేరని నేను అనుకోవటం లేదు. కాని వాళ్లని ఎక్కువ కాలం పదవులలో ఉండనివ్వరు. తనాకాకి ఎటువంటి గతి పట్టిందో చూడండి! మన దేశంలోనో? దొంగలే దొరలు అవుతారు. పెద్ద దొంగలు ముఖ్యమంత్రులు, రాయబారులు వగయిరా. చిన్న దొంగలు షేరులు కొని అమ్ముకుంటూ ఉంటారు. మనం ఖుంగ్‌డ్జుని తలకిందులు చేశాము. అలాగే ఇక్కడ అన్నీ తలకిందులు బేరాలే. జపాన్ ప్రపంచంలోనే అగ్రదేశం అయిపోతూ ఉంటే మనం 1947లో ఎక్కడ ఉన్నామో అక్కడే ఉన్నాము — మన స్వంత కూపంలో. ★



# అగ్గిపెట్టె

## ఇచ్ఛాపురపు రామచంద్రం





గోపాలానికి బస్సుపడదు.

అయినా అతను బస్సెక్కక తప్పలేదు.

రైళ్లకి లేటుబాధ. బస్సులకి రేటు బాధ.

గోపాలం ఎక్కిన సూపర్ ఎక్స్‌ప్రెస్ రేటుకేతప్ప వేగానికీ సుఖానికీ కొంచెమూ సుఖంగాలేదు. ఆ డ్రయివరుకి — 'నిదానమే ప్రధానము' — 'వేగము మృత్యువే.' వంటి వాక్యాలలో అచంచలమయిన విశ్వాసం ఉన్నట్లుంది. అంగుళం అంగుళమూ ప్రయాణం చేస్తోంది బస్సు. రోడ్డుమీది ప్రతి గోతినీ కుదుపుగా మార్చి ప్రయాణీకులకి అనుభవాన్నందిస్తోంది. దానితో — గోపాలానికి చిరాకుగా ఉంది. తలనొప్పిగా ఉంది. అతను కళ్ళు మూసుకుని — నిద్రపోయేందుకు శాయశక్తులా ప్రయత్నించ సాగాడు. నిద్రలో బస్సు ప్రయాణ కష్టాన్ని దాటెయ్యాలని అతని ఆశ. కాని — కళ్ళు మండుతున్నాయేతప్ప నిద్రరావడంలేదు.

బస్సెక్కుతూ అతను చాలా జాగ్రత్తలు తీసుకున్నాడు. విండోస్లేస్‌కోసం చూశాడు. అన్నీ ఆక్రమించుకోబడ్డాయి. అప్పుడు— నీటుగా ఉండే మనిషిని వెదకి అతని పక్కన కూర్చున్నాడు. అతనెప్పుడూ అంతే తను నాగరిక యువకుల పక్కన కూర్చోవాలనీ, తన పక్కన నాగరికులు కూర్చోవాలనీ కోరుకుంటాడు. ఆ విషయంలో గోపాలం సఫలుడు కాగలిగాడు. అతని పక్కనున్న శాల్తీ సూటూ బూటూ వేసుకుని — గొప్పవాడిలా ఉన్నాడు. దానితో — గోపాలం తృప్తిగా కూర్చుని కళ్ళు మూసుకున్నాడు. ఐదు నిముషాలకే —

"మాస్టారూ!... ప్లీజ్... అగ్గిపెట్టె.."

కళ్ళు తెరచి — చిరునవ్వు నవ్వకుండా — అగ్గిపెట్టె అందించాడు ప్యాంటు జేబులోంచి తీసి. గోపాలం షర్టుకి జేబులేదు.

అతను సిగరెట్ వెలిగించుకుని అగ్గిపెట్టె వాపసుచేశాడు.

పావుగంట గడిచింది.

గోపాలానికి నిద్రపడుతుందేమో అన్న ఆశ కలుగుతూంది.

"అగ్గిపెట్టె యివ్వండి —"

డిమాండ్ చేస్తున్నట్లే ఉందతని కంఠం.

అగ్గిపెట్టె యిస్తూ — పరిశీలనగా చూశాడు.

అతను — ఖరీదయిన మనిషే. ఎందుకంటే అతను కాలుస్తున్న సిగరెట్ ఖరీదయిన బ్రాండ్. అతను చెయిన్ స్మోకర్‌లా ఉన్నాడు.

గోపాలానికి కొంచెం కోపం వచ్చింది. ఏమిటీ మనిషి? ఐదు రూపాయలిచ్చి సిగరెట్ ప్యాకెట్ కొనగలడు కానీ పదిహేను పైసలిచ్చి

అగ్గిపెట్టె కొనడానికెందుకో కక్కుర్తి? నూటూ బూటూ వేసుకుని అగ్గిపుల్ల ముష్టెత్తడానికి సిగ్గెయ్యదు కాబోలు. పెన్నీ వైజ్... పౌండ్ ఫూలిష్. ఆ కోవలో మనిషే యితమూను.

అతను — అగ్గిపెట్టె తిరిగి యిచ్చాక — మళ్ళీ నిద్రాప్రయత్నం చేయసాగాడు.

పావుగంట...

"అగ్గిపెట్టె —"

గోపాలం సహనం నశించింది. కోపం తారస్థాయినందుకుంది. సీటులోంచి లేచి నిలబడి — ప్యాంటు జేబులోంచి అగ్గిపెట్టె తీసి యిచ్చాడు.

అసలే చిరాకుగా ఉన్న అతన్ని — యీ మనిషి మాటిమాటికీ అగ్గిపెట్టె అడగడం మరీ చిరాకు పరచింది. అతనిమీద కోపం తీర్చుకోవాలి. ఎలా ? ఆలోచిస్తూ కళ్ళు మూసుకున్నాడు. అతను మళ్ళీ అగ్గిపెట్టె అడిగేసరికి — గోపాలం తన ఆలోచన నమలుపెట్టడానికే నిశ్చయించుకున్నా౩. పావుగంట తిరక్కుండానే —

"అగ్గిపెట్టె —" అడిగాడు. జేబులోంచి బయటకు తీశాడేతప్ప గోపాలం యివ్వలేదు. సిగరెట్ తీసి తను అంటించుకుని — వెలుగుతున్న పుల్ల అందించాడు. అలా చేయడంవల్ల తను అగ్గిపుల్లని పూర్తిగా త్యాగం చేయలేదని తృప్తి పడ్డాడు. కాని —

గోపాలం రెగ్యులర్ స్మోకర్ కాదు.

పక్క శాస్త్రిమీద కోపం తీర్చుకుందుకు — పావుగంట కొకటి చొప్పున రెండు మూడు సిగరెట్లు కాల్చేసరికి తనికి పెదవులు మండ సాగాయి. పార్టీల్లోనూ, ప్రయాణాల్లోనూ మాత్రమే కొంచెం కాలుస్తాడతను. అయినా అగ్గిపెట్టె కొంటాడు. ఎవరికోసమో తను సిగరెట్లు ఎక్కువ కాల్చడం తెలివితక్కువగా అనిపించింది. దానితో అతను మరో ఉపాయం కోసం తీవ్రంగా ఆలోచించసాగాడు. సరయిన పద్ధతిలో — అతనికి బుద్ధి చెప్పాలి. తను చెప్పే గుణపాఠం అతని నసాళాని కంటాలి. జన్మలో యిక అతను అగ్గిపుల్లలు ముష్టెత్తకూడదు. ఒక మనిషిని సంస్కరించినా సంస్కరించినట్లే. ఇతన్ని జయించలేకపోతే, వంద కథలు రాసినా రచయితగా తను ఓడిపోయినట్లే.

జిగీష... గోపాలం మెదడుని తినెయ్య సాగింది.

బస్సు ఆగింది.

గోపాలం చకచక దిగి కిందకు వెళ్ళాడు. రెండు నిముషాలయినా గడవలేదు.

మూటువాలా దగ్గరకొచ్చి — "బాబూ, ధర్మం." అంటూ సతాయించడం మొదలుపెట్టా డొక ముష్టివాడు.

గోపాలం సీటులోకి వచ్చి కూర్చున్నాడు.

మూటు వేసుకున్న సీటుమనిషి ముష్టి వాడిని సాధ్యమైనంతవరకూ రెసిస్ట్ చేసి — చివరకు ఓడిపోయి ఐదు పైసలు వేశాడు. వాడు తీసుకున్నాడు. కాని — మళ్ళీ — "ధర్మం బాబూ." అంటూ వచ్చాడు.

"ఇప్పుడే కదా వేశాను ?" తెల్లబోయాడు మూటువాలా.

అతని మాటలు వినిపించుకోనట్లే... "ఉన్న మారాజులు. ధర్మం చేయండి బాబూ..." పీడిస్తున్నాడు ముష్టివాడు.

"మాటి మాటికీ నన్నే బాధపెడతావేం, వేశానన్నా వినిపించుకోకుండా ?" కసురుకుంది మూటు. ముష్టివాడు మాత్రం దూషణ భూషణ తిరస్కారాల కతీతుడినన్నట్లు అతన్ని జిడ్డులా పట్టుకుని వదల్లేదు. నాగరికుడు చాలా అలసిపోయాడు ముష్టివాడితో.

బస్సు కదిలింది.

"ఆ వెధవకి పిచ్చా, వెర్రా ?" అడిగాడతను బస్సు కదిలాక గోపాలాన్ని.

"ఏ వెధవకి ?"

"ఆ బెగ్గర్..."

నవ్వాడు గోపాలం.

"నవ్వుతారేం ?" కోపంగా చూశాడా శాస్త్రి గోపాలం వేపు.

"చిన్న విషయం జ్ఞాపకం వొచ్చి..."

"ఏమిటి ?"

"రాష్ట్రంలో ముష్టివాళ్ళని లేకుండా చేస్తానంది ప్రభుత్వం ఆ మధ్య..."

"అనడంమేరకే. ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నిస్తేగా ?"

"ఆచరణలో అది అసాధ్యమని తెలుసుకుని ఉంటుంది ప్రభుత్వం."

"అసాధ్యమా ! ఎందుకని ? సిన్సియర్‌గా ప్రయత్నిస్తే సాధించలేనిదేముంటుంది ?"

"ఈ దేశాన్నుంచి...యీ మనుషుల మంచి ...పేదరికాన్ని పారద్రోలడం సాధ్యం కాదను కుంటాను."

"ఎందుకని ?"

"మీరు క్షమిస్తే ... నిజం చెబుతాను. పదే పదే ముష్టివాడు పైసలడిగినందుకు మీరెంత బాధపడ్డారో అంత బాధా నేను మీకు ప్రతి పావుగంటకీ అగ్గిపెట్టె అందించడాని కనుభవించాను. పొగ త్రాగుట హానికరమన్న చట్టబద్ధమైన హెచ్చరికలాగే అగ్గిపెట్టె అనువడగడం నీచం అని సిగరెట్ పెట్టె మీద ముద్రించినా ఉపయోగం ఉంటుందనుకోను — ఉన్నా — ముష్టెత్తుకోడం మన కలవాటు." చిరాకులోనూ, కోపంలోనూ పరుషంగానే ఉంది గోపాలం కంఠం.

పక్కనున్న శాస్త్రి ముఖం మాడిపోయింది.

"సిగరెట్... అగ్గిపుల్ల ... వక్కపొడి ... ముక్కుపొడుం ... వీటికోసం చేతులు చాచి తీరుతారెందరో. మన రక్తంలోనే ఉందేమో యాచనా నైజం. పుట్టుకతో వచ్చిన బుద్ధి — పుడకలతో కాని పోదంటారు."

అవతలి శాస్త్రి అవాక్కయిపోయాడు.

గోపాలం — అతన్ని అంతటితో క్షమించి నట్లు ఊరుకున్నాడు. చిన్న తప్పుకి చాలా పెద్ద — కఠినమైన శిక్ష వేశానేమో ! అని అతని కనిపించింది. ★



# వ్యక్తిగతం



హెర్మాన్ కాహన్ భవిష్యత్ శాస్త్రవేత్త. గణిత శాస్త్రజ్ఞుడు, ఆర్థికశాస్త్రవేత్త, చరిత్ర కారుడుగా పేరు పొందిన ఈయన హడ్సన్ ఇన్‌స్టిట్యూట్ అనే పేరుతో తన సొంత సంస్థ పెట్టుకున్నాడు. సాంకేతిక, సామాజిక విషయాలని అనుశీలించి మానవ జాతి భవిష్యత్తుని ఊహించటం హెర్మాన్ కాహన్ వంటివారి వృత్తి. కాని, కాహన్ అన్నిరకాల పథకాలనీ స్వీకరించేవాడు. ఉదాహరణకి — సోవియెట్ నౌకా దళం బలం ఎంత? కేంద్ర ప్రభుత్వంవారు నేరుగా పన్నులు వెయ్యకుండా ఇంకేవిధంగా ఆదాయం తెచ్చుకోగలరు? ఉత్తరాలని 'ఎలెక్ట్రానిక్' సాధనాల ద్వారా పంపవచ్చునా? చనిపోయినప్పుడు కాహన్ వయసు 61...



చిలీ దేశాన్ని ఏలుతున్న జనరల్ పినోచెట్. ఈయనే సాల్వడార్ అల్లెండెని పడగొట్టి చిలీ నియంత అయ్యాడు. సెప్టెంబరు 11 నాటికి ఈయన అధికారంలోకి వచ్చి 10 సంవత్సరాలు పూర్తి కాగలదు కాని "ఆయన అంతదాకా ఉంటాడా?" అని అడుగుతున్నారు వివిధ వ్యాఖ్యాతలు...



రాబర్ట్ కె. స్టెయిన్ బెర్గ్ అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో లాయరు. విక్కీ మోర్గన్ అనే ఒక అమ్మాయితో కామ విలాసానికి పాల్పడిన కొందరు ప్రముఖుల విడియో టేపులు ఈయన దగ్గిర ఉండేవిట వీటెని కొందరు విలేఖరులు దొంగిలించారని ఈయన అంటూన్నారు ఆ టేపులని కోర్టువారి ముందు ఉంచాలని ఒక ఆదేశం ఈయనకి వచ్చింది. ఆ తర్వాతనే అవి పోయాయని ఆయన అంటున్నాడు ...

# వారఫలం

19-8-1983 శుక్రవారం మొదలు 25-8-1983 గురువారం వరకు

♈ **మేషం**: సులభంగా జరగవలసిన కార్యం చిక్కులలో పడుతుంది. ఆదాయం అంతంత మాత్రమే. ఏదీ సవ్యంగా జరిగే అవకాశం లేదు. అలాంటి గ్రహస్థితి గల వారం. స్త్రీలకు: ఉద్యోగం నిమిత్తం చేసే ప్రయత్నాలు గాని, అధిక విద్యార్జనకు చేసే ప్రయత్నాలు గాని ఫలిస్తాయి.

♉ **వృషభం**: ఆదాయంలో అభివృద్ధి కనిపిస్తుంది. అవసరాలకు ధనం చేతికందుతుంది. ఉత్తరాల మూలాన కొన్ని శుభ వార్తలు అందుతాయి. విందు వినోదాల్లో పాల్గొంటారు. ఉచితంగా కొంత డబ్బు వ్యయం చేయవలసి వస్తుంది. స్త్రీలకు: కళా సాహితీ రంగాలలో మీ శ్రమ ఫలిస్తుంది. మిత్ర సహాయం గలవారం.

♊ **మిథునం**: అనవసరంగా ధనం వ్యయం కావటం, వ్యాపారం స్తంభించి పోవటం, విశ్రాంతి లేకుండా తిరగటం మేలు చేసిన వారి వలననే కీడు సంక్రమించటం, అలవాటు లేని పనులలో దిగటం, యిత్యాది అనానుకూలాలు జరుగుతాయి. స్త్రీలకు: అన్ని రంగాలలో వ్యతిరేక వాతావరణమే కనిపిస్తుంది.

♋ **కర్కాటకం**: రాజకీయంగా మేలున్నది. శుభ కార్యాల నిమిత్తం ప్రయాణం చేయ మన్నారు. వస్తు వాహనానుకూలత గలవారం. క్రితం కన్నా ఆదాయంలో, వ్యవహార విజయంలో మేలుగా ఉంటుంది. స్త్రీలకు: విందు వినోదాలు, నగల సేకరణతో వారం వ్యయించనున్నారు.

♌ **సింహం**: అధికారుల మూలాన జరుగ వలసిన పనులు సుకరంగా నెరవేరుతాయి వ్యాపారం అనుకూలం గానే సాగిపోతుంది. మాట పట్టింపులతో యిబ్బంది పడవలసిన అవసరం ఏర్పడుతుంది. స్త్రీలకు: న్యాయంగా వారమంతా లాభించే మార్గమున్నది. దూర ప్రాంతాలకు కొందరు వెళ్లవలసిన అవసరమున్నది.

♍ **కన్య**: ఆదాయం, అధికారం పెరగటం, వ్యాపారం సుకరంగా సాగటం, వృత్తిలో పెంపు కనిపించటం, శుభకార్యా చరణకు అవకాశం కల్గటం గమనించ గలరు. స్త్రీలకు: క్రితం జారిపోయిన అవకాశాలు మరలా అందుకొనే అవకాశాలుంటాయి.

♎ **తుల**: వృత్తి ఉద్యోగాలందు అనుకూలత చేకూరుతుంది. అవసరాలకు వలసినంత ధనం అందుకొంటారు. వ్యాపార మేదైనా నూతనంగా ప్రారంభించే అవకాశమున్నది. స్త్రీలకు: అనుకొన్న వ్యవహారాలు అతి శీఘ్రంగా నెరవేరే అవకాశమున్నది.

♏ **వృశ్చికం**: అప్రయత్నంగా ధనలబ్ధి వ్యవహారం ఏదైనా ఉంటే పరిష్కరింప బడటం ఆదాయం వ్యయాన్ని మించి కనిపించటం, సంతానం విద్యాభివృద్ధి నిమిత్తం చేసే పనులు నెరవేరటం, గమనించ గలుగుతారు. స్త్రీలకు: విందు వినోదాల్లో పాల్గొనటం, ప్రయాణించటం గమనిస్తారు.

♐ **ధనుస్సు**: నూతన విషయాలు తెలిసికొంటారు. నూతన మిత్రుల సాంగత్యం ఏర్పడుతుంది. దావా తగాదాలు ఏవైనా ఉంటే సుకరంగా పరిష్కరింప బడుతాయి ఉన్నత విద్య నిమిత్తం మీరు గావించే కృషి ఫలవంతం కావటం గమనించ గలరు. స్త్రీలకు: మేలు పొందిన వారి వలననే యిబ్బందులు, వ్యయం కనిపిస్తుంది

♑ **మకరం**: చాల కాలంగా అవిరళ కృషి చేసి వదలి పెట్టిన వ్యవహారాలు అనుకూల దాయకమే. ఆదాయాన్ని మించి ఖర్చు చేయవలసి వస్తుంది. అప్పులు వసూలు చేయటానికి ప్రయత్నించండి, అనుకూల కాలం. స్త్రీలకు: కళా సాహితీ రంగంలో పేరు తెచ్చుకొంటారు. మాటకు విలువ పెరుగుతుంది.

♒ **కుంభం**: ఉద్యోగం కొరకు అనవసరంగా తాపత్రయ పడకండి, వారాంతంలో అనుకూలం. గృహ విస్తరణకు మీకు అనుకూల సమయమే. ప్రయాణాలు ఆపుకోవటం శ్రేయస్కరం. రోడ్డు ప్రమాదాలకు గురి కాకుండా చూచుకోండి, అలాంటి పరిస్థితి గలదు స్త్రీలకు: ధన సేకరణ, వృత్తిలో అభివృద్ధి.

♓ **మీనం**: చిరకాలంగా ఉన్న మీ కోరిక నెరవేరుతుంది. స్థిరాస్తి పెంపొందించుకొనే ప్రయత్నాలు సుకరంగా సాగుతాయి. కొందరు శుభ కార్యాల నిమిత్తం ప్రయాణం చేయవలసిన అగత్యం ఏర్పడుతుంది. గ్రామ పెద్దరికానికి అవకాశం ఏర్పడుతుంది. పదిమందిలో పేరు పెంపొందే కార్యక్రమంలో పాల్గొంటారు. స్త్రీలకు: ఒకానొక వ్యాపార విషయంలో, గృహ విస్తరణలో మేలు చేకూరే అవకాశమున్నది గ్రహించి మెలగండి, మేలున్నది.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## 1983 దీపావళి కథల పోటీ

## మొత్తం రు. 6000ల బహుమతులు

ఎప్పటిలాగే ఈసారి కూడా దీపావళికి కథానికల పోటీ పెడుతున్నాము..... పోయినేడాదిలాగే యీసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలను ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

**ముగింపు తేది 31.8.83 → బుధవారం...**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు. 600/- లు చొప్పున బహుమతుల ఇస్తాము. అటు తరువాత బాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. 650/-, రు. 550/-, రు. 450/- ల వంతున అదనపు బహుమతుల యివ్వడమే గాక మిగిలిన మూడు కథలకు రు. 250/-ల చొప్పున మూడు కన్సొలేషన్ బహుమతుల అందజేస్తాము.

- ★ 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా వుండాలి. 12 అరఠావులు దాటకుండా వ్రాస్తే చాలు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
- ★ కథావస్తువు తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.
- ★ అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.
- ★ పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండితీరాలి. కలంపేరు వాడినా అసలు పేరు, యింటిపేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతోపాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
- ★ కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయంతోనే వేస్తాము.
- ★ రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.
- ★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైనవాటిని పంపి, వాటి ప్రచురణకు అంగీకరించాలి.
- ★ ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలువెంబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఏ పరిస్థితులలోను త్రిప్పి పంపలేము.

—సం॥

SKVR

సీరియల్



# జీవనమురళి

## కొండముది శ్రీరామచంద్రమూర్తి

4

(గత సంచిక తరువాయి)

"మావయ్యా - అత్తయ్యా! తలుపు తియ్యండి." అంటూ జీవన ఆ మండువా లోగిలి ఇంటి తలుపుల్ని తడుతూ పిలిచింది. కొత్త వ్యక్తి కంఠస్వరంగా వీధి కుక్కలు భౌ భౌ మన్నాయి. గొడ్ల కొష్టంలో వున్న ఆవుదూడ అంబా అంటూ అరిచింది. వరండా మూలలో వున్న పశులు రెక్కలు తపతపలాడించాయి.

"ఎవ్రరా అదీ—అర్ధరాత్రి పూట పిలిచేదీ?" అంటూ జీవన మేనమామ తలుపులు తీసుకుని బయటకు రాబోయాడు.

"ఏవండోయ్, కిటికీలో నుండి చూసి, నిర్ధారణ చేసుకుని ఆ తర్వాత తలుపులు తెరవండి! ఈ మధ్య దొంగలూ, తోడుమోతులూ ఇట్లాగే రకరకాల వేషాలు వేస్తున్నారట !" అన్నది పేరిందేవి, మొగుడితో హెచ్చరికగా.

"చాల్లేద్దూ మహా చెప్పొచ్చావ్, ఆ సంగతి నాకు తెలుసులెద్దూ !" అంటూ పేరిందేవి మొగుడు చీదరించుకున్నాడు ఆ మాటను. వెళ్ళి తలుపు తీసి "నువ్వా తల్లీ!" అంటూ "ఏమేవ్— మన జీవన వచ్చిందేవ్— జీవన!!" అంటూ కేక వేశాడు లోపలకి.

"ఎవరూ జీవనా" అంటూ ఆశ్చర్యంతో పేరిందేవి లేచి వచ్చింది. "ఇదేమిటే పెళ్ళి కదే నిన్న నీకు ? ఇట్లా వచ్చావేమిటీ ?" అంటూ ఆరాలు తీయడం మొదలెట్టింది. జీవన పక్కనే నిలబడ్డ మురళీకృష్ణను చూసి, "ఈ అబ్బాయెవరూ ?" అన్నది అనుమానంగా. "కొంపతీసి ఇతగాడితో లేచొచ్చావేమిటి ?— ఖర్మ !!"

"లేదండీ ! నాతో లేచి రాలేదు. కలిసి వచ్చింది. అంతే !" అన్నాడు మురళీకృష్ణ దెబ్బతిన్న అహంతో.

"ఒసే పేరిందేవీ— కాసేపు నువ్వు నోరు మూసుకుని, లోపలకు తగలడి వీళ్ళకు వేణ్ణీళ్ళు పెట్టి ఆ తర్వాత అన్నం వడ్డించే ఏర్పాట్లు చూస్తావా?" అన్నాడు ఆ ఇంటాయన విసుగ్గా. "ఏమనుకోకండి సార్ ! మా ఆవిడకు నోటి దురుసు కాస్త ఎక్కువ. మనసు మంచిదే !"

"సరేలే సంబడం, తిట్టేనప్పుడు తిట్టడం, పొగిడినప్పుడు పొగడ్డం, ఆడవాళ్ల బతుకు లింతేగా" అంటూ మూతి విరిచింది పేరిందేవి. "రావే జీవనా, లోపలకు పోదాంపద. అక్కడ చెప్పుదువుగానిలే సంగతులు !" అంటూ జీవనను చెయ్యిపట్టుకుని లోపలకు తీసుకుపోబోయింది.

"నాకు వేణ్ణీళ్ళూ అవీ వొద్దండీ ! రాత్రిళ్ళు స్నానం చేస్తే నాకు పడదు. ఇప్పుడు మీరు శ్రమ తీసుకుని అన్నం వండడం కూడా అనవసరం. తినాలని అంతగా లేదు" అన్నాడు మురళీకృష్ణ మొహమాటంగా.

"అదంతా ఆయనతో చెప్పు నాయనా ! వండమంటే వండడం, పెట్టమంటే పెట్టడం అంతే నా బతుకు ఈ ఇంట్లో !" అంటూ పేరిందేవి లోపలకు వెళ్ళిపోయింది.

అప్పుడే పక్కగదిలో మెళుకువ వచ్చిన అవతారం, అటువైపుగా తల్లి రావడం చూసి "ఎవరే వచ్చిందీ ?"అని అడిగాడు నత్తినత్తిగా.

"జీవనరా—నీ మరదలు !!"

"జీ...జీ...జీవనా !" అతను గభాలున లేచి కూచున్నాడు. "పెళ్ళైపోయిందన్నావుగా— ఎ...ఎ...ఎందుకే అబద్ధం చెప్పావూ ?"

"అబద్ధాలూ, సుబద్ధాలూ రేప్పొద్దున్న మాట్లాడుకోవచ్చు, అర్ధరాత్రి అంకమ్మ శివాలెందుగ్గాని పడుకో" అంటూ కొడుకును గదమాయించింది పేరిందేవి.

"స...స...సరేలే ! రే...రే...రేప్పొద్దున్నే మాట్లాడ్తాలే !" అంటూ అవతారం దుప్పటి ముసుగుతన్ని పడుకున్నాడు.

జీవన, పేరిందేవితో తన గోడంతా చెప్పుకుంది. "నన్నేం చెయ్యమంటావో చెప్పు అత్తయ్యా ! నన్నమ్మేయడానికి చూశారు మా వాళ్ళు ! నేనేం పశువునా చెప్పు !! అందుకనే పారిపోయొచ్చాను. తప్పంటావా ?"

"వయసుదేముందే పిచ్చిదానా ! డబ్బు గల మొగుణ్ణి, ముసిలివాడని వదులుకురావడం అంత మంచిపని కాదే !"

"అయితే..." జీవన సందేహంగా ఏదో అనబోయింది.

"ఊరికే అన్నాను. అంతే—వచ్చినందుకేమీ అంటంలేదు. ఆ అబ్బాయిని కూడా పిల్చుకురా, వణ్ణం వడ్డిస్తా !"

జీవన వాకిట్లోకి వచ్చేసరికి, మేనమామ నరసింహం, మురళీకృష్ణ పిచ్చాపాటీలో వున్నారు. ఆమె మేనమామ అంటున్నాడు— "నిన్ను నేను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నానయ్యా ! నీలాగా ఈ కాలపు యువతరం వుంటే ఆడవాళ్లకు అసలు ఆపదలే వుండవు. అవకాశం దొరికింది కదా అని నువ్వు జీవనను మోసం చేశావా ? ఆహా, ఆమెను జాగర్తగా వెంట బెట్టుకుని రక్షణ వున్న గూటి దగ్గరకు చేర్చావు. అక్కడుంది నీ గొప్పదనం !!"

కొంచెం ఇబ్బందిగా ఫీలయ్యాడు మురళీకృష్ణ. కొంతమందికి పొగడ్తలే ప్రాణం. కొంత మందికి అవంటే భయం. మురళీకృష్ణ రెండో తరహా మనిషి. అతని ఇబ్బందిని కనిపెట్టినట్లుగా జీవన అక్కడకు వచ్చి "అన్నం వడ్డించింది అత్తయ్య మీరు లేవండి !" అన్నది అతనితో.

"లే బాబూ, ఏ వేళన తిన్నావో ఏవిటో!" అంటూ నరసింహం కూడా అతనితో అని అతనిని లోపలకు తీసుకువచ్చాడు.

అన్నాల దగ్గర అతనిచేత కొసరి కొసరి తినిపించాడు. భోజనాలైంతర్వాత "వరండాలో పక్క వేయించాను. పడుకో నాయనా!" అన్నాడు

**జరిగిన కథ — 2 :** మురళీకృష్ణ, ఇంద్రసేన్, పాటల మాలచ్చి ఒకే రైల్లో ప్రయాణం చేసి దిగవలసిన స్టేషన్లో దిగుతారు. ఆ స్టేషన్‌లో తప్పించుకొని పారిపోయిన తన కూతురుని వెతుకుతూ ఒక పిల్ల తండ్రి, అతని అల్లుడు మురళీకృష్ణకు తటస్థపడతారు. తన తండ్రిని, బామ్మను తలచుకుంటూ ఆనందపురం పోవడానికై స్టేషన్ బయటికి వస్తాడు మురళీకృష్ణ. ఆనందపురం వెళ్లే దారిలో దొంగతనంగా ఒక లారీలో ఎక్కుతాడు మురళీకృష్ణ. అదే లారీలో దొంగతనంగా ప్రయాణం చేస్తున్న పెళ్లి కూతురు వేషంలో ఉన్న జీవనను చూస్తాడు. చంద్రనగర్‌కు పొలిమేరల్లో ఆగిన లారీనుంచి బయటపడ్తారు మురళీ, జీవన

ఆప్యాయంగా. జీవన కనిపిస్తుందేమోనని కొద్ది క్షణాలు ఎదురు చూశాడు. ఆమె రాలేదు. తలుపులు మూతపడ్డాయి. ఇంట్లో దీపాలు ఒక్కొటొక్కటిగా ఆరిపోతున్నాయి, ఒక్కో గదిలో. వరండాకి ఆనుకుని వున్న గదిలో, కిటికీ దగ్గరగా నిలిబడి జీవన అతనివేపు ఆర్ద్రంగా చూస్తూ అన్నది—"గుడ్‌నైట్ మురళిగారూ!"

"స్వీట్ డ్రీమ్స్ మిస్ జీవనా!"

జీవన గదిలోనూ లైటు ఆరిపోయింది. వరండాకు ఆనుకొని అటూ ఇటూ రెండు గదులున్నాయి. కుడివైపు గదిలో జీవన పడుకుని వుంది. ఎడమవైపు గదిలో నరసింహం, పేరిందేవీ పడుకున్నారు. జీవనవున్న గదిలో వెన్నెల కిటికీ సందులగుండా ముక్కలు ముక్కలుగా పడుతోంది. జీవన వెన్నెల కాంతిలో వెండి బొమ్మలా మెరిసిపోతోంది. ఆమె బుగ్గచుక్క అట్లాగే వుంది. వంటిమీద అదే పట్టుచీర, పెళ్ళిపీటమీది చీర! కాళ్ళ పారాణి చెరగిపోలేదు. గోళ్ళ గోరింటాకు మురిపిస్తూనే వుంది.

నరసింహం వాళ్ళ గదిలో మసక చీకటి. చీకటిని చీల్చుకుంటూ వాళ్ళ మాటలు గుసగుసలుగా! మురళీకృష్ణకు నిద్ర పట్టడంలేదు. అతను అటూ యిటూ దొర్లుతున్నాడు. రకరకాల ఆలోచనలు. రైలు ప్రయాణం, ముసలివాడైన ఓ అగంతకుడికి తను చేసిన సాయం, రైల్వే స్టేషనులో వెతుకులాట, లారీలో దూకడం, ఇనపచువ్వగాయం... అతనికి గాయమైన చోట కలుక్కుమన్నట్లనిపించింది. అబ్బా అనుకున్నాడు. ఆ గాయానికి జీవన కొత్తచీర చింపి కట్టు కట్టడం, ఆ బాధ తీయగా వుంది అతనికి. జీవన గురించిన ఆలోచనలు అతనిని పుప్పెనగా ముసురుకున్నాయి. ఆలోచనల మధ్యగా అతనికి జీవన పేరు వి ని పిం చిం ది. ఆసక్తిగా లేచి కూచున్నాడు. ఆ మాటలు నరసింహం పడుకొన్న చీకటి గదిలో నుంచి వినిపిస్తున్నాయి. అతను లేచి కూచుని, అనాలోచితంగానే ఆ గదివరకూ నడిచి, కిటికీపక్క నిలబడ్డాడు.

"ఇప్పుడీ తద్దినం కూడా దేనికండీ?— రేపొద్దున్న వాళ్ళ నాన్నరాడూ?— మీ చెల్లెలు లేదూ? వాళ్ళూరుకుంటారా?"

నరసింహం కి సు కి సు మ ని నవ్వాడు. "ఓసి వెర్రిదానా! ఇంతేనా నీకు అర్థమైందీ? వాళ్ళు జీవనను వెతుకుకొంటూ ఇక్కడకు వచ్చేసరికే కళ్యాణం జరిపించేస్తాను!"

"ఎవరికండీ కళ్యాణం?"

"జీవనకే?"

"ఎవరితో?"

"నీ కొడుకు, ఆ అష్టావక్రుడు అవతారం గాడితో!"

"అయ్యో పాపం!"

"పాపం లేదు, పుణ్యమూ లేదు. ఇంటి కొచ్చింది మనని వెతుక్కుంటూ. అవతారానికి






# జీవన మురళి

## 5

పిల్ల నెవరిస్తారే ? – కన్ను సరిగా వుందనా ? కాలు ఓడు కాదనా ? మాట సరేసరి – నత్తి వెధవ ! వాడికిచ్చి దాన్ని కట్టబెడితే ఇంటి పట్టున పనిపాటలు చేసుకుంటూ పడివుంటుం దది. నీకు పనిపాటల్లో తోడు, వాడికి పక్కలోకి తోడు, నాకు లెక్కా డొక్కాకి తోడు. ఏవంటావు !''

పెట్టరానిచోట చక్కిలిగిలి పెట్టినట్టు న్నాడు, పేరిందేవి పగలబడి నవ్వింది. ''మీ బుర్ర అమోఘం సుమాండీ !'' అంటూ దగ్గరకు తీసుకుని ముద్దులు పెట్టింది.

మురళీకృష్ణ గబగబా జీవన పడుకున్న గది దగ్గరకు వెళ్ళి, కిటికీలోనుండి ''జీవనా, జీవనా'' అంటూ పిలిచాడు. జీవన గాఢనిద్రలో వున్నట్టుంది. ఉలకలేదు, పలకలేదు. దూరంగా నాగలింగ చెట్టుకింద పూలు రాలి పడివుంటే, అవి ఏరుకొచ్చి ఆమెమీద విసిరివేస్తూ మెల్లగా పిలవసాగాడు. నాగలింగం పూలు ఆమె ఒళ్ళంతా తగిలాయి. ఒకటి వెళ్ళి ఆమె బుగ్గను ముద్దెట్టు కుంది. మరోటి ఆమె కళ్ళను చుంబించింది. వేరొకటి ఆమె నునులేత చెంపలను స్పర్శించింది. ఇంకొకటి ఆమె మెడను కౌగలించుకుంది. జీవన ఉలిక్కిపడి లేచింది. తలుపుతీసి బయిటకు రమ్మని సంజ్ఞ చేశాడు మురళీకృష్ణ. అయోమయంగా ఆమె బయటకు వచ్చింతర్వాత, నిరసింహం గది దగ్గరకు తీసుకువెళ్ళాడు. వాళ్ళ మాటలను జీవన కూడా విన్నది. విన్నతర్వాత, ''వాడంటే నాకు ఇష్టంలేదు. వాణ్ని నేను చేసుకోను !'' అన్నది బేలగా.

కొంచెంసేపు ఆగి, నరసింహం దంపతులు నిద్రపోయారని రూఢి పర్చుకున్న తర్వాత, లోపలకు వెళ్ళి పెట్టె, బెడ్డింగు బయటకు తీసుకువచ్చింది.

''ఇవిగో మీ సామాన్లు ! పదండి పోదాం !'' అన్నది నిశ్చయ కంఠంతో.

''ఎక్కడికి ?'' నెమ్మదిగా అడిగాడు మురళీకృష్ణ.

''ఎక్కడికైనాసరే ! పెనంమీది నుంచి పొయ్యిలోకి నేను పడలేను. నన్నెక్కడికైనా తీసుకుపొండి. ఎక్కడికైనాసరే ! ప్లీజ్ నన్ను రక్షించండి... రక్షించండి.'' ఏడుస్తోంది జీవన.

''బీ బ్రేవ్ జీవనా ! ఈ నరకంలో వుండొద్దు నువ్వు. మా ఇంటికి రా ! ఇష్టం వచ్చినంత కాలం వుండు. నిన్ను కాదనేవాళ్ళు ఎవ్వరూ లేరక్కడ !'' అతను జీవనను పొదివి పట్టుకుని బయటకు తీసుకువచ్చాడు. వెన్నెల తెల్లగా మెరుస్తోంది. వాళ్ళిద్దరూ వెన్నెల నీడల్లా ముందుకు నడుస్తున్నారు. దాటివచ్చిన ఆ చీకటి ఇల్లు వెనక పడుతోంది.

''చదువుకోనమని పట్నం వెళ్ళి, చెప్పా పెట్టాకుండా పెళ్ళి చేసుకుని ఏకంగా పెళ్ళాన్ని వెంటబెట్టుకునే తిరిగొస్తున్నావ్రా కృష్ణా ?'' అంటూ గుమ్మం దగ్గరే టౌకాయించింది వర్ధనమ్మ. ఏడు గుర్రాల రథంమీద సూరీడు ఇంకా జైత్రయాత్రకు బయుబదేరకముందే గృహప్రవేశం చేసి జీవనా, మురళీకృష్ణ తలుపు దగ్గర నిలబడినప్పుడు; మురళీకృష్ణ వ్యత్యస్త పాదారవిందంగా నిలబడి ''బామ్మా !'' అంటూ ప్రేమగా పిలిచినప్పుడు, భుజం నిండుగా పమిట చెంగు తిప్పుకుని నమ్ముకున్న మగవాడి వెనకదాగి అతని భుజాలమీదుగా లోపలకు సందేహ ప్రశ్నా నేత్రాలతో జీవన తొంగి తొంగి చూస్తున్నప్పుడు, పడక్కుర్చీలో కాళ్ళు బారజాపి పడుకుని కాఫీని ఆర్చుకుని ఆర్చుకుని తాగుతూ ఎదురుగా కనిపించిన కొడుకును చూసి ''అమ్మా ! అబ్బాయొచ్చాసాడే !'' అంటూ ఆనందోద్వేగాలతో కేకేసి చెప్పి తెలియని ఆడపిల్ల ఎవరో అతని పక్కన పెట్టె పట్టుకుని బుగ్గన చుక్కతో, పట్టుచీరలో, తలలో పూలతో, కాళ్ళ పారాణితో, నిలబడి వుండడం చూసి రకరకాల రంగు రంగుల భావాలు తలను ఒక్కుమ్మడి తొలచివేస్తుండగా ''ఎవరో అమ్మాయి కూడా మనవాడి వెంట వచ్చినట్టుందే !'' అనేసి కాఫీగ్లాసు నవతల పెట్టేసి పరమేశ్వరం లేచి నాలుగడుగులు గుమ్మం దగ్గరకు వేసినప్పుడు !

అటు తండ్రికీ, ఇటు నాయనమ్మకూ కూడా వొకేసారి సమాధానం చెప్పినట్టుగా అన్నాడు మురళీకృష్ణ. ''ఈ జీవన పెళ్ళి కూతురేకాని, నా భార్య కాదు !'' పరమేశ్వరం గబగబా దగ్గరకు వచ్చాడు. ''అక్కడే నిలబడి పోయారేమర్రా – లోపలకు రండి ! ఏరా మురళీ, రాత్రే వస్తానన్నావుగా, ఇప్పుడొస్తున్నావేమీ ? అమ్మా – ఆ అమ్మాయికి, ఏవిట్రా ఆ అమ్మాయి పేరు, జీవనా ? ఆఁ ! జీవన మొహమాట పడుతున్నట్టుంది, లోపలకు తీసుకు వెళ్ళు. పట్నం పిల్లలు కదా, కాఫీ తాగింతర్వాత స్నానాలు చేస్తార్లే, ఇప్పుడు నీ ఆచారాల వుచ్చులో వాళ్ళను బిగించక్కు, వెళ్ళమ్మా లోపలకు వెళ్ళు. ఆ పెట్టె అక్కడ పెట్టమ్మా ! ఇది నీ ఇల్లే అనుకో – ఫ్రీగా వుండు వున్నంత కాలమూ ! నేనూ, అదిగో మా అమ్మ, ఇప్పుడు మీ ఇద్దరూ, ఇంతేనమ్మా ఈ ఇంట్లో ! ఆడపిల్ల నట్టింట తిరిగి ఎంత కాలమైందో, ఇన్నేళ్ళకు పచ్చగా నువ్వు ఇంట్లో అడుగుపెట్టావ్, పదపద లోపలకు పద !'' పరమేశ్వరం ప్రవాహంలా మాట్లాడేస్తున్నాడు.

''ఏమ్మా ? కాఫీ తెమ్మంటావా, స్నానం చేసింతర్వాతే కాఫీ తాగుతావా ?'' అని అడిగింది వర్ధనమ్మ.

"స్నానం చేసి పూజ చేసుకున్న తర్వాత గాని, కాఫీ తాగనండీ !" అన్నది జీవన.

వర్ధనమ్మ కళ్ళల్లో ప్రశంస. మురళీకృష్ణ కళ్ళల్లో 'అమ్మదొంగా !' అన్న కొంటెతనం పరమేశ్వరం కళ్ళల్లో ఓ గుర్తింపు. వర్ధనమ్మ జీవనను లోపలకు తీసుకు వెళ్ళింది.

"కాఫీ తాగు నాన్నా! గ్లాసు అక్కడే పెట్టేశావ్ ?" అని గుర్తుచేశాడు మురళీకృష్ణ.

"అవున్నా ! మీరు రావడం చూసి, దాని సంగతే మర్చిపోయాను !"

"చల్లారిపోయి వుంటుంది. ఇట్లా ఇయ్యి. వెచ్చపెట్టించి తీసుకువస్తాను !"

"నీ కెందుకురా ? నువ్విట్లా కూచో. నీ చదువు ముచ్చట్లూ, ప్రయాణం సంగతులూ చెప్పు, వింటాను" అన్నాడు పరమేశ్వరం. "అమ్మా— కాఫీ కాస్త వెచ్చబెట్టి తెచ్చిపెట్టు!"

"బామ్మ మడిగట్టుకుని వున్నట్టుంది నాన్నా! ఇది పూజా సమయం కదా, ఆ గ్లాసిట్లా ఇవ్వండి, నిముషంలో వేడిచేసి తీసుకువస్తాను !"

"వద్దు లేరా !" అంటున్నా వినకుండా మురళీకృష్ణ ఆ కాఫీగ్లాసు తీసుకుని లోపలకు పరుగెత్తాడు. గుమ్మం దగ్గరేజీవన నిలబడివుంది.

"ఏం జీవనా ...?"

"స్నానం చేసి వస్తానని మామ్మగారితో చెప్పాను ! ఆమె అట్లాగేనని పూజగదిలోకి వెళ్ళారు !"

"చెయ్యి !"

జీవన తలవొంచుకుని చెప్పింది. "మార్చుకోను మరో చీర లేదు, తుడుచుకోను తుండు గుడ్డ లేదు !"

మురళీకృష్ణ ఆమె కొసతేలిన గడ్డం పట్టుకుని ఆమె మొహాన్ని లేవనెత్తి ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆ కళ్ళు తడితడిగా వున్నాయి. "పిచ్చిదానా ! ఈ ఇంటికి వచ్చిన హర్‌హైనెస్‌వి నువ్వు. గౌరవనీయురాలివైన అతిధివి. ఇదిగో తుండు, అదిగో బాత్‌రూం. ముందు స్నానం చేసిరా ! డ్రెస్ ఛేంజ్ గురించి ఆలోచిద్దాం ఆ తర్వాత !"

ఆమె కళ్ళలో తడి, మెరపు మరకైంది. ఆమె బాత్‌రూం వైపు నడిచింది. జీవనను అటు పంపి, కాఫీ గ్లాసు తీసుకుని వంట ఇంట్లోకి నడిచాడు, పొయ్యి దగ్గరకు.

"ఒరేయ్, వొరేయ్ పొయ్యి మైలపడి పోతుందిరా !" గోల పెట్టింది ఆ మూలగా పూజ చేసుకుంటున్న వర్ధనమ్మ.

"ఎన్నాళ్ళైందే బామ్మా నువ్విట్లా గొడవ చేసి !" అన్నాడు మురళీకృష్ణ పొయ్యిమీద కాఫీ వెచ్చచేస్తూ.

"ఓరి భడవకానా, నువ్వా గొడవ చేస్తోంది, నేన్నా ? వచ్చేవో లేదో, అప్పుడే అల్లరి మొదలు పెట్టావ్రా ! ఒరే అబ్బాయా, ఇటోసారి వచ్చిపోరా, నీ కొడుకు వాడి కృష్ణలీలలు మొదలు పెట్టాడు." అంటూ కేకవేసింది వర్ధనమ్మ.

"బామ్మా ! నువ్వింకోసారి పెద్దగా అరిస్తే, నిన్నే మైలపడేస్తా, నువ్వు మైలపడితే పాపం, నీ దేవుడూ మైలపడిపోతాడు, ఆ తర్వాత నీ ఇష్టం."

"కృష్ణా, కృష్ణా, అంత పని చేయకు. నన్ను మైల పడేయకు. మళ్ళీ వెళ్ళి ఆ బావిలో నీళ్ళు నెత్తిన గుమ్మరించుకోలేను, పెద్ద ముండని !"

"అయితే గప్‌చిప్, నో కంప్లయింట్స్ !"

వర్ధనమ్మ నవ్వుతూ రెండు పెదిమలమీదా తన వేలుంచుకుంది. వేడెక్కిన గ్లాసు తీసుకుని మురళీకృష్ణ, పరమేశ్వరం దగ్గరకు నడిచాడు.

"ఇదిగో నాన్నా, కాఫీ !"

"ఒరేయ్, మురళీ ఇట్రా — కూచో, నువ్వూ కాఫీ తెచ్చుకోకపోయినావా ? ఏమిట్రా కన్నా — ! అంత చిక్కిపోయావ్ ? పరీక్షల కోసం అంతగా చదివావుట్రా — అవున్లే ! చదవకపోతే ఎట్లాగు— మన మధ్యతరగతి వాళ్ళకు ఈ పరీక్షలూ, డిగ్రీలూ, ఉద్యోగాలూ ఇవేగా ముగడ ! సరే, క్లాసొస్తుందంటావా, క్లాసేనా, డిస్టింక్షన్ కూడానా ?"

మురళీకృష్ణ నవ్వుతూ వెళ్ళి పెట్టె తెరిచి అందులోనుండి ఓ అందాల చిన్న అట్టపెట్టెను తీసుకువచ్చి తండ్రికి అందించాడు. "చూడు నాన్నా !" పరమేశ్వరం ఆతృతగా ఆ పెట్టె తెర్చి చూశాడు. లోపల పొత్తిళ్ళలో పసిపాపలాగా, వెల్వెట్ పీఠంమీద బంగారు పతకం ముద్దుగా మెరుస్తోంది.

"గోల్డ్ మెడలిస్ట్‌వా తండ్రీ !" ఆ తండ్రి కంఠం ఆనందంతో రుద్ధమైంది.

"కాన్వొకేషన్ కూడా పూర్తిచేసుకుని ఏకంగా రావడం చేతే ఇంతాలస్యం అయింది నాన్నా !"

"ఇది నీ చదువుకు కొలమానం అయితే, ఇరవైఅయిదు సంవత్సరాల నా తపస్సుకు ప్రతిఫలం మురళీ ! నిన్ను గురించే నా తపస్సు. నీ మీదే నా ఆశలు !"

పరమేశ్వరం లేచి నిలబడి తనంత అయిన కన్నకొడుకును చేయిపట్టి గోడకు వ్రేలాడుతున్న తన భార్య ఫొటో దగ్గరకు తీసుకు వచ్చాడు.

"లక్ష్మి ! చూశావా మన వాణ్ని ! నా అంతవాణ్ని చెయ్యమన్నావ్, నా కన్నా పెద్దవాణ్నే చేశాను, గోల్డ్‌మెడలిస్ట్‌ను చేశానే ! ! పొత్తిళ్లలో పసివాణ్ని నాకు అప్పగించి, నన్నన్యాయం చేసి, నువ్వు వెళ్లిపోయినా, వాడిలోనే నిన్ను చూసుకున్నాను. అక్కణ్నుంచి నువ్వు దీవిస్తున్నావనుకున్నాను. నీ దీవెనల వర్షంలోనే వాణ్ని పెంచాను, ఇంతవాడయ్యాడు వాడు. ఇహ ఓ ఉద్యోగస్థుడవుతాడు, ఆ పైన పెళ్లి చేసుకుంటాడు, ఓ ఇంటి వాడవుతాడు" పరమేశ్వరం కళ్ళు మూసుకుని భార్యతో మాట్లాడేస్తున్నాడు. ఆయన కళ్ల నుండి కన్నీరు ధారగా కారిపోతున్నది. "వాడి కడుపున ఓ నాలుగు కాయలు కాస్తాయి. మొదట పుట్టిన ఆడపిల్లకు నీ పేరే పెడతాడు. బిడ్డ బిడ్డ తరానా, నువ్వు ఈ ఇంట్లోనే






వుండిపో లక్ష్మీ ! వుండి వాళ్లను దీవిస్తుండు.'' పరమేశ్వరం కళ్లు తెరిచాడు. పక్కన మురళీకృష్ణ కనిపించలేదు. ''ఒరే మురళీ—'' గంభీరంగా పిలిచాడు.

''వస్తున్నా నాన్నా !'' మురళీకృష్ణ దొడ్లోనుండి వస్తున్నాడు.

''అమ్మకు నమస్కారం చెయ్యకుండా ఎక్కడకు వెళ్లావురా ?''

బాత్‌రూం దగ్గరకువెళ్లి జీవనకు గుడ్డలిచ్చి వస్తున్నట్లు అతను చెప్పలేకపోయాడు. అక్కడ జరిగింది జ్ఞాపకం వచ్చి అతని మొహం కళగా వెలిగింది.

* * *

''ఇదిగో జీవనా ప్యాంటు, చొక్కా !'' అన్నాడు వాటిని బాత్‌రూం గోడమీద వేస్తూ. లోపల్నుండి జీవన్ కీచుగా అరిచింది ''ప్యాంటూ, చొక్కానా ?''

''ఆహా, అవే !''

''నేనెప్పుడూ వేసుకోలేదండీ ! పట్టుచీర ఆరేసుకుని, అది తడిపొడిగా ఆరింతర్వాత బయట కొస్తాను !'' గోడమీదున్న చీరను లోపలకు లాక్కోబోయింది.

''విడిచిన చీరను కట్టుకోడం అనవసరం!'' అతను చీరను ఇవతలకు లాగేసుకున్నాడు. ''చాకలి వచ్చి ఉతికేస్తుంది. నీక్కీశ్రమ అక్కర్లేదు !''

''ఇదెక్కడి గొడవండీ, చెబితే వినరు ...'' జీవన ఉడుక్కొంది.

''ఇదెక్కడి మనిషమ్మా, చెబితే వినదు...'' మురళీకృష్ణ విసుగు నటించాడు.

* * *

''సరేలే, నమస్కారం పెట్టు'' పరమేశ్వరం ఆజ్ఞాపించాడు. మురళీకృష్ణ రెండు చేతులూ జోడించి, నమస్కారం పెడుతూ కళ్ళు మూసుకున్నాడు నమ్రభావంతో.

''అమ్మా ! నువ్వెట్లా వుంటావో నాకు తెలీదు. అయినా నాన్న మొహంలోనే నిన్నూ చూడడానికి ప్రయత్నం చేసేవాణ్ని నా చిన్న తనంలో ! బామ్మ పెట్టిన గోరుముద్దల అమృతంలోనే నీ అభిమానాన్నీ చూడటానికి ప్రయత్నం చేశాను ఆ రోజుల్లో ! ఆ చిన్నతనం గడిచిపోయింది, ఆ రోజులూ వెళ్ళిపోయాయి,ఇహ జీవిత సమరంలోకి అడుగుపెట్టే సమయం వచ్చింది. ఆశీర్వదించు !''

వెనగ్గా వచ్చి నిలబడింది జీవన. ఆమె వేసుకున్న ప్యాంటు వదులుగావుంది. తొడుక్కున్న అమెరికన్ జాకెట్టు గూళ్ళ కిందకు దిగింది. మగదుస్తుల్లో పదహారేళ్ళ కుర్రాడిలా అమాయకంగా ఆమె కనిపిస్తోంది. జుట్టుపైకి దువ్వుకుని వెనక ముడివేసుకుంది. కాళ్ళపారాణి కరిగిపోయి, పాదాలు వెన్నెల ముద్దలా కనిస్తున్నాయి. చేతులు తమలపాకుల లేతదనంతో

## జీవన మురళి

తెల్లగా తళతళ లాడుతున్నాయి. కళ్ళకు కాటుక లేదు. పెదిమలు మాత్రం ఎర్రగా జ్వలిస్తున్నాయి.

పరమేశ్వరం వెనకకు తిరగకుండా అన్నాడు, ''అప్పడే మా అబ్బాయి వచ్చేసిన సంగతి మీకు తెలిసిపోయిందా నాయనా ! ఇహ వాణ్ని ఒక్క క్షణం ఇంటిపట్టున వుండనీరుగదా ? మీరూ, మీ తిరుగుళ్లూనూ !! ఇవ్వాళా రేపూ వాణ్ని వదిలిపెట్టండి బాబూ, రెండేళ్ళ తర్వాత ఇంటికి వచ్చాడు. కడుపునిండా వాణ్ని తిండితిననీయండి, నోటినిండా మాతో మాట్లాడనీయండి. ఆ తర్వాత మీ ఇష్టం !''

జీవన పక్కున నవ్వింది. ''ఎందుకోయ్ నవ్వుతావ్ ?'' ఆయన వెనక్కు తిరిగాడు. ఒక్క క్షణం జీవనను చూసి తెల్లబోయారు. అంతలో తేరుకుని ''ఇదేమిటమ్మాయ్ ?'' అన్నాడు, నమ్మలేనట్టుగా.

> ### మనిషి-మనీషి-మహర్షి
>
> అవకాశం కోసం
> ఎదురు చూసేవాడు మనిషి !
> అవకాశాన్ని
> సద్వినియోగం చేసుకొనేవాడు మనీషి !
> తానే అవకాశమై
> చిత్తశుద్ధితో లక్ష్యాన్ని ఛేదించే వాడు
> మహర్షి !
>
> – డా. గుమ్మనూరు రమేష్‌బాబు

''ఆ అమ్మాయికి ఈ డ్రస్సంటే ఇష్టం నాన్నా ! ఇంట్లో వున్నప్పుడు ఇటువంటివే వేసుకుంటుంది !'' అన్నాడు మురళీకృష్ణ.

''ఆ ప్యాంటూ, చొక్కా ఆమెకు సరి పోయినవి కానట్టుందిరా, మరీ లూజుగా వున్నాయి'' అన్నాడు.

''అవి ఇప్పటి ఫ్యాషన్ నాన్నా !''

జీవనకు తమాషాగానూ వుంది, చచ్చిన చావుగానూ వుంది. ''ఇంట్లోకి వెళ్ళు !'' అంటూ మురళీకృష్ణ సంజ్ఞ చేస్తున్నాడు.

ఆమె జవాబు చెప్పకుండా లోపలకు నడిచింది. వంటింటి గుమ్మం దగ్గరకు రాగానే వర్ధనమ్మ జీవనను నిలేసింది. ''ఎవరబ్బాయ్ నువ్వు ? సరాసరి గుమ్మందాటి వంటింట్లోకే వచ్చేస్తున్నావ్—'' అంటూ దబాయించడం మొదలెట్టింది.

''బామ్మా ! ఎవరనుకున్నావ్—? జీవన!!'' అన్నాడు మురళీకృష్ణ పగలబడి నవ్వేస్తూ.

''ఇదేమిటీ— ఈ డ్రస్సేమిటీ ? చక్కగా పొందిగ్గా చీర కట్టుకుని, లక్షణంగా మొగాన కానీ అంత బొట్టు పెట్టుకుని, లక్ష్మీదేవిలా వుండక ఈ ఇంగ్లీషు డ్రస్సేమిటీ ఇంట్లో వున్నప్పుడూ ?'' అన్నది.

''అట్లాగే వుంటానండీ ! మీరుచెప్పినట్లే, మీ మనసుకు నచ్చినట్లే !'' అన్నది తల వంచుకొని జీవన. ''కాసేపు దేముడికి దణ్ణం పెట్టుకోనాండీ ?''

''వద్దు, వద్దు. ఈ డ్రెస్‌లో లోపలకు రావద్దు. పూజ చేసిన కుంకుమ ఇస్తాను. ఈ పూటకు అది పెట్టుకో, చాలు !'' అన్నది వర్ధనమ్మ పొయ్యిమీద నుండి తప్పేలాదింపుతూ.

''బామ్మా— పూజకు డ్రస్సు ముఖ్యమా? మనసు ముఖ్యమా ?'' అన్నాడు మురళీకృష్ణ అమాయకంగా మొహం పెట్టి.

''అఘోరించినట్టుంది నీ ప్రశ్న. ఆత్మ ముఖ్యమా ? శరీరం ముఖ్యమా ? దేవుడు ముఖ్యమా ? దేవుడున్న ఆలయం ముఖ్యమా ? అన్నీ ముఖ్యమేరా తండ్రీ !! సన్యాసం పుచ్చుకున్న వాళ్ళకే అన్నీ సమానం !'' వర్ధనమ్మ ఓ కాయితం ముక్కలో అమ్మవారి కుంకుమ పెట్టి గడప ఇవతలగా పెట్టింది. ''తీసుకో అమ్మాయ్! కుంకుమ తీసుకో. ఆ గ్లాసులో కాఫీ వుంది తాగు !''

జీవన కళ్ళకద్దుకుంటూ ఆ కుంకుమ తీసుకుని నొసటన దిద్దుకుంది. కాఫీ గ్లాసందు కుంది.

''అమ్మా, అన్నం పెడ్తావా, స్కూలు వేళయింది !'' హాల్లోనుండి పరమేశ్వరం అడిగాడు.

''అయిపోయిందిరా, ఒక్క క్షణం !'' లోపల్నుండి వర్ధనమ్మ సమాధానం చెప్పింది.

జీవన, మురళీకృష్ణ హాల్లోకి వచ్చారు. పరమేశ్వరం మడిపంచ కట్టుకున్నాడు.

''జీవనా ! స్నానం చేసి వస్తాను. ఒక్క క్షణం నాన్నగారితో మాట్లాడుతుండు.'' తుండు తీసుకుని ఆతను బావి దగ్గరకు వెళ్ళి పోయాడు.

''ఏమ్మా ! నీ గురించి నాలుగు సంగతులు చెప్పు. వింటాను !'' అన్నాడు పరమేశ్వరం నామం పెట్టుకుంటూ.

''ఏముందండీ ! నేనో దురదృష్టవంతు రాల్ని !'' అన్నది జీవన లోగొంతుకలో.

చివాలున తలెత్తాడు పరమేశ్వరం. ''ఇంత చిన్న వయసులో అంత పెద్ద మాటలెందుకు తల్లీ ?''

''మిమ్మల్నేమని సంబోధించాలో నాకు తెలీడంలేదు మావయ్య గారూ ! ఆ మాటలే నేను అంటాను. పుట్టిన కొద్ది రోజులకే తల్లిని పోగొట్టుకున్నాను ! అంతకన్నా ఏవనను?

''అయ్యో పాపం,మా వాడిలాగేనన్నమాట!''

''మారుటి తల్లికి నా పొడ గిట్టదు. కన్న తండ్రికి నేను గుండెలమీద కుంపటిని ! పెళ్ళి కొచ్చినవాడు నా తాతయ్య వయసు వాడు. పారిపోయి ఒకరి అండ చేరితే, అక్కడా నాకు

# మీ పంటలకు కావలసిన పోషణ అందుతోందా?

## జై కిసాన్ సంపూర్ణ 19:19:19

## జై కిసాన్ యూరియా 46.4% నత్రజని




## ఏ ఇతర ఎరువు కన్నా హెచ్చు పోషక పదార్థములు కలవి!

- జైకిసాన్ సంపూర్ణ 19:19:19
  పోషక పదార్థములు 1·1.1 పాళ్లలో గల సంకీర్ణ ఎరువులలోకెల్లా మిన్నయైనది.
- నైట్రేట్-నత్రజని గల ఎరువులతో పోల్చితే, సంపూర్ణలోని నత్రజని ఏమీ వృథాపోదు
- సంపూర్ణలోని పోషక పదార్థములన్నీ నీటిలో కరుగుతాయి.
- అందువలన పంటలపై దీని పనితనం తొందరగా కనబడుతుంది.
- జైకిసాన్ యూరియా 46.4%లో నత్రజని ఎంతో ఎక్కువ, బైయూరెట్ తక్కువ.
  అందుచేత ఇది అన్ని రకాలుగా వేయడానికీ, పంటపై పిచికారి చేయడానికీ సురక్షితమైనది
- అతి తెల్లనిది, అతి శుద్ధమైనది, అతి శక్తివంతమైనది.




# జై కిసాన్ ఎరువులు

## అత్యధిక దిగుబడి కోసం అత్యధిక పోషణ.

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగపూర్, పూనా, జువారి నగర్.

JAI KISAAN

LINTAS.ZUA.106-2315 TL













## జీవన మురళి

కాలనాగే ఎదురైంది. దారిలో మీ అబ్బాయి కనబడి ఇక్కడికి తీసుకు రాకపోతే, నా శవాన్ని ఏ రాబందులో పీక్కుతింటుండేవి ఈ సమయానికి! చావే దూరమైతే నన్ను కొన్నవాడు నా మాంసాన్ని అమ్మి వ్యాపారం చేసుకునేవాడు!'' జీవన ఎంత ధైర్యంతో ఈ మాటలు చెబుదామని అనుకున్నా, చివరకు వచ్చేసరికి ఆమెకు కన్నీళ్ళు ఆగలేదు. ఆమెకు తెలియకుండానే అవి ఆమె చెంపలమీద నుండి కారడం మొదలెట్టాయి.

జీవన కన్నీరు చూసేసరికి పరమేశ్వరం తాను మడిగట్టుకుని వున్నానన్న సంగతి కూడా మర్చిపోయేడు. ఆమె దగ్గరకు వచ్చి ఆమె తలపై చెయ్యివేసి అనునయించాడు—''వద్దమ్మా, అట్లా మాట్లాడకు. ఆడపిల్లను గౌరవించలేని దేశమూ, కన్నీరు తుడవలేని ఇల్లూ ఎప్పటికీ పైకి రావు. మావాడు మంచిపనే చేశాడు. ఇది నీ ఇల్లే అనుకో! ఇక్కడ నీకేం భయం లేదు. మేం అందరం నీ మనుష్యులమే ననుకో! నిర్భయంగా, నిశ్చింతగా, నీ జీవితానికి ఒక మార్గం ఏర్పడే దాకా వుండు!''

బాత్‌రూంలో నుండి వచ్చిన మురళీకృష్ణ ఆ దృశ్యాన్ని చూశాడు. ''నాన్నా! చూశావా జీవన మాటల్లోపడి నువ్వు మైలపడిపొయ్యావ్!'' అన్నాడు కొంటెగా.

''పర్వాలేదురా మురళీ! ఆ అమ్మాయి పెదిమలమీదికి నవ్వు తెప్పించగలిగితే, మైలపడ్డా పర్వాలేదు.'' అన్నాడు పరమేశ్వరం, మడిబట్టను తడిపి కట్టుకోడం కోసం దొడ్లోకి వెళుతూ.

ఆయన అటు వెళ్ళింతర్వాత, ''జీవనా! నీ దగ్గర ఏదన్నా ఇంద్రజాలం వుందా?'' అన్నాడు మురళీకృష్ణ మెచ్చికోలుగా.

జీవన కంటికొనల నుండి అతనివేపు చూసింది. ''మీకే తెలియాలి!''

''కృష్ణా — మీకూడా వడ్డించేమంటావా?'' వర్ధనమ్మ లోపల్నుండి అడిగింది.

''అప్పుడే కాదు బామ్మా! బజారు వెళ్ళొస్తాం — ఆ తర్వాత!''

భోజనం చేసి, హెడ్మాష్టరు వేషం వేసుకుని, పరమేశ్వరం బయల్దేరుతున్నాడు.

''సాయంకాలం పెందరాళే వచ్చేస్తాను. ఇంట్లోనే వుంటారుగా?'' అంటూ అడిగాడు.

''వెళ్ళిరండి నాన్నా! మీకోసం వెయిట్ చేస్తుంటాం!''

ఆయన చెప్పులేసుకుని, ఫైళ్ళు తీసుకుని, బయటకు వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిన కొద్దిసేపటికి జీవనను తీసుకుని మురళీకృష్ణ వీధిలోకి బయల్దేరాడు. ''తొందరగా వచ్చేయండి!'' వెనకనుండి హెచ్చరికలు పలుకుతోంది వర్ధనమ్మ.

[ఇంకా వుంది]

# ప్రశ్నావళి!

కె. రామలక్ష్మి

## కల్యాణి — బెండమూర్లంక

స్త్రీకి ఆస్తి హక్కుపై మీ అభిప్రాయం ? వరకట్నాలు పోతాయి అంటారా ?

★ ఆస్తి హక్కుకి వరకట్నానికి సంబంధం లేదు. కూతుర్ని కొడుకుతో సమానం చేయడానికి ఆస్తి హక్కు రావాలి — ఇక వరకట్నం అంటారా ? అది సిగ్గులేని తల్లితండ్రులు ఎలాగైనా ఎవడికో తమ కూతుర్ని కట్టపెట్టడమే ప్రధానంగా ఎంచి యిచ్చే డబ్బు. ఆడపిల్ల అంత చులకనా ? చదువుకోలేదా ? ఉద్యోగం చేయలేదా ? మనిషిగా బ్రతకలేదా ? ఎందుకామెని చేపట్టడానికి డబ్బివ్వాలి ? కట్నం పోవాలంటే తల్లితండ్రుల దృక్పథం, అమ్మాయిల దృక్పథం కూడా మారాలి—డబ్బిచ్చేనాసరే ఒకరికి భార్య అనిపించుకోవాలి అన్నది చాలా చౌకబారు సంప్రదాయం. మనిషికి మనిషికి పెళ్లి ఒక వారధి, దానికి డబ్బు ప్రాతిపదిక కాకూడదు. అలా అయితే అది కలకాలం నిలవదు.

## పి. ఆర్. ఎస్. — ఇల్లెందు

అక్కా ! నేనొక అమ్మాయిని ప్రేమించాను. నేను 10 క్లాసు ఫేల్ అయ్యాను. ఆమె పాసయ్యింది. ఇప్పుడు నీకూ నాకూ కుదరదు అన్నది. ఏం చేయాలి ?

★ మళ్లీ పదో క్లాసు పాసయ్యే ప్రయత్నం చేసి — యీ సారి కాస్త తెలివిగా ఓ ఐదో క్లాసమ్మాయిని ప్రేమించు తమ్ముడూ; లేకపోతే ఏమిటీ పిచ్చి ? చదివేది 10 క్లాసు. ప్రేమించే వయసా అది ?!

## పి. ఆర్. ఆర్. — పటమట

చిన్నపిల్లలు దేవుడితో సమానం అంటారు. మరీమధ్య సినిమాలలో వాళ్లతో పెళ్లిళ్లు జరిపించడం, పెద్ద మాటలు మాట్లాడించడం ఆఖరుకు పాటలు కూడా పాడించడం జరుగుతోంది. ఇది సమంజసమా ?

★ సినిమాల్లో — అన్నీ సమంజసమైనవే జరుగుతున్నట్టు చూపిస్తున్నారా సార్ — చెప్పండి ?!

## షణ్ముఖ — సువాబేడ

మాతృత్వం ఒక మధురానుభవం. భగవంతుడు ప్రసాదించిన వరం అంటారు కదా! అయితే పెళ్లి కానంత మాత్రాన స్త్రీకి దక్కకుండా పోవాలా ?

★ ఇది మరీ బాగుంది షణ్ముఖా ! ఎంత వరమైనా కూడా అడక్కుండా ఇచ్చేయడమేనా?!

## పి. ఎల్. ఎమ్. — అక్కపల్లి

జీవితాశయాలకు ఆఖరు క్షణాలెప్పుడు ?

★ ఎదురు దెబ్బ తగిలినప్పుడల్లా — ఆశయాలకు చచ్చినంత పని అవుతూనే వుంటుంది.

## ఎమ్. జె. ఆర్. — సికింద్రాబాదు

కొందరెందుకండీ తామే గొప్పవారిమని చాటుకుంటారు ? అది చెప్పవలసింది పైవారు కదా ?

★ ఫూల్సు వుంటారు. వారికి తామే తమ గురించిన రైట్ ఎస్టిమేట్ యివ్వగలమని నమ్మకం. అంతేకాదు పైవారందరివీ తప్పుడు అభిప్రాయాలనికూడా నిరూపించాలని తాపత్రయపడతారు. అదో జబ్బు.

## వి. ఉ. — ఘంటసాల

మన దేశంలో కూడా స్త్రీకి మారణాయుధాలిస్తే ?

★ ఏముందీ ? 'ఏమండీ ఏం చేయమంటారు ?' అంటూ శ్రీవారిని అడుగుతారు నూటికి తొంభయిమంది !

చదువుకున్న సంస్కారహీనులకు మీరిచ్చే సలహా ?

★ ఏం లేదు. వాళ్లు చదువు'కొన్న' సంగతి జ్ఞాపకం చేసుకుని వూరుకోవడమే.

## బి. ఎమ్. ఆర్. — ఇల్లెందు

ఒకమ్మాయి నన్ను సీరియస్‌గా చూస్తోంటుంది. సీరియస్‌నెస్ ఈజ్ సీక్రెట్ లౌ అన్నారు ఏమంటారు ?

★ ఎవరన్నారంటూ !? ఉట్టినే చూడడం—చూడడం కాదు. చూపులకి చాలా అర్థాలుంటాయి. జాగ్రత్త !

## ఎ. ఆర్. సి. ఆర్. — పత్తెనపల్లి

తన జీవితంలోకి రాబోవు వ్యక్తి పవిత్రంగా వుండాలని కోరుకునే మగవాడు, తాను మాత్రం ఎందుకు పవిత్రంగా వుండడు ?

★ మగవాళ్లు పవిత్రతకి అతీతులవి నమ్ముతారు !

## పి. బి. ఆర్. — గునుపల్లి

నేనొక అమ్మాయిని ప్రేమించాను. మా ప్రేమ పెళ్లి వరకు వెళ్లింది. కాని యీ విషయాలు ఆమె తల్లిదండ్రులవరకు వెళ్లి ఒప్పుకోవడంలేదు.

★ పెళ్లిదాకా వెళ్లేదాకా పేరెంట్సు దగ్గర నుంచి మీ ప్రేమ వ్యవహారం దాచడం దేనికి ? !

## కె. ఆర్. వి. డి. — ఫెర్టిలైజర్ సిటీ

ఈ 'తారక రాముని' కాలంలోనైనా ప్రజల సమస్యలు గట్టెక్కుతాయా ?

★ సమస్యలు ప్రవాహం లాంటివి. పాతవి కొట్టుకుపోతూవుంటే — కొత్తవి వస్తూనే వుంటాయి. ★

ఇటీవల మదరాసు సంగీత అకాడమీ ఆధ్వర్యంలో స్వామి శంకరదాసు ఆడిటోరియంలో డా. మంగళంపల్లి బాలమురళీకృష్ణగారికి అఖండ సన్మానం జరిగింది. శ్రీ జి. వి. అయ్యర్ డా. బాలమురళీకృష్ణగారికి 'గండపెండేరం' తొడుగుతున్న దృశ్యం. శ్రీమతి ఎస్. జానకి, శ్రీ టి. వి. కె. శాస్త్రిగార్లనుకూడా చిత్రంలో చూడవచ్చు.



సీరియల్

# మూగ ముత్యాలు

## యలమంచిలి ఝాన్సీలక్ష్మి

*(గత సంచిక తరువాయి)*

"రేఖా! ఎందరు స్నేహితులో నీకు? వీళ్లందరి మధ్యా ఎలా బ్రతికావమ్మా? ఇందరిలో ఏ ఒక్క మనిషీ నిన్ను నిన్నుగా ప్రేమించి, స్వీకరించలేకపోయాడు? ఆ సంగతి గుర్తించి కూడా నీవెందుకిలా జీవితాన్ని అపనిందల పాలు జేస్తున్నావు? అరుంధతమ్మగారన్నట్లు... నువ్వు...అర్థంలేని యీ నాగరికత మోజులోపడి ..నిషాతో తూలిపోతూన్న క్షణాల్లో, నిన్ను నీవే మరిచి ... ఏ పశువు ఆకలికో ఆహుతైపోలేదు గదా?! భగవాన్! అంతటి ఘోర పరిస్థితి నా రేఖ జీవితంలో రానీయకు ప్రభూ!" సారధి కళ్లు చెమర్చాయి ఆ వూహలు కదుల్తుంటే.

ఎక్కడెక్కడో తిరిగాడు! శశిరేఖ స్నేహితులందరినీ కలుసుకున్నాడు, కానీ ఎవరిదగ్గరా ఆమె అడ్రసు దొరకలేదు. పదిరోజులకి ఆఫీసు నుంచి ఫోన్ వచ్చింది అతడు కాలేజీలో వున్నపుడు —

"హలో! శశిరేఖా స్పీకింగ్! యస్! నేనే సారధిగారూ! ఎలా వున్నారు తమరు? ఢిల్లీ నుంచి ఆగ్రా వరకు వెళ్ళొచ్చాం!"

"మంచిది! నా కవతల క్లాసుంది!" సారధి మనస్సులో విరక్తి అలలా లేచిపడింది! 'నా కెందుకీ తహ తహ! ఇంత విశృంఖలతని నేను భరించలేను! ఇంత స్వేచ్ఛ ఆడపిల్లకి హానికరం!!' అతడు గొణుక్కుంటూ ఠక్కున ఫోను పెట్టేసి క్లాసుకి వెళ్లిపోయాడు.

సారధి సాయంత్రం యింటికి వచ్చేసరికి శశిరేఖ ఏదో హిందీ పాట సన్నగా లోగొంతుకతో పాడుకుంటోంది.

అతని మనస్సు భగ్గున మండిపోయింది, ఆమె ముందున్న ట్రాన్సిస్టర్‌ని చూడగానే. అది ఆమెకు 'ఆ శ్రీనివాస్ యిచ్చిన కానుక' అని యిట్టే తెలిసిపోయింది! దాని ప్రక్కనే ఓ చిన్న చీటీ పడివుంది 'విత్‌లవ్ — నీ శ్రీనివాస్' అని వుంది దానిపైన.

కోపంతో వుడికిపోసాగాయి అతని వూహలు! 'చెంపలు వాయించి బయటికి పొమ్మనాలి' అన్నంత ఆగ్రహం దూసుకు వచ్చింది! ఎంతో ప్రయత్నం మీద నిగ్రహించుకున్నాడు.

బట్టలు మార్చుకుని, కాళ్లూ చేతులు కడుక్కుని వంటింట్లోకి వెళ్లిపోయాడు మౌనంగా—కాఫీ త్రాగుతూండగా వచ్చిందామె.

"సారధిగారిక్కూడా కోపం వస్తుందన్న మాట!"

అతడు తలెత్తి కూడా చూడలేదామె ప్రశ్న విని. కాఫీకప్పు కడిగి అలమారులోపెట్టి వంట ప్రయత్నాలు మొదలెట్టాడు.

"శ్రీనివాస్ చాలా మంచివాడు సారధీ!... అతనితో నేనేమీ ఒంటరిగా వెళ్ళలేదు! రమణి కూడా వచ్చింది!"

సారధి అదేమీ పట్టనట్టే బకెట్‌తీసుకుని పంపుదగ్గర కెళ్ళిపోయాడు.

"నిజమైనమునిషిలా వున్నాడే యీ సారధి! ఇలా నాపైన అలిగి, కోపం తెచ్చుకున్న వాళ్ళెవరింతవరకు! ఎందుకింతకోపం?! నా జీవితాన్ని నేను నా యిష్టంవచ్చిన రీతిలో గడుపుతాను! నా మంచిచెడ్డలు నాకు తెలియవా? మధ్యలో యితని కెందుకింతబాధ?" శశిరేఖ మనస్సులోని వూహలు సతమతమైపోయాయి సారధి మనస్తత్వం అర్థంగాక.

ఆ తరువాతకూడా అతడు నోరువిప్పనేలేదు. ఆమె సూట్‌కేసుతీసి బట్టలు బీరువాలో సర్దుతూంటే చూశాడు పరిశీలనగా. ఓ రిస్టువాచీ క్రొత్తదితీసి లోనపెడుతోందామె. బాధగా కళ్ళుమూసు కున్నాడతడు.

"శ్రీనివాస్ రేపు...... వస్తానన్నాడు! నీతో... .."

"భోంచేసి పడుకో! నేను వచ్చేసరికి ఆలస్యం అవుతుంది!" అని లేచి వెళ్ళిపోయాడతడు.

"ఇదేం మనిషి?! ఎందుకెళ్ళావు? ఎవరా శ్రీనివాస్! ఎందుకు వస్తున్నాడు అని కూడా అడగడేమిటి? నా కోసం వచ్చానన్నాడుగా?! పోనీ కోపంతో నాలుగుతిట్లు తిట్టవచ్చుగా? ఎందుకలా నేనేదో దొంగతనం చేసినట్లు నావంక తీక్షణంగా చూస్తాడు?" శశిరేఖ విసుక్కుంది.

"సారధీ! నమస్కారాలు బాబూ! ఓ! మీరా!! సారధి లేడాండీ?" సలీమ్, శశిరేఖని చూసి గుమ్మంలోనే నిలబడిపోయాడు.

"ఇప్పుడే బయిటికి వెళ్ళాడు!" శశిరేఖ మనస్సులో వుత్సాహమే లేకుండా పోయింది, సారధి మౌనంగా వెళ్ళిపోయిన తరువాత.

"ట్యూషను చెప్పడానికి వెళ్ళుంటాడు లెండి! మీరు... ఎప్పుడొచ్చారు?" సలీమ్ నిలబడే అడిగాడు.

"ప్రొద్దున! మీక్కూడా చెప్పడా సారధి నేను ఢిల్లీ పారిపోయానని!"

"వాణ్ణి కలుసుకునే పది రోజులయ్యింది! నేనూ ఢిల్లీలోనే వున్నానిన్నాళ్ళూ!" సలీమ్ కారు తాళంచేతులు త్రిప్పుతూ చెప్పాడు.

"సారధి వచ్చేవరకు కూర్చోక తప్పదు నాకీవేళ. ఎందుకంటే... వాడు నాకో మూడు వందలివ్వాలి. ఈవేళే యిస్తానన్నాడు. తీసుకోకుండా వెళ్తే యీజన్మలో నాతో మాట్లాడడు. మరో పనికూడా వుంది. వాడికోసం ఓ జత బట్టలు తెచ్చాను. నేను మొన్న ఢిల్లీ వెళ్ళే ముందు చెప్పడానికి వస్తే, 'పాంటు చిరిగితే కుట్టుకుంటున్నాడు. అందుకే ఓ పాంటుషర్టూ తెచ్చాను. రెండు మూడు తీసుకురావాలనుకున్నాను. కానీ వాడు తీసుకోడు. వట్టి మొండి మనిషి. నేనంత భాగ్యవంతుణ్ణి కాదు పొమ్మంటాడు. ఈ జతకూడా తీసుకుంటాడో లేదో. తీసుకున్నా కాసేపు తిట్టిపోస్తాడులెండి. ఉండండి. తీసుకువచ్చి చూపిస్తాను." సలీమ్ చిన్న పిల్లవాడిలా కారు దగ్గిరికి వెళ్ళాడు క్షణాల్లో.

"నా సెలక్షనెలావుందో. చెప్పండి." తెల్లని పాంటూ, తెలుపు రంగుపైన సన్నని ఎర్ర గళ్ళున్న షర్టూ చూపించాడతడు.

**జరిగినకథ — 3:** సోమయాజులుగారి మనుమరాళ్లు విజయ, రాజ్యలక్ష్మి సారధితో విజయ పెళ్ళి ఆగిపోయింది. సోమయాజులుగారు ఇచ్చిన డబ్బులో 5 వేలు తక్కువగా సారధి సోమయాజులుగారికి తెచ్చి ఇస్తాడు. అతని ప్రవర్తనకు ముగ్ధులయ్యారు సోమయాజులుగారు. సారధి విజయ, రాజ్యలక్ష్మిల బాధ్యతను స్వీకరిస్తాడు. సోమయాజులగారిచ్చిన డబ్బుతో తన కూతురు సీత పెళ్లి చేస్తుంది అరుంధతమ్మ. తన వైవాహిక జీవితం సుఖంగా లేదని సారధి చెల్లెలు సీత అతనికి ఉత్తరం రాస్తుంది. సారధి తన స్వంత చెల్లెలు శశిరేఖను సన్మార్గంలో పెట్టుటకు ప్రయత్నిస్తుంటాడు. శశిదేఖ, సారధి ఒకరికొకరు తమ జీవితానుభవాల్ని చెప్పకుంటారు. రెండు మూడు రోజుల ఇంటికి రాని శశిరేఖ కోసం ఆమె ఆఫీసుకు వెళుతాడు సారధి. శ్రీనివాస్ అనే ఆఫీసర్‌తో కలిసి శశిరేఖ ఢిల్లీ వెళ్లిందని తెలుసుకొని క్రుంగిపోతాడు. ఆమె రాస్ అనే అతనికి తనను గురించి వ్రాసిన ఉత్తరం చదువుతాడు.

"ఓ కప్పు కాఫీ... యివ్వగలరా. దయచేసి. నాకు ఆకలివేసినపుడు కాఫీతాగితే కాస్త ఓర్చుకో గలుగుతాను."

శశిరేఖకి నవ్వాగలేదిక.

"భోజనం సిద్ధంగా వుంది. రండి వడ్డిస్తాను. ఆకలివేస్తుందని చెప్తితే పోతుందిగా? కాఫీ అడుగుతారెందుకు మళ్ళీ ?" అన్నదామె.

"వాడు వంట చేశాడో లేదో తెలుసుకోవాలి గదండీ !"

"బావుంది. మీ ఐడియా."

భోంచేస్తున్నంతసేపూ అతడు భట్రాజులా సారధిని పొగుడుతూనే వున్నాడు.

"సారధి గురించి తప్ప మీరు మరో విషయం గురంచి మాట్లాడలేరా ?" అడిగిం దామె.

"వాణ్ణి చూసి పదిరోజులయ్యింది ! రేపు నేను బొంబే వెళ్ళిపోవాలి. నేను ఎన్నో పనులు మానుకుని వీడికోసం వస్తే, ట్యూషను చెప్ప డానికి వెళ్ళిపోయారాయనగారు ! వాడొచ్చేసరికి నేను నిద్రలోవుంటాను. అప్పుడు కోపాన్ని భోంచేస్తాడు! 'వీడు ప్రతి క్షణాన్నీ డబ్బు క్రింద మారుస్తున్నాడు !' అంటాడు !"

"మీ స్నేహానికెన్నేళ్ళు ?" మధ్యలో ఆపి ప్రశ్నించింది.

"నాలుగేళ్ళు ! ఏం ? ఎందుకలా అడిగారు ?"

"మరియిన్నేళ్ళయినా సారధిగారింకా డబ్బు కోసం యింతగా కష్టపడుతున్నారేమిటి ? మీరేమో ..."

"ఆగండాగండి ! నేను భాగ్యవంతుణ్ణేమీ గాదు మీరూహిస్తున్నట్టు ! ఇదంతా మా నాన్నగారిది. సారధే నాకన్నా ధనవంతుడు. వాడికో వుద్యోగం వుంది. నాకా వుద్యోగంకూడా దొరకదు, నాన్నగారు వెళ్ళగొడితే !"

ఆమె నవ్వింది అతని మాటలకి –

"ఆ మీ ప్రశ్నకి జవాబు చెప్పనేలేదింతకీ. నాకు డబ్బున్నంత మాత్రాన సారధినెలా ధనవంతుణ్ణి చేయగలను ?! బాబూ ! మా యింట్లో వుండరా, అన్నాను. 'నేనేమీ భిక్షగాణ్ణి గాదు' పొమ్మన్నాడు. పోనీ మా బిజినెస్‌లో భాగం యిస్తాను రారా అన్నాను. 'వద్దు ! కొన్నాళ్ళకి మనం శత్రువులమైపోతాం' అన్నాడు. వాడు ఒట్టి పిచ్చివాడు."

"ఎవ్రరా ? పిచ్చివాడు ?" సారధిలోనికి వస్తూ ప్రశ్నించాడు.

"ఓహో ! తమరా ? ఏం హరిశ్చంద్ర మహారాజా ? త్వరగా వేంచేశారేమిటి కధ?"

"వాళ్ళు పిక్చరుకెళ్ళారట. ఏమిటి ? తీరిగ్గా కబుర్లు చెబుతున్నావు ? మళ్ళీ పరుగెట్టాలా ఏమూలకైనా ? రేఖా ! వాడి కోసం మైసూరుపాక్ తెచ్చాను చూడు. ఓ ప్లేటులోపెట్టి యివ్వు !"

"మాశారా శశిరేఖగారూ ? మా వాడికి నేనంటే ఎంత భక్తో ! భోజనం తరువాత మనం తీపి పదార్థాలు తింటామని గుర్తుంచు కున్నాడు. అందుకే మా అమ్మకీ, వీడికీ తప్ప నేనెవరికీ అక్కర్లేదన్పిస్తోంది !"

"సరేలే ! ఇవిగో మూడు వందలు !"

"మరో నూట యాభై యివ్వరా ! నీకో జత బట్టలు తెచ్చాను ! ఆ ! వాటిని తీసుకు రావడానికి వెళ్ళినందుకు అయిదు రూపాయల పెట్రోలు ఖర్చయిపోయింది ! ఆ అయిదుకూడా యిస్తే బావుంటుంది మరి !"

సలీం గంభీరంగా, ఏదో పెద్ద వ్యాపారం గురించి చర్చిస్తున్నట్టు చెప్పాడు.

శశిరేఖ, సారధినే చూస్తూండిపోయింది. అతనో వింత వస్తువులా వున్నాడామెకి.

"నీకసలు బుద్ధుందా లేదురా ? ఇక్కడ నేను ధనరాశులు, పోసుక్కూర్చున్నాననుకు న్నావా? అయినా నిన్నెవడు తీసుకురమ్మన్నాడు?"

"అవునురా ! నిజమే ! నన్నెవడు తీసుకు రమ్మన్నాడు ?!!" సలీమ్ సమాధానం చెప్ప కుండా ప్రశ్నించాడు.

"నాకిప్పుడవసరం లేదసలు ! ఉన్నవి చాలు !"

సారధి చిన్నపిల్లవాడిలా మూతి ముడుచు కున్నాడు.

"సరే ! నీ యిష్టం ! వెళ్తానుమరి ! ప్రొద్దుబోయింది !" నిట్టూరుస్తూ లేచి నిలబడ్డాడతడు.

"ఏం ? యిక్కడే పడుకోరాదూ ? అమ్మ మద్రాసు వెళ్ళిందన్నావుగా ?"






తెలుగు కళాసమితి, వాశి (కొత్త బొంబాయి) వారి ఆరవ వార్షికోత్సవ సందర్భంగా డా. మంగళంపల్లి బాలమురళీకృష్ణ సన్మానం, గాన కచేరి జరిగాయి. శ్రీమతి సుమతి (మృదంగం), డా. బాల మురళి, శ్రీ అన్నవరపు రామస్వామి (వయొలిన్) గార్లని చిత్రంలో చూడవచ్చు.

---

''ఇంకా పడుకోడానికెక్కడ తీరికుందిరా?''

''ఏం ? పనుందా ఏమైనా ?'' సారధి ప్రశ్నించాడు.

''నాలుగయిదు బజార్లు తిరగాలి ! లేక పోతే యీ బట్టలమ్ముడుబోవడం కష్టంగదా ? అమ్మకపోతే నీకు మహా విచారం! నాకు బోలె డంత నష్టం ?''

సారధి నవ్వాడు వెన్నెల విరిసినట్లు ! శశిరేఖకీ నవ్వాగలేదు !

''పోన్లే ! పడుకో ! నేనే కొంటాన్లే !''

''శశిరేఖగారూ ! వింటున్నారుగా ? మీరే సాక్ష్యం ! మళ్ళీ రేపొద్దున్న లేచి కోపంతో చిందులువేస్తూ 'ఎవడు తెమ్మన్నాడు రా ! రాస్కెల్ ! పూల్ !' అంటే నేనొప్పుకోను ! తిన్నగా కోర్టుకెళ్తానని చెప్పండి !''

సలీమ్ కళ్ళనిండుగా సంతోషమే, స్నేహితుడు తనకోరికని తీర్చినందుకు.

''కానీ రెండు నెలలవరకు డబ్బివ్వలేమురా!''

సలీమ్ ఏదో పుస్తకాన్ని తీసుకోబోతూ ఆగిపోయాడు.

''డబ్బా ! డబ్బు ! నువ్వు డబ్బివ్వకపోతే యీ సలీమ్ నెవరూ వురితీసి చంపరు రా ! ఏవిటసలు ? నీ నియమాలు ?? ఏమైనా అర్థం వుందా ? స్నేహాన యిచ్చిపుచ్చుకోడాలుండవా ?! ఎందుకిలా నన్ను నీ నియమాలతో దూరంగా నిలబెడతావ్ ? నీ కిష్టంలేకపోతే చెప్పెయ్ ! ''ఒరేయ్ ! సలీమ్ ! నువ్వు నా స్నేహితుడివి గాదురా ! నేను చదువూ సంస్కారం, పెద్ద కులమూ గోత్రమూ గలవాణ్ణి ! నువ్వు మామూలు మనిషివిరా !'' అని.

అవునురా ! ఎందుకలా చూస్తావు ? నీ మనస్సులో వున్నదింతే గదా !''

# మూగ ముత్యాలు

సలీమ్ పుస్తకాన్ని విసిరేసి లేచి నిలబడ్డాడు కోపంగా.

శశిరేఖ కళ్ళనిండుగా విస్మయం మెరిసింది.

''సలీమ్ ! నీకూ నాకూ భేదమే లేదని నీ కెన్నోసార్లు చెప్పాను. అయినా నీ కెలాంటి స్నేహితుడు కావాలో చెప్పరాదూ ? నీ స్నేహితుడికి మానాభిమానాలుండగూడ దంటావా ! నీతీనియమాలేవీ లేని వాడు స్నేహితుడంటే నీ మనస్సు భరిస్తుందా ?! సిగ్గూ, అభిమానం, ఆత్మవిశ్వాసం యివేమీలేని వాడు నీక్కావాలను కుంటే యీ సారధి చావడానికయినా సిద్ధమే!''

''నేనేమీ అలా అనలేదు. ఈ వేళ నీ పుట్టిన రోజని, బట్టలు తీసుకు వచ్చాను ! ఓ స్నేహితుడి మాత్రపు బహుమతి నివ్వగూడ దంటావా ?''

''ఈ వేళ నా పుట్టినరోజని గుర్తున్న స్నేహితుడొకడున్నాడంటేనే నా మనస్సుకి ఎంతో ఆనందంగా వుందిరా ! ఆ ఆనందాన్ని నీ యీ బహుమతితో చిన్నబుచ్చావు. అయినా... ఫర్వా లేదులే ! నా మనస్సుతో నేను యుద్ధం ఎప్పుడూ చేస్తూనే వుంటాను. నీ కోసం మళ్ళీ దాని గొంతు నొక్కేస్తాన్లే.''

సారధి గొంతున ఆనందంతోబాటు అనంతమైన వ్యధ !

''చూస్తున్నారా శశిరేఖగారూ ? వీడి మాటలు నాకర్థంగావు ! ఓ హోటల్లో పరిచయమైంది యీ శ్రీరామచంద్రుడితో ! బిల్లు యివ్వడానికి అర్ధరూపాయి తక్కువైందని ఆలోచిస్తుంటే చిల్లర లేదనుకుని యిచ్చాను ! ఆ సాయంత్రమే అయ్యవారు అర్ధరూపాయితో ప్రత్యక్షమై రుణభారాన్ని తీర్చుకున్నారు! అప్పటి మంచి వీడిని నేను ఓ గ్రహంలా పట్టుకున్నానను కోండి ! ఒరేయ్ ! 'వార్ అండ్ పీస్' వచ్చింది జన్‌రూడ్‌లో ! మంచి పిక్చరు ! ఈ వేళ నాకా పిక్చరు చూపించకపోతే యిలాగే రాత్రంతా జాగరణ జేస్తాను.''

సారధి నవ్వాడు.

''మరో చిన్న కోరిక. ఆ పాంటూ, షర్టూ కూడా వేసుకుంటే నా మనసుక్కాస్త సంతోషంగా వుంటుంది.''

''నా మనస్సుని కోతినిచేసి వేస్తున్నావురా. రానురాను అది నీ మాటల ప్రభావానికి లోనై నన్ను వేధిస్తోంది.'' సారధి షర్టువేసుకుంటూ అన్నాడు

సలీమ్ కీసారి అతనేమన్నదీ విన్పించలేదు. అతడు క్రొత్త బట్టల్లో హుందాగా మెరిసి పోతూన్న సారధి అందాన్ని చూడడంలో లీనమై పోయాడు. శశిరేఖ కూడా ఓ నిముషం పాటు కళ్ళు త్రిప్పుకోలేకపోయిందతడి నుంచి.

''ఈ మనిషి నాకు నిజంగా అన్నయ్యే అయితే నా కష్టాలన్నీ తీరిపోతాయి. ఎంత ఆత్మాభిమానం ఆ గుండెల్లో?! ఎంత నిర్మలంగా నవ్వుతాడో?! ఈ స్నేహితు లిద్దరిమధ్యా కోప తాపాలున్నాయి. అంతస్థుల భేదాలున్నాయి. ఆచార విచారాలు కలవవు. అయినప్పటికీ నిర్మల మయిన స్నేహబంధం వుంది. అందుక్కారణం— వీళ్లిద్దరి మనస్సుల్లోనూ 'చెడు ఆలోచనలేమీ లేవు.' అసలు నటించడం రాదు వీళ్ళకి. ప్రతి మాట హృదయం నుంచే వస్తుంది. ఒకరిమెప్పు కోసం మరొకరు బ్రతకరు. స్నేహం కోసమే బ్రతుకుతారు వీళ్ళు'' శశిరేఖ మనస్సులో దాగి వున్న మనిషి నిజాన్ని పరిశీలిస్తున్నాది.

''రేఖా ! నువ్వు భోంచేయమ్మా !''

అతనితో మళ్ళీ 'అమ్మా!' అని పిలిపించు కోవాలన్పించిందామెకు.

''ఈ మనిషి ఏం చేసినా ఎంత సహజంగా వుంటుందో?'' ఆమె మనస్సు గొణిగింది.

''ఒరేయ్ ! ఇప్పుడు నిన్ను విజయ చూస్తే పూల హారాలతో ముంచెత్తి...''

సలీమ్ మాటల్ని పూర్తిగానివ్వలేదతడు. కోపంతోబాటు లోలోన అణచిపెట్టిన ఆరాధనా భావం అతడి నొక్కక్షణం మైమరపించింది.

''ఈమధ్య నీకీ మంత్రం మరీ గుర్తు కొస్తోందిరా ! కల్లుత్రాగిన కోతికీ నీకూ ఏమీ భేదంలేదు.'' సారధి మిత్రుణ్ణి వారించాడు.

''నేనూ, రేఖా వెనక సీట్లో కూర్చుం టాంరా !'' సారధి కారు డోర్ తీస్తూ అన్నాడు.

''నేనూ వెనకే కూర్చుంటాను !'' సలీమ్ పసిపిల్లవాడిలా మూతి ముడుచుకున్నాడు.

''మరి కారు నడిపేదెవ్వరా ? ''

శశిరేఖకి నవ్వాగడంలేదు సలీమ్ ముఖాన్ని చూస్తున్నకొలదీ. దొరికిన విలువైన వస్తువుని పోగొట్టుకున్నట్లు ముఖాన గంటు పెట్టుకుని వెనకసీట్లో కూర్చున్నాడతడు.

''ఆషా కూడా వస్తుందని గుర్తుంచు కోరా !'' సారధి ఆ పేరెత్తగానే సలీమ్ కళ్ళ నిండుగా ఆనందం తళుక్కుమన్నది.

''వీడొట్టి పిచ్చి తుగ్లక్ రేఖాజీ ! ఆషా వస్తుందని ముందే ఏడవరాదూ ? '' సలీమ్ వెంటనే దిగి ముందు సీట్లోకి వెళ్ళాడు. శశిరేఖకి 'ఆషా ఎవరని అడగాలన్పించింది. కానీ సారధి ఎప్పటిలా గంభీరంగా మారిపోయాడు.

కాసేపటికి కారు ఓ భవనం ముందాగింది— సారధి దిగివెళ్లాడు.

''రేఖాజీ ! ఇప్పుడో అమ్మాయి వస్తుంది ! చూడండి ! సారధిని దేవుడనుకుంటుంది పాపం ! వీడేం చెప్తే అదే చేస్తుంది; వట్టి బుద్ధావ తారం ! మా సారధి గాడికి తగిన వెల్లెలన్పి స్తుంది !'' సలీమ్ ఆనందాన్ని మనస్సులోనే దాచుకోలేక పోతున్నాడు.

''మరి మీకేమవుతుంది ?'' రేఖ ప్రశ్నిం చింది కొంటెగా.

''అడగండి ! అదుగో ! వస్తోంది !''

ఆషా సిగ్గుతో ముడుచుకుపోతూ వచ్చింది. సలీమ్ వైపు చూసీ చూడనట్లు చూసిందొక్కసారి ! ఆ అరక్షణంలోనే అతడిని పూర్తిగా అభిషేకించింది అనురాగంతో !

వాలిపోతూన్న కనురెప్పలే సలీమ్‌కి, ఆమె లోని తీయని రహస్యాల్ని విప్పిచెప్పాయి.

"అన్నయ్యా ! నేను ... ... నీ ప్రక్కనే కూర్చుంటాను !" సిగ్గుతో సతమతమై పోయిందామె స్వరం.

"నిజమేనమ్మా ! లేకపోతే వీడు యీవేళ ఎన్ని యాక్సిడెంట్లు చేస్తాడో ! ఒరేయ్ ఆ ఏడుపుమాని వెనక్కెళ్లు! ఆషా ! వీడు మంచి నిషాలో వున్నాడు. కాస్త పడిపోకుండా చూడమ్మా!" సారధి నవ్వుతూ సలీమ్‌ని వెనక్కి పంపించాడు.

"ఆషాదేవిగారూ ! సారధి మీ అన్నయ్యే గాదు! మాకు ప్రాణమిత్రులనికూడా గుర్తుంచుకోవాలి!" సలీమ్, ఆషా ప్రక్కన కూర్చుంటూ వెక్కిరించాడు.

ఆషా పెదవులపైన అందమైన నవ్వు ! కళ్ళపైన అనురాగపు మెరుపుల తళుకులు.

కారు స్టార్టుకాగానే ఆ కుదుపుకి సలీమ్ కావాలనే ఆషావైపుకి ఒరిగాడు పూర్తిగా. ఆమె నిలువెల్లా సిగ్గుతో, తీయని పులకింతతో వూగిపోయింది.

కనులు మాత్రం కోపంగా చూశాయి.

"మీ అన్నయ్యకు కారునడపడం రాదుమరి! నేనేం చేయను ?" సలీమ్ బుద్ధిమంతుడిలా సర్దుకూర్చున్నాడీసారి.

"ఒరేయ్:! జాగ్రత్త ! పిచ్చివేషాలు వేస్తే జైలుకి తీసుకెళ్తాను !" సారధి హెచ్చరించాడు.

"మరీ మంచిది ! ప్రతిరోజూ నీ దర్శనం అవుతుందపుడు ! ఈ బిజినెస్‌తో పిచ్చెక్కిపోతున్నానసలే !"

అతని గుండెల్లో సారధికోసం ఎంతటి ఆరాధన వుందో యిట్టే చెప్పేశాయి ఆ మాటలు ! శశిరేఖ మనస్సు ఆ యిరువురి స్నేహాన్ని మెచ్చుకోవడంలోనే లీనమైపోయింది.

పిక్చరు ఆరంభంకాగానే సలీమ్ ఆషా వైపుకి వంగాడు. శశిరేఖకి అతని గొంతు స్పష్టంగా విన్పిస్తోంది.

"ఆషా ! ఏం తెచ్చావు నా కోసం?"

"నా కోసం రానివాళ్లకి నేనేందుకు తీసుకు రావాలి ?" ఆషా గొంతులో యీర్ష్య.

"నన్ను చూడగానే కళ్ళు వాల్చుకునే వాళ్ళ కోసం ఎలా రాగలను ?" పోన్లే ! ఈ సిల్కు రుమాలు నాకిచ్చెయ్ "! సలీమ్ గభాలున ఆషా చేతిలోనుంచి రుమాలు తీసుకున్నాడు.

"నీక్కావలసింది స్నేహం ! ఈ సిల్కు రుమాలెందుకూ ?"

"కాస్త కోపాన్ని కట్టిపెట్టు. నిన్ను చూడగానే నా మనస్సుని ఓ రకమైన నిషా ఆవహిస్తుంది. ఆ నిషాలో కల్లుత్రాగిన కోతిలా ప్రవర్తిస్తానని భయం. అందుకే ముందు సారధి దగ్గరకెళ్ళాను. నా మనస్సులోని వూహాల్ని గిరిగీసి నిలబెడతాడువాడు. వాటికి రవ్వంత నిగ్రహాన్ని అద్దుతాడు. ఇప్పుడు చూశావుగదా ! కారు తానే నడిపి, నన్ను నీ ప్రక్కన కూర్చోబెడుతూ హెచ్చరించాడు. నిషాలో హద్దులు దాటవలదని!"

"అమ్మకూడా అన్నయ్య వున్నాడనే వెళ్ళమంది. లేకపోతే...నీ వెంట నేనుకూడ రాను."

"ఆట్టే చూస్తే నువ్వు మా స్నేహాన్ని ప్రేమిస్తున్నట్టుందే ?"

"మరి నిన్ననుకున్నారా ?" ఆషా గొంతు నిండుగా చిలిపిదనం.

"మరెందుకిలా సినిమా చూడకుండా నన్ను విసిగిస్తున్నావు ?"

సలీమ్ మనస్సులో మరింత కొంటెదనం నాట్యం చేసింది.

"సలీమ్ ! దాహం వేస్తోంది. ఓ సోడా తెచ్చిపెట్టరా !" సారధి లేచివచ్చి సలీమ్‌ని బయటికి పంపాడు.

"నువ్వొత్త ఫూల్‌విరా ! కథ మంచిమలుపు తిరుగుతూంటే పానకంలో పుడకలా వచ్చిపడ్డావ్? అసలింతకీ నన్ను సినిమా చూడనిస్తావాలేదురా?" సలీమ్ గొణిగాడు.

"ఆషాని తిడుతున్నారందరూ ! ముందు నువ్వు బయటికెళ్ళు !" సారధి ఆషాని లేపి తాను







కూర్చున్నాడు. చీకట్లో సోడా తీసుకువచ్చిన సలీమ్‌కి ఆ సంగతి తెలియదు.

"ఆ దేవుడికివ్వు! దాహంతో నిలబడలేక పోతున్నాట్ట!"

సారధి మౌనంగా సోడాబాటిలందుకున్నాడు.

"ఆషా! ఈ సినిమా చూసి తిన్నగా మీ యింటికే వస్తాను. లేకపోతే నాకిక నిద్ర బట్టదు. నీ వూహలు నన్నీ వెన్నెల్లో నిలబెట్టి పరిహాసం జేస్తాయి!"

సలీమ్ ఆషా అన్న వూహతో సారధిచేతి నందుకుని పెదవుల కందించాడు.

"ఒరేయ్! నేను రా! పిచ్చివేషాలు చాలించి బుద్ధిగా సినిమా చూడు! లేకపోతే కాళ్ళూ చేతులుకట్టి బయటికి విసిరేస్తారు ప్రక్కనున్న వాళ్ళు!"

సారధి నవ్వాపుకుని స్నేహితుడి చెవిలో చెప్పాడు.

ఆషా, శశిరేఖా నవ్వినట్లు స్పష్టంగా తెలిసిపోయింది సలీమ్‌కి.

"నాతో మాట్లాడకేమైన! నేను సినిమా చూస్తున్నాను?" సలీమ్ గంభీరంగా అన్నాడు.

సారధి హాయిగా నిట్టూర్చాడు. ఆతరువాత సినిమా పూర్తయి బయటికి వెళ్ళగానే ఆషాతో యుద్ధంజేయ నారంభించాడు.

"ఆషా! నేనసలు మీ యింటికే రాను!"

ఆషా, సారధివైపుచూసి నవ్వింది మనోహరంగా.

"నేను వెళ్తున్నామురా!" సలీమ్ నడిచి వెళ్ళబోయాడు— సారధి ఆపాడు. "ఏం కారులో రావా?" అని ప్రశ్నించాడు.

"ఆషాని దిగపొమ్మను ముందు!"

"ఓహో! మీ యిద్దరూ కలిసివెళ్తారా? ఆషా! వెళ్ళమ్మా! పాపం కోపంతో దహించుకు పోతున్నాడు! ఆ! ఒరేయ్! ఆషాతో మాట్లాడకు! నువ్వెవరితోనూ మాట్లాడనన్నా వింటాక. రేఖా! రా! మనం వెళ్దాం!" సారధి కారు స్టార్టుచేశాడు.

## మూగ ముత్యాలు

ఆషా ఏదో అనబోతూంటే వారించాడు కళ్ళతోనే—

"వాడికోపం చల్లారేవరకూ నడిచేవెళ్ళండి! ఆ తరువాత టాక్సీని వాడేపిలుస్తాడు! సలీమ్. ఆషాని యింటిదగ్గరదింపి తిన్నగా మన రూమ్‌కి వచ్చెయ్! నీతో మాట్లాడవలసిన విషయాలు చాలా వున్నాయి! నువ్వు వచ్చేవరకు నేను మేల్కొనే వుంటాన్లే!" అని సారధి కారుని ముందుకు పోనిచ్చాడు.

"నీ కసలు సిగ్గులేదు! వాళ్ళేమనుకుంటారిపుడు?" ఆషాకి నిజంగానే కోపంవచ్చింది. దానితోపాటు ఆమెకి చచ్చేంత సిగ్గుగాకూడా వుంది.

"నిన్ను నేనేమీ రమ్మనలేదే?!"

"మరెందుకు కార్లో వెళ్ళనన్నావు? నన్నెందుకు దిగపొమ్మన్నావు?"

"నువ్వెందుకలా సీట్లోనుంచి వెళ్ళిపోయావ్?" పసిపిల్లవాడిలా వుక్రోషంగా అడిగాడు.

"వెళ్ళకపోతే వెనకా, ముందూ కూర్చున్న వాళ్ళు బయటికి విసిరేసేవాళ్ళు! నాపైన వాలిపోకుండా మాట్లాడలేవా నువ్వు? క్షణ క్షణానికి, ఆషా పాషా అనకపోతే బుద్ధిగా సినిమా చూడరాదూ. రుమాలుతోపాటు నా చేతిని కూడా లాక్కుని... ముద్దు పెట్టుకోవడం ముందున్నవాళ్ళు చూసి నవ్వారని నీ కెందుకు తెలియదు?!" ఆషా గుండెల్లోని అనురాగం వులకించిపోతోంది.కానీ సిగ్గు, కోపంతో చిందులు వేయసాగింది.

"నాకేం తెలుసూ? వాళ్ళు టికెట్ కొని మనల్ని చూడ్డానికి వచ్చారని." సలీమ్ ఆమె ప్రక్కనే నడుస్తూ జవాబు చెప్పాడు.

"కాస్త దూరంగా నడవండి దొరగారూ. ఇలా పైపైనబడి నడుస్తూంటే 'రౌడీ'లనుకుని పోలీసులు వెంటబడతారు. నువ్వు టికెట్‌కొని ఆషాని చూడ్డానికి వచ్చావని వాళ్ళకి తెలిసిపోయిందట. అందుకే వచ్చారుట."

"నీకు నాతో పోట్లాడ్డం మహా యిష్టమనుకుంటాను. పరేలే. టాక్సీలో వెళ్దాం పద. తీరిగ్గా తిడుదువుగాని." టాక్సీని పిలిచాడతడు.

"మన కధ టాక్సీ డ్రైవరుక్కూడా విన్పించాలన్నమాట." ఆషా చిలిపిగా నవ్వింది

"పగలు నువ్వింత అందంగా వుండవెందుకని?" సలీమ్ ఆమెనైపే రెప్పవాల్చకుండా చూస్తూ అడిగాడు.

"నువ్వురాత్రిపూట యింత అందవిహీనంగా ఎందుకుంటావు సలీమ్?!" ఆమె పెదవులపైన చిలిపి నవ్వు.

"నీక్కాస్త చత్వారం వున్నట్టుంది." సలీమ్ గొంతులో కోపం.

"నీ కళ్ళజోడే వాడుతున్నాను మరి." ఆషా మనస్సు నిండుగా ఆనందమే.

"నీకసలు మాట్లాడ్డం రాదు."

"నువ్వు మాట్లాడుతూంటే నా కసలు వినబుద్దేగాదు." ఆషా కళ్ళల్లో చిలిపి నవ్వు.

"అయితే దిగి వెళ్ళిపో!" సలీమ్ టాక్సీ ఆగడం చూసి లోలోన నిట్టూర్చాడు. ఆషాకి యిల్లు చేరుకున్నట్లు అప్పటికి తెలిసింది.

"ఏం. ఇంట్లోకి రావా?" ప్రశ్నించింది.

"ఎందుకూ?!"

"నాన్న లేరులే యింట్లో! రారాదూ?"

"మీ నాన్నంటే నాకేమీ భయం లేదు. సారధి ఎదురు చూస్తూంటాడు. వెళ్ళాలి!"

"ఇంకా కోపం పోలేదా?"

"కోపం ఎప్పుడో ఎగిరిపోయింది. నువ్వు నా ప్రక్కన నడిచివస్తున్నప్పుడే దానికి వుద్వాసన చెప్పేశాను. రేపు కాలేజికొస్తాను. మీ అమ్మగారొస్తున్నారు! వెళ్ళు. నన్నెలాగూ నిద్ర పోనివ్వడు సారధి యీ వేళ!"

"అన్నయ్యని మీరు నిద్రపోనివ్వరని నాకు తెలుసులెండి!"

"ఏవిటి? వున్నట్టుండి 'మీరు' అంటున్నావు?"

"కొన్నిసార్లు నా మనస్సుకి నువ్వెంతో దూరాన వున్నట్లనిపిస్తుంది. అప్పుడు 'మీరు' అనాలనిపిస్తుంది!"

# కొత్తగొంతులు

— టి.యల్. కాంతారావు

ఎత్తిన చేతులే ఎరుపెక్కిన
గండ్రగొడ్డళ్ళై
ముద్దరేసిన చేతులే ముడిచిన
నిప్పు పిడికిళ్ళై
చేతులు ఆయుధాలై
అమరిన పంజాలై
నిజాన్ని నీ జాతినీ
నామరూపాల్లేకుండా
నలిపి పారేస్తుంటే
ఉరకలేస్తున్న జనానికి
ఉప్పెన ముంచుకొచ్చినట్టు

— కె. అంజయ్య

సిద్దిపేటలో ఉద్యోగం చేసుకుంటూ సాంఘిక పురోభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొంటూ, ప్రగతిశీలభావాలనుఆహ్వానిస్తూ, వాటికి ప్రచారంచేస్తూ, ఈనాడు వస్తున్న సాహిత్యాన్ని కాలక్షేప దృష్టితో కాక విమర్శనాత్మక దృక్పథంతో చదువుతూ గీతాయుధం కవితా సంకలనాన్ని 1981 లో వెలువరించారు అంజయ్యగారు. 1965 తరువాత సాహిత్యంలోసమాజవాదాన్ని సమర్థించే కవులందరి దృష్టి ఒక కొత్త భావంవైపు మరలటం అందరికీ తెలిసిన విషయమే. గురజాడ నుండీ ఆరంభమైన ఆధునిక సాహిత్య చరిత్రలో 'విప్లవ' శబ్దం తప్పనిసరి అయిన మాటగా చెలామణి అవుతూ వచ్చింది. 1970 తరువాత సాహిత్యంలో 'విప్లవ' శబ్దానికి ఒక రూఢమైన అర్థం సంప్రాప్తించింది. అభ్యుదయ కవులైనా, విప్లవ కవులైనా, దేనికీ చెందని కవులైనా 'విప్లవ' శబ్దాన్ని విరివిగా కవిత్వంలో, ఇతర రచనలలో వాడటం పరిపాటైంది. ఒక వి. ర. సం. వారు మినహాయిస్తే ఇతర కవులందరూ భావ విప్లవ పరిభాషలో ఈ శబ్దాన్ని ఉపయోగించినా ఈ దశాబ్దంలో విప్లవ శబ్దానికున్న అర్థం సాయుధ పోరాటాన్నే సూచిస్తుంది. వి. ర. సం ప్రభావం వి. ర. సం సభ్యుల మీదనే కాక నాన్‌కమిటల్స్ అయిన అనేకమంది కవులపై పరోక్షంగా ఉంది. అట్లాంటి పరోక్ష ప్రభావంలోంచే అంజయ్యగారి కవిత్వం వచ్చిందని వారి కవితా ఖండికలను చదివిన వారు అర్థం చేసుకోగలరు.

కదలే పెదవులకు ప్లాస్టరేసి నోరు మూస్తే కదులుతున్న కాళ్లకు వెల్డింగ్ చేసే, కదిలే చేతులను వెనక్కు విరిచి కట్టే సమాజంలో జీవించే కవి ఈ సంకెళ్లను తెంచటానికే కవిత్వం రాస్తాడు. ఈ శరీరానికి ముక్తి కలిగించే అగ్గి తోడయిందా నేనూ అగ్గినౌతా నంటాడు కవి. అడవి కౌగిట్లో దాక్కున్న నిప్పునూ, జనం గుండెల్లో దాక్కున్న బడబాగ్నిని గుర్తించలేనివాడు, నియంతలకు జేజేలు కొట్టేవాడు, గంగిరెద్దులా తలూపేవాడు, కుక్కలా తోకాడించేవాడు బానిస జాతి వాడని కవి కఠోరంగా చెప్తాడు— చేతులు కలిసి ఎదురు తిరగనంతకాలం తిరుగుడు చక్రాల్లా ముందుకు చరిత్ర గీతని తిరుగుబాటు లక్షణాన్ని తీవ్రంగా వ్యక్తం చేస్తాడీ కవి. తెల్లకాగితపు జీవితానికి, ఎర్ర సిరాతో బంధం వేసి ఈనాటి వాస్తవాన్ని



కళ్ళకద్దటమే కాక రేపు ఏర్పడబోయే వ్యవస్థకు ఈ తరం ఎలా విక్రమించాలో కవిత్వాన్ని ఆయుధంగా భావించి ధ్వనింప చేశాడు. చేస్తున్న కష్టాన్నంతా స్వేదంగా విడుస్తున్న శ్రమజీవుల మెదళ్ళలోని ప్రతి అణువూ ఆటంబాంబులా బద్దలైతే, ఇన్నాళ్ళుగా జీర్ణించుకున్న కళ్ళు బెదురు కాష్టంలో కలిపి చితిమంటలరంగు కళ్లకొస్తే గాని ముందు తరాల జీవితం బాగుండదని ఈ కవి విశ్వాసం.

ఎదురు తిరగటం రానప్పుడు కాలం పిచ్చికుక్కై కరుస్తుందని, నిజం నిప్పులా కాటేస్తే ఈ వ్యవస్థ జీవించదని హృదయం లోంచి చెప్తున్నాడు. ఏడ్చిన కాళ్ళు ఎండుతాయనీ, నడిచిన కాళ్ళు అలుస్తాయని, కేక లేసిన నోళ్ళు మూతలు పడతాయని అన్ని బాధలను ఆకలి ఆర్పేస్తుందని పీడకులనమ్మకం కాని అన్నింటికీ ఆకలే మూలమని, ఆకలి జాతి ఎదిగితే అన్ని గద్దెల్లూ నేలమట్టమవుతాయనే నిజాన్ని వచన కవితాబద్ధం చేశాడు అంజయ్య.

ఈయన వచన కవిత్వానికి ఒక శైలి ఉంది. ఆ శైలి పాఠకుణ్ణి ఉద్రేకించి పరుగులు పెట్టించే శైలికాదు. వాచ్యార్థం కంటె, వ్యంగ్యార్థం ప్రధానమై పాఠకుణ్ణి ఆలోచింపచేసే శైలి ఇది. ఈ కవిత్వం శ్రమజీవులను ఉద్దేశించినది అయినా వారిని గురించిన అవగాహన మధ్యతరగతి సాధారణ జీవుల్లో కలిగించటానికి ఎక్కువ సహాయకారిగా ఉంటుంది. వి. ర. సం. పుట్టాక వచన కవిత్వానికి కాలం చెల్లిందనే భ్రమ కొంత మందికుంది. అది దుర్భ్రమ.

దోసిళ్ళతో నెత్తురు తాగిన గుండె, పిడికెళ్ళతో మెతుకులు విదిలిస్తుంది అనే కవి శక్తిని తక్కువగా అంచనా కట్టే అవకాశం లేదు.

జీవితాంతం నేనీ పాటే పాడుతానన్నది
నిజం
నా శరీరాన్ని ఢమీరుకగా మోగిస్తూ
సంచలనం రేపుతానన్నది నిజం
ఆ లయలో ఆ శబ్దంలో
వెంట్రుకలన్నీ నిక్కబొడుచుకుంటా
యన్నది నిజం ★

''ఇప్పుడు మన మధ్య వున్నది ఒక్క అడుగు దూరమేగా !''

''మద్రాసు వెళ్ళి నెల రోజులుంటారు. అదెంత దూరమో !''

ఆషా నిట్టూర్చింది :

''పోనీ నువ్వు కూడా రారాదూ ?''

''మీక్కాస్త పిచ్చి వున్నట్లుంది !''

''అందుకే రమ్మంటున్నాను !''

''అన్నయ్యతో చెప్పండీమాట !''

''వాణ్ణి కూడా తీసుకు వెళ్దాంలే !''

''మీ తెలివికి సంతోషిస్తున్నాం లెండి. ఇక వెళ్ళిరండి ! ఇక్కడే తెల్లవారిపోయేట్టుంది.'' ఆషా లోనికి వెళ్ళబోయింది.

''ఆషా ! రేపు ఆ పసుపువన్నె చీర కట్టుకురా ! ఆ చీరలో నిన్ను చూసి చాలా రోజులయ్యింది !'' అతడాపి చెప్పాడు.

''ఇంకా ఏమైనా కోరికలుంటే వెళ్ళి ఫోను చేయండి !''

ఆమె 'గుడ్ నైట్' చెప్పి లోనికి వెళ్ళి పోయింది.

''ఈ ఆడవాళ్ళకి ప్రేమించడం తప్ప మరేమీ తెలియదు !'' సలీమ్ గొణుక్కుంటూ టాక్సీలో కూర్చున్నాడు.

**(ఇంకా వుంది)**

# పల్లవి

## విహారి

అబద్ధంతోనూ, నిజంతోనూ చాలా కుస్తీ పట్లు పట్టినవాణ్ణే నేను.

అబద్ధాలను అతి తరచుగా వింటూ వుండటం, వాటి వెనకాల ఎక్కడో దాగిన రేఖా మాత్రపు నిజాన్ని గుర్తించి నవ్వుకోవడం— తెలుసు నాకు.

అలాగే, నిజాన్ని ఎప్పుడో హఠాత్తుగా ఎదుర్కోవడం,దాని దాడికి కారణమైన అబద్ధాల్ని విశ్లేషించుకోవడం— ఈ విద్యనీ నేను చక్కగానే వొంటబట్టించుకున్నాను.



అయితే, గణపతి తన కథను నాముందు వెళ్లబోసుకున్నప్పుడు మాత్రం—నీరక్షీర న్యాయం తెలిసి నాలో నివశిస్తున్నదనుకున్న నా చాతుర్యపు హంసకి గట్టి పరీక్షే ఎదురైంది !

అసలు గణపతి కథ చెప్తాను.

* * *

మార్చినెల—

ఆర్థిక సంవత్సరంలో చివరిమాసం. అంతా హడావిడి. సంవత్సరం మొత్తానికి—నిర్ణయింపబడి అంగీకరింపబడిన 'టార్జెట్'ని సాధించితీరవలసిన నెల. సహజంగా ఏటి కేడాదిపాటూ నిద్రించిన పులి కూడా లేచి 'అన్వేషణ'కు బయల్దేరే—

ఒక సోమవారం—

మధ్యాహ్నం మూడు గంటల సమయం—

గణపతికి చాలా చిరాగ్గావుంది.

నిజానికి అతనికి ఆ సంవత్సరమంతా, అందులోనూ ఆ నెల అంతా, మీదుమిక్కిలి ఆ రోజు — చాలా చిరాగ్గా వుంది.

దీనికి ఏకైక కారణం — అతని వ్యాపారం — అంటే అతని కంపెనీ అమ్మకాలు — అంటే అతని పని ఫలితాలు — ఏ మాత్రం సంతృప్తికరంగాలేవు !

అయినా, ఇలాటి సందర్భాల్ని గతంలో చాలావాటిని చూసేదు, గణపతి. అతను తలచుకుంటే ఇలాంటి నిరుత్సాహపు వాతావరణంలో — 'మందు' దట్టించి, అమాంతం వో ఫిరంగిని పేల్చేయగలడు; కొండలో సగభాగాన్ని తనకు కావలసినరీతిలో పిండి చేయించుకోగలడు.

కానీ, ఈ ఏటి పరిస్థితి — బొత్తిగా ఆశాజనకంగా లేదు. తనకు తానుగా వరించిన 'టార్జెట్'లో కేవలం నలభై శాతం మాత్రం

పని జరిగింది — ఇప్పటికి. ఇక మిగిలింది, పధ్నాలుగు రోజులు!

తన క్రిందివాళ్లు ఒక్కరూ సరిగా చిత్తశుద్ధితో పనిచేయడంలేదు.

అవును — తాను వాళ్లలా 'ఏరియా మేనేజర్'గానో, 'ఇన్‌స్పెక్టర్'గానో వున్నప్పుడు— విధిపట్ల ఎంతటి చిత్తశుద్ధి వుండేది? ఎంతగా 'టూర్' చేసేవాడు? ఎంత కష్టించి పనిచేసేవాడు? దాని ఫలితంగానేకదా — ఇవ్వాళ తాను— 'రీజినల్ మేనేజర్' — కాగలిగింది. అవును — ఈ తరం మనుషులే ఇంత! బాధ్యత తెలీదు.

అవును — ఈ విషయాన్ని మాత్రం ఢంకా భజాయించి మరీ చెప్పగలడు. అందరూ బాధ్యత తెలీని మనుషులే! —

సుందరికి సుందరి —

తన అవస్థ, ఆందోళన, పరిస్థితి, విసుగు, చిరాకూ — అన్నీ తెలిసిన అర్ధాంగి కదా —

ఆమె — సరిగ్గా తాను చాలా పెద్దపార్టీతో నిర్ణయించుకున్న సమయానికి — కారుని కాస్తా బయటికి పంపించేసి తనను డాన్స్ చేయిస్తోంది!

భోజనం చేయబోయేముందు తాను చెప్పను కూడా చెప్పాడు. 'మూడు గంటలకల్లా నేను మళ్లీ బయటికి వెళ్లాలి' అని. ఇరవై ఒక్క ఏళ్లు తనతో కాపరం చేసి, ఐదుగురు పిల్లల తల్లి అయినా — ఈ సుందరికి బాధ్యత తెలిసి రాలేదు!

కనుకనే, పదో తరగతి పరీక్ష రాస్తున్న నాలుగో కూతురి అవసరాన్ని గమనించి ఆమెని కారులో ఇంచక్కా ట్యూషన్ మాష్టర్ దగ్గరికి పంపించిందిప్పుడు!

సుందరి సరే — ఆ రాజారావు మాత్రం!

సిటీలో వుండే ఏరియా మేనేజర్ గదా. అతని పనిని నిజానికి తను చేస్తున్నాడు కదా, సమయానికి వచ్చి కారులో తీసుకువెళ్లాల్సిన బాధ్యత లేదూ — అతగాడికి? ఉంది — కానీ, ఆ బాధ్యత తెలిసి ఏడిస్తే గదా! ఫోన్ చేస్తే, "సారీ సర్. నా కారు కొంచెం ట్రబులిస్తుంటే గేరేజ్‌కి పంపేను" అని సమాధానం. మార్చి నెలలో కారుని ట్రబులిచ్చేటట్లు (!) కాపాడుకుంటూ రావడం కంటే ఇంకేం తార్కాణం కావాలి — అతని బాధ్యతా రహిత ప్రవర్తనకి!

గణపతి పూర్తిగా డ్రెస్ చేస్కుని, కాలు గాలిన పిల్లిలా తిరగసాగేడు. క్షణ క్షణానికీ వాచీ చూసుకోవడం, కిటికీలోనుంచీ రోడ్డు కేసి చూడటం — "ఛీ. ఛీ ఛా...ఛా..." అనుకుంటూ, నసుగుతూ గొణుగుతూ, విసుగునీ, చిరాకునీ ప్రదర్శిస్తున్నాడు.

అతనికి చాలా అసహనంగా వుంది.

మళ్ళీ వాచీ చూసుకున్నాడు గణపతి. మూడూ పదిహేను.

సమయం అయిపోతోంది.

మూడున్నరకల్లా తాను తారాచంద్ దగ్గర వుంటానని మాటిచ్చాడు. అతనో అర్ధగంట మాట్లాడాలి. పన్నెండు రోజుల అవస్థ తర్వాత అతనీ స్కీమ్‌ని ఫిక్సప్ చేశాడు. నాలుగు గంటలకు తారాచంద్ బొంబాయి ప్రయాణమై వెళ్లిపోతానన్నాడు.

కారు ఈ క్షణాన్న వచ్చినా, తాను తారాచంద్ దగ్గరికి చేరేసరికి మూడూ నలభై అవుతుంది. ఫర్వాలేదు. ఇరవై నిముషాల్లో తాను "డీల్" ఫైనలైజ్ చేయగలడు. తారాచంద్ చేత చెక్కుమీద సంతకం చేయించుకుని రాగలడు.

కానీ, కారు రాలేదింకా.

సుందరి వచ్చింది, టీ కప్పుతోసహా!

గణపతికి మండిపోతోంది — అసలే. దానికి తగ్గట్టు చెమటలు కక్కించే వేడివేడి టీ కప్పుతో ప్రత్యక్షమౌతోంది — అర్ధాంగి. ఆమె అసలు బాధ్యత తెలిసిన భార్యేనా? —

వెన్నెలవాక జాల్వారినట్లు సన్నగా నవ్వింది, సుందరి.

'సిగ్గు లేకపోతేసరి — నవ్వడానికి'. గణపతి కోపం.

టీ కప్పు ఇవ్వబోయింది. "అఖ్కర్లేదు"— గణపతి.

"ఎందుకలా చిందులు తొక్కుతారు? వస్తూనే వుంటుంది, కారు" అంటూ వంగి, టీ కప్పుని టీపాయ్‌మీద వుంచి, తాను సోఫాలో కూర్చుంది, సుందరి.

"ఆ వస్తూనే వుంటుంది. మా పార్టీ బొంబాయి చేరేక ఆ కారూ ఇంటికి చేరుతుంది" తానూ కూర్చున్నాడు, ఎదురు సోఫాలో.

ఆమె మరోసారి నవ్వుకుంది. ఈసారి తనలో తాను— మల్లెల దొంతరని దోసిలితో ఆఘ్రాణిస్తున్నట్టు!

"టీ తీసుకోండి మీరు" మళ్లా హెచ్చరించింది.

"నేను తాగను. అఖ్కర్లేదు" ఖండితంగా చెప్తూ, దినపత్రికను చేతిలోకి తీసుకున్నాడు.

మారు మాట్లాడకుండా తానా టీ తాగేసింది, సుందరి.

గణపతి కడుపు రగిలిపోతోంది.

మళ్లీ వాచీ చూసుకున్నాడు. మూడూ ఇరవై ఐదు!

సమయం మించిపోతోంది. అతని కళ్ల ముందు ఒక్క తారాచంద్ కొనుగోలు జేసే— తన టార్గెట్‌లోని పదిశాతం అమ్మకాల అంకెలే— కనిపించసాగినై.

పోనీ— రిక్షాలోపోతే— రేపటికి వెళ్తాడు!

ఇక్కడ టాక్సీలు దొరకవు! ఇదొక అవస్థ. ఊరికి దూరంగా— ఇటీవలే కట్టుకున్న స్వంత ఇంట్లోకి— అనవసరంగా తొందరపడి మారేడు.

అయినా, తాను మారేడా? అదీ సుందరి నిర్వాకమే! బాధ్యత తెలిసి ఏడ్చిన మనుషులయితే గదా చెప్పేందుకు!

"అందుకనే — ఏ పని చెయ్యాలన్నా అనుభవమన్నా ఏడవాలి; తెలివితేటలన్నా వుండాలి" — పైకే అనేశాడు, గణపతి.

సుందరి మొహం మంకెనపువ్వులా అయిపోయింది!

"అవును. మీ అనుభవాలూ, తెలివితేటలూ — రెండూ గొప్పవే! అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గర చెప్పినట్లు నాకే చెప్పకోవాలి, వాటిగురించి."

గణపతికి సాచిలెంపకాయ కొట్టినట్లైంది. భరించలేకపోయాడు.

"ఏం. ఏం లోటు కనిపించిందీ నీకు వాటిల్లో. ఒక్కసారి వెనక్కితిరిగి చూసుకుంటే — నేను సాధించిన ప్రతి విజయంలోనూ వాటి విలువ తెలుస్తుంది."

"ఆ సాధించారు — పెద్ద విజయాలు" సాధ్యమైనంత వ్యంగ్యమూ, వక్రోక్తీ ధ్వనించినై ఆమె మాటల్లో.

గణపతికి నిజంగానే కోపమొచ్చింది.

"ఏం — సాధించక ఏం చేశాను?" రెట్టించాడు.

"ఏం చేశారో నేను చెప్తాను" అని ఒక్కసారిగా గంభీరమైపోయింది సుందరి. అలసినట్లు సోఫాలో వెనక్కు వాలింది.

"హాయిగా ఫాన్ కింద కుర్చీలో టేబుల్ ముందు కూర్చుని చేసే ఉద్యోగాన్ని వదిలేశారు. ఇన్‌స్పెక్టరయితే — సంవత్సరానికి శక్తిమేరకూ బోనస్ గడించవచ్చని ఆ బోటులోకి దూకేశారు. ఆ వెంటనే, ఆఫీస్ పరీక్షలంటూ ఒకవైపూ, అమ్మకాల్లో ఎక్కువ రాబడి కావాలంటూ మరోవైపూ — సవ్యసాచిత్వం మొదలెట్టారు. అక్కణ్ణుంచీ ఒకటే పరుగు. అతి త్వరలో ప్రమోషన్ సంపాదించాలని ఒకటే తపన, తాపత్రయం. ఇల్లూ వాళ్లూ తెలీకుండా, సమయమూ సందర్భమూ మరచి "బిజినెస్" "బిజినెస్" అంటూ అహోరాత్రులూ తపస్సు చేశారు."

"అవును. అలా దీక్షగా పనిచేస్తూ, పరీక్షలూ పాసవుతూ రాబట్టే — ఏరియా మేనేజర్ కాగలిగేను. అదీ జస్ట్ ఆరేళ్లల్లో."

"ఆఁ! అయ్యారు. మోటారుసైకిల్ పోయి, కారొచ్చింది. ఇంట్లో టెలిఫోన్ కూడా ఏర్పడింది. జీతం రెట్టింపయ్యింది. బోనస్ డబ్బుతో రెండుచోట్ల ఇళ్లస్థలాలు కొన్నారు. ఇంట్లోకి ఫ్రిజ్‌లూ, కూలర్లూ వచ్చినై. నిజమే."

"కష్టపడితేనే మరి — అలాంటి సుఖాలు దక్కేది."

"హుఁ... సుఖం..." సుందరి చిత్రంగా నవ్వింది. విచిత్రంగా, చేతులు గాలిలో విదిలించింది.

చకితుడై చూస్తూ వుండిపోయాడు గణపతి.

''ఆ సుఖాల కోసమే మీరు 'మందు' అలవాటు చేసుకున్నారు. పైవాళ్ల పార్టీలకి అది తప్పనిసరి అలవాటయింది. నేను ఏవగించుకునే మాంసాహారాన్నీ అడపాదడపా రుచి చూశారు. ఆ సుఖాల కోసమే మళ్లీ మీ క్రిందివాళ్లనీ కాకాపట్టాల్సిన ఉద్యోగిగా మారేరు. అవును. అంతా సుఖం కోసం; డబ్బు కోసం. డబ్బు అందించే సుఖం కోసం, సుఖాన్ని కొనుక్కునే డబ్బు కోసం.''

సుందరి కంఠ స్వరం రుద్ధమైంది. ఆగింది. క్షణాల తర్వాత —

''పోనీ అక్కడితో ఆగిందా మీ పరుగు. ఆగలేదు'' అంది.

''జీవితానికి ఓ లక్ష్యం అంటూ వుండకపోతే, మనిషి సోమరిగా మారిపోతాడు. వాడి కృషి అంతటితో ఆగిపోతుంది.''

''అవును. అదే నేనూ చెప్తున్నాను. మీ కృషి ఆగలేదు. ఒక్క క్షణంసేపు ఆగి వెనక్కి చూసుకోలేని ''బిజినెస్''లో పడిపోయారు మీరు.''

''అందుకే అఖిలభారతదేశంలోనూ, మా కంపెనీ చరిత్రలోనూ మున్నెన్నడూలేని రికార్డ్ని సృష్టించగలిగేను.''

''వెంటనే అవుటాఫ్ టర్న్' ప్రమోషన్ వచ్చింది. రీజినల్ మేనేజర్ అయ్యారు.''

''నేను ఏం సాధించి మాత్రం ఏంలాభం. నువ్ మాత్రం నేను ఏ విజయాన్ని సాధించినా—



ఆముదం తాగిన మొహం పెట్టావేగానీ, ఏనాడైనా— నన్నూ, నా కృషినీ మనస్ఫూర్తిగా అభినందించావా... లేదు.'' గణపతి స్వరంలో బాధని సుందరి గుర్తించకపోలేదు. అయినా తన ధోరణిలో తాను చెప్పకుపోయింది.

''నిజమే. ఒప్పుకుంటాను. అసలు నా ప్రశ్నే అది. నేనెందుకు అభినందించాలిమిమ్మల్ని? మీ కృషి, దీక్ష, పట్టుదల, విజయాలు...ఇవన్నీ నాకేమిచ్చాయనీ ?'' ఉద్వేగంగా అన్నది సుందరి.

గణపతి ఆమె మాటలకు చాలా నొచ్చుకున్నాడు. కోపంగా విసుగ్గా అడిగేడు, ''అంటే అవన్నీ నా స్వసుఖం కోసం మాత్రమే ఉపయోగించాయా. అలాగైతే,అసలు నేను సుఖంగా తిని హాయిగా విశ్రాంతి తీసుకున్న రోజంటూ వుందా— జీవితంలో ?''

మ్లానంగా నవ్వింది సుందరి.



''లేదు. సరిగ్గా ఇదే ప్రశ్న — నేను మిమ్మల్ని వేయదలచుకున్నది. ఇంకా నిజంగా చెప్పాలంటే, మీకు విడమర్చి చెప్పాలనుకున్నదీ ఇదే మీకేనాడూ కడుపునిండా తిండీ, కంటినిండా నిద్రా లేదు. నాకేనాడూ మీతో కలిసి నవ్వుతూ తుళ్లుతూ సంతోషంగా గడిపే అవకాశం లేదు.''

ఒక్క క్షణం ఆగి భర్తకేసి పరీక్షగా చూసింది సుందరి.

గణపతి కళ్లల్లోకి చూస్తూ, నిగ్గదీస్తున్నట్టు అడిగింది — ''అయినా మనమిద్దరం ఇరవైఏళ్ల పైబడి సంసారం చేస్తున్నాం. ఐదుగురు పిల్లల్ని కన్నాం. అవును. నేను మీ మానసిక ఆందోళనల్ని వత్తిడుల్నీ తగ్గించడానికీ, శారీరకంగా మీ అవసరాల్ని తీర్చి, మీకు పిల్లల్ని కని యిచ్చే యంత్రంగా వుండటానికీ — ఉపయోగపడ్డాను — అదేగా నేను మీ డబ్బుతో, కృషితో, సంపదతో, విజయాల్తో కొనుక్కున్న సుఖం ?''

గణపతి నిర్విణ్ణుడైనాడు. సుందరిలోని అగ్ని పర్వతం అతని కళ్ళముందు పగిలి, లావాల్ని విరజిమ్ముతోంది.

బోనులో నిద్రిస్తున్న సింహాన్ని నిద్రలేపినట్లు అర్ధమైంది అతనికి.

సుందరికి దుఃఖం పొంగి, ఏడుపులోకి దిగింది. చేతుల్లో మొహాన్ని దాచుకుని కుమిలిపోసాగింది.

ఆ వెక్కిళ్ళల్లోనే అడిగింది. ''ఒక్కసారి ఆలోచించి చెప్పండి. ఈ ఇరవై ఏళ్లల్లోనూ మీకు మీరుగా నాకేనాడన్నా వో పూలమాల తెచ్చారా? కలసి మనిద్దరం కార్లో ఒక్కసారన్నా హాయిగా వో షికారుకుగానీ, సినిమాకుగానీ వెళ్లామా? లేదు, మరి ఎందుకొచ్చిన అవస్థండీ ఇదంతా ? పరమపద సోపానపటంలో నిచ్చెనల మీద నిచ్చెనలు ఎక్కుతూ ఎంతదూరం వెళ్లినా చివరికి సాధించే విజయం ఏమిటో చెప్పనా ?— పాపుల్ని తీసేయడం, పటాన్ని దులిపేయడం !''

''చివరికి నువ్ చెప్పే వేదాంతం వైరాగ్యం ఇదా ?'' అని డగ్గుత్తికతో అడిగేడు గణపతి.

''వేదాంతమూకాదు, వైరాగ్యమూకాదు... ఆత్మక్షోభ'' అని చెంగుతో కళ్లు వొత్తుకుని, సోఫాలోంచీ లేచి, ఖాళీ కప్పు తీసుకుని లోపలికి వెళ్లిపోయింది, సుందరి.

వాచీకేసి చూసుకున్నాడు. గణపతి ఒక్కసారిగా ఉలిక్కిపడినట్లు సోఫాలోంచీ లేచి నిలబడ్డాడు.

టైము నాలుగుదాటి ఐదు నిముషాలైంది.

కారు వచ్చింది. డ్రైవర్ సంజాయిషీ యిస్తున్నాడు, గుమ్మంపక్కగా నిలబడి, ''అమ్మాయి వాళ్ల ఫ్రెండ్‌కి సీరియస్‌గా వుందని కబురందిందండి దార్లో. కార్లో తీసుకువెళ్లి ఆ అమ్మాయిని హాస్పటల్‌లో చేర్పి రావాల్సి వచ్చింది — సర్.''

గణపతికి ఏమీ వినపడటంలేదు — 'ఆత్మక్షోభ' — అన్న పదం వొక్కటే అతని చెవుల్లో మ్రోగుతోంది.

* * *

రాళ్లు మోస్తున్న బరువుతో తల దిమ్మెక్కింది నాకు — గణపతి కథ వినేసరికి.

నా అభిప్రాయం వినడానికి ఉత్సుకతతో నాముందే కూర్చున్నాడు అతను. 'సుందరి ఆత్మక్షోభ సమంజసమైనదేనా ?' — ఇదీ అతను నా ముందు పరచిన ప్రశ్న !

నాకు భయంకరమైన స్వప్నంనుంచీ బయటపడలేనట్లు తోచింది.

సరిగ్గా అప్పుడే నేను ఇరకాటాన పడ్డాను. నిజానికి, నా కుడికన్ను అదిరింది. అది శుభసూచనే మరి !

ఆ వెంటనే—నాకు ఒక్కసారిగా జ్ఞానోదయమైంది. కంటి వెలుగు, మనసు వెలుగు — వొక్కచోట నిలిచేయి. ఆ వెలుగులో బుద్ధీ, మనసూ కూడా వొకేసారి తాదాత్మ్యం చెందేయి. ఆ బిందువు దగ్గరే నిజమూ, అబద్ధమూ సంగమించిపోయాయి. గణపతీ, సుందరీ — ఎవరి దృష్టి వారికి సమంజసమైనదే !

కొత్త తలుపుల్ని తెరచుకుంది నా మేధస్సు.

గణపతికేసి చూస్తూ చెప్పాను, ''సుందరి ఆత్మక్షోభ ఎంతవరకూ సమంజసమో చెప్పలేనుగానీ, పల్లవి తుంచిపారేసిన గీతానికి ఎన్ని బాణీలు కూర్చుకున్నా ఏదో లోపం తోస్తూనేవుంటుంది శ్రోతకి మాత్రమే కాదు; పాడే సంగీతకారుడికి కూడా. బహుశా నీ జీవితమూ అంతేనేమో !''

గణపతి నావైపు సాలోచనగా తేరిపార చూశాడు.

క్షణం ఆగి రక్కున అన్నాడు, ''కథకుడివి గదా. నిజాన్ని అబద్ధాన్ని కూడా సమంగానే సమర్థించగలవు !''

నేను ఆశ్చర్యంలో మునిగిపోలేదు; ఆనందంలో తడిసిపోయాను — 'ఫర్వాలేదు; కథలో జీవితమూ, జీవితంలో కథా కల నేతలా అల్లుకుపోతున్నాయన్నమాట !'

గణపతికి మనస్సులోనే అభినందనలు చెప్పాను ! ★



# అరసవెల్లి శ్రీసూర్యదేవాలయం

హిందూ దేశంలో సూర్యదేవాలయాలు అరుదు. కారణం సూర్యదేవుడు ప్రత్యక్ష దైవం కావటం వల్లనే. "సూర్యోజ్యోతిర్జ్యోతి సూర్యః" అను సామ వేద ప్రమాణాను సారము మహోష్ణకాంతి సంపన్నుడు, బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుడు అయిన సూర్యుని ఆరాధన వేదకాలమునకు ముందే కలదని చెప్పవచ్చు. భారతదేశంలోనే కాకుండా సూర్యోపాసన ఖండ ఖండాంతరాలలో కలదు. గ్రీకు దేశీయులు ఆదిత్యుని "అపోలో" అన్న పేరుతో, రోమన్ మేధావులు మార్తాండుని 'మినర్వా' అను మేధా దేవతగా ఆరాధించారు.

హిందూ దేశంలో పూజా పునస్కారాలతో విరాజిల్లుతున్న ఏకైక దేవాలయం శ్రీకాకుళం సమీపానగల అరసవిల్లిలోని సూర్యదేవాలయం. దీనిని గాంగ వంశరాజు గుణశర్మ వారసుడు దేవేంద్రవర్మ క్రీ. శ. 673 సం॥లో నిర్మించినట్లు తామ్రశిలా శాసనాలు తెలియచేస్తున్నాయి.

పురాణాలలో దేవేంద్రుడు, మహాశివరాత్రి పుణ్యదినాన పవిత్ర నాగావళి నది ఒడ్డున బలరాముడు ప్రతిష్ఠించిన రుద్రకోటేశ్వరుని దర్శించుటకు రాగా, పార్వతీ పరమేశ్వరుల ఏకాంత సమయమని నంది దేవేంద్రుని అడ్డగించగా, దేవేంద్రుడు నందితో ఘర్షణపడి, నందీశ్వరుని ధాటికి తట్టుకోలేక ఒక మైలు దూరంలో పడి మూర్ఛిల్లెనని, ఆ తర్వాత నందీశ్వరునికి క్షమాపణ చెప్పమని సూర్యుని అశరీరవాణి హెచ్చరించగా, దేవేంద్రుడు క్షమాపణ కోరగా, అతనికి పూర్వపు జవసత్వాలూ తేజస్సు వచ్చాయని, అందుకు కృతజ్ఞతగా దేవేంద్రుడు పుష్కరిణిని తవ్వగా సూర్యదేవుని విగ్రహము దొరకగా దానిని దేవేంద్రుడు ప్రతిష్ఠించి, పూజించెనని చెప్పబడినది.

సూర్యదేవుని విగ్రహం కృష్ణశిలతో మలచబడినది. సుమారు ఆరడుగుల పొడవు, మూడడుగుల వెడల్పు గలిగిన ఈ విగ్రహము తూర్పు ముఖంగా ఉంది. సూర్యదేవుని పాద పద్మముల వద్ద ఉష, పద్మినీ, ఛాయా అను ముగ్గురు భార్యలు, ఇరువైపులా మాఠరుడు, పింగళుడు అనే ద్వారపాలకులు గలరు. పైభాగపు ఉభయ పార్శ్వములందు సనకసనందనులు ఛత్రం, చామరం వీస్తున్నట్లుగా ఉన్నారు. దిగువ భాగంలో అనూరుడు రథసారధిగా, ఏడు గుర్రముల రథముపై అభయ ముద్రలో ఉన్న రెండు హస్తములు రెండు పద్మాలను ధరించి, భక్తుల అజ్ఞాన, రోగ, దారిద్ర్యాలను నశింపచేయుటకు అవతరించిన అమృత మూర్తిలా ఉంటాడు సూర్యదేవుడు.

విగ్రహము యొక్క రూపకల్పనలో అంతరార్థము వేరుగా ఉంది. ముగ్గురు భార్యలనగా, జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థలని దాన, సత్వ, రజస్తమోగుణములనిగానీ, ప్రాతః, మధ్యాహ్న, సాయం సంధ్యలనిగానీ చెప్పవచ్చు. యిద్దరు ద్వారపాలకులనగా రాత్రి, పగలని, ఛత్రచామరాలు వీచుటలోని అంతరార్థం, మానవుల అహంకార మమకారములు దేవుని కర్పించుటని, రథసారధి అనూరుడు మానవుని బుద్ధికి ప్రతీకని, మానవుని శరీరమందలి ముఖ్యమగు సప్త ధాతువులే సప్తాశ్వములని, పద్మములను ధరించుటనగా భక్తుల హృదయ పద్మములను తన అధీనము చేసుకొనుట అని చెప్పవచ్చు.

సూర్యదేవుని పాద సన్నిధిన సూర్య యంత్రము ఉంది. యంత్రమనగా సూర్య భగవానుని దివ్యశక్తిని కేంద్రీకరించి, భక్తులకు వర రూపములో యిచ్చు పీఠము. ఈ యంత్రమునే సూర్యమండల మంటారు. సూర్యోదయ సమయంలో మన దేశంలో చాల మంది ఈ యంత్రమును కొత్త రూపంలో వేస్తారు. దీనినే మనం ముగ్గు అంటాము. ఈ ముగ్గు సకల శుభాల్ని ఆహ్వానించి దుష్టశక్తుల్ని పారద్రోలుతుంది.

ఉత్తరాయణ దక్షణాయన మార్పుకాలమున సూర్యోదయ సమయంలో పంచభూతాలకు ప్రత్యామ్నాయంగా వున్న అయిదు మహా ద్వారాలని దాటి సూర్యకిరణాలు, ఆలయంలోగల సూర్యదేవుని పాదపద్మాలను స్పృజిస్తాయి. యీ దృశ్యం భక్తులకు గొప్ప అనుభూతి నిస్తుంది సూర్యదేవుని అతి నీలలోహిత కిరణాలందు వ్యాధిని నిర్మూలించే శక్తి ఉంది.



ఆలయ ముఖద్వారం



అరసవెల్లి శ్రీ సూర్యనారాయణస్వామి

ఆలయంలో అంబిక, విష్ణువు, గణేశ్వరుడు, మహేశ్వర విగ్రహములున్నాయి. యివే కాక దుర్గా, లక్ష్మీనృసింహ, విఘ్నేశ్వర, త్రిపురాంతక విగ్రహములు ఉన్నాయి. గర్భాలయపు బయటి ఆవరణలో రెండుప్రక్కలా, మహిషాసుర మర్దని, వినాయక విగ్రహములు కూడా ప్రతిష్ఠించబడి ఉన్నాయి. ఆస్థాన ఆవరణద్వారం పై భాగంలో, సూర్యుడు తప్ప, తక్కిన విగ్రహములు, మధ్యన గజలక్ష్మి విగ్రహములు చెక్కబడి ఉన్నాయి. యింతేకాక ఏకపాద భైరవుడు, శంకరనారాయణస్వామి, ఇంద్ర ప్రతిష్ఠనుటకు తార్కాణంగా ఐరావతము ఉన్నాయి.

ప్రతీ సంవత్సరం, మాఘాది పంచమాసాలలో ప్రతి ఆదివారం ఈ క్షేత్రంలో గొప్ప యాత్ర జరుగుతుంది. అరసవెల్లి సూర్యదేవాలయానికి దేశం నలుమూలలనుండి భక్తులు వచ్చి దేవుని సేవించి తమకోర్కెలను నెరవేర్చుకుంటారు. అరసవెల్లి సూర్యదేవుని దివ్యక్షేత్రం.

మంగళం సూర్యదేవాయ
మంగళం పద్మ బాంధవే ।
మంగళం పద్మినీశాయ ।
భాస్కరాయస్తు మంగళం ॥

వ్యాసం, ఫొటోలు :

—వేమకోటి సీతారామశాస్త్రి




మరొకసారి జేబు తడుముకొన్నాను నేను.

'హమ్మయ్య, భద్రంగానేవుంది డబ్బు.' తృప్తిగా నిట్టూర్చాను.

ఆ రోజే జీతం తీసికొని, దాని తాలూకు ఎనిమిది వందల తొమ్మిది రూపాయల ఎనభై పైసల్లో, తొమ్మిది రూపాయులు, చిల్లరా పై జేబులో వేసికొన్నాను. ఆ ఎనిమిది వందల రూపాయలను మాత్రం భద్రంగా ఒక కాగితంలో పొట్లంకట్టి మరీ ఫాంటు జేబులో వుంచుకొన్నాను.

అయితే, ఏ వస్తువునూ తనలో ఎక్కువ సేపు ఇముడ్చుకోలేక పోవటం, ఆ జేబు లక్షణం. నడుస్తున్నకొద్దీ, ఆ కదలికలకు దేన్నైనా పైపైకి నెట్టివేయటం, దాని స్వభావం. పోనీ పై జేబులో పెట్టుకోవడంగాని, లేక చేతో పట్టుకోవటంగానీ చేద్దామంటే, అది ఇంకా ప్రమాదమని తెల్సు.

అందుకే టైలర్‌ను తిట్టుకొంటూ, అప్పుడప్పుడూ జేబును తడుముకుంటూ నడుస్తున్నాన్నేను.

'కొంపదీసి ఆ డబ్బుగాని, ఎక్కడన్నా జారి పోతే... అయ్యబాబోయ్... ఇంకేమైనా వుందా.'

కేవలం ఆ వూహలే కిరాణాకొట్టువాడు, పాలవాడు, పనిపిల్ల, అముల్ స్ప్రే, పాలపీక, మల్లెపూలు — ఇంకా ఎన్నెన్నో — అన్నీ సినిమా రీలులా నా కళ్ళముందు మెదిలాయి.

గుండెదడనణచుకొంటూ మరొకసారి జేబు తడుముకొని తృప్తిగా శ్వాస పీల్చాను.

''ఒరేయ్... వేణూ...'' కేకవిని వెనక్కు తల త్రిప్పి చూచాను.

పరుగులాంటి నడకతో నన్ను సమీపిస్తున్న మురళి కన్పించాడు.

''ఏమోయ్, ఎంత పిలిచినా విన్పించుకోవటమే లేదు. ఏదో వూహల్లో తేలిపోతున్నట్లున్నావే'' ప్రశ్నించాడతడు.

అతని ప్రశ్నకు సమాధానంగా ఓ చిరునవ్వు నవ్వాను.

మురళి నా ఆప్తమిత్రుడు. ఆ వూర్లోనే పి. డబ్ల్యు. డి. డిపార్ట్‌మెంట్‌లో ప్రేపసర్‌గా పని చేస్తున్నాడు. నేను ఎప్పుడైనా షికారు కెళ్ళటం గాని, సినిమా చూడటం గాని సంభవిస్తే అతనితోనే జరుగుతాయి.

లోకాభిరామాయణం మాట్లాడుతూ స్వీట్ స్టాల్‌లోకి దారితీసాడు మురళి.

''ఏం తీసికొంటావ్ ?'' ప్రశ్నించాడు.

నాకు గులాబ్‌జామ్ తినాలనే కోరిక గల్గింది. అదే అన్నాను.

పోటీపడి బిల్లు నా కంటే ముందే చెల్లించాడతడు.

''సినిమా కెళ్దామా'' అడిగాడు.

విముఖంగా చూచాన్నేను.

''చాలా రోజులైంది, మనం సినిమా చూసి... ఈ రోజు తప్పకుండా వెళ్ళాల్సిందే'' పట్టుబట్టాడు మురళి.

త్వరగా ఇంటికి చేరుకోవాలనే నా కోరికను, అతడి బలవంతం మీద అణచుకొని క్యూలో నిలబడ్డాను.

ఈ మధ్యనే రిలీజైనట్లుంది జనం.. హడావిడి— రద్దీ... గోల —

బుకింగ్‌లో లైటెలగటంతో కలకలం బయల్దేరింది. సమయం 6—15 ని. లు కావొస్తోంది. టిక్కెట్లు మా వరకూ వుంటాయో వుండవోనని ఆందోళన చెందుతున్నాడు మురళి ఓ పది రూపాయల కాగితం కాజేసుకొనే అవకాశం, తృటిలో తప్పిపోతుందేమోనన్న అతని ఆందోళన చూసి, నాకు నవ్వొచ్చింది.

బుకింగ్ కౌంటర్ దగ్గర కొచ్చేసిందిని అక్కడ కూడా డబ్బు నన్ను ఇవ్వనీలేదు మురళి. మా చేతిలోకి ఇలా టిక్కెట్లు వచ్చాయో, లేదో లైటారి పోవటమూ, దభీమని బుకింగ్ క్లోజ్ చెయ్యటమూ రెండూ ఒకసారి జరిగిపోయాయి మా వెనుకతను, మా వైపు కొరకొర నమిలి మింగేలా చూస్తుంటే, నాక్కాస్త భయమేసింది

క్యూ జరిగేటప్పుడు, ఒక వ్యక్తి దూసుకు వచ్చి, మా ముందు క్యూలో కలిసిపోతుంటే మేము వారించిన విషయం గుర్తొచ్చింది. ఇక

ఎక్కువసేపు అక్కడ నిలబడితే ఎక్కడ గొడవ పెట్టుకుంటాడోనని బరబరా మురళి నేను హాల్లోకి ప్రవేశించాము.

చెవులు చిల్లులుపడే మ్యూజిక్కు, తెరపై టైటిల్సూ, ఒకేసారి ప్రారంభమయ్యాయి.

''జబ్బు... జబ్బు... జబ్బు...'' సినిమా పేరు చదివి నేను ఆశ్చర్యపోయ్యాను. అదేదో సినిమాకు పోటీగా తీసార్ట —, మురళి చెపుతున్నాడు.

నావరకు నాకు పిక్చర్ చాలా బోర్‌గావుంది. మురళిమాత్రం చాలా ఉత్సాహంగాచూస్తున్నాడు. హీరో, హీరోయిన్, విలన్ ముగ్గురూ కాన్సర్‌తో మరణించారు. అదీ చిత్రం ముగింపు.

భరించలేని తలనొప్పివల్ల ఈసారి కాఫీ బార్‌లోకి నేనే దారితీసాను. అయితే నేనే డబ్బు లివ్వాలన్న నా ప్రయత్నాన్ని ఈసారి కూడా ఫలించకుండా చేసాడు మురళి.

నేను చాలా నొచ్చుకున్నాను.

అక్కడ నుండి బయట పడిన తర్వాత, సరదాగా కబుర్లు చెపుతూ నడుస్తున్నాడు మురళి. సమయం తొమ్మిదిన్నర అయింది. ఇంటికి త్వరగా చేరుకోవాలనుంది నాకు.

అతను కబుర్లు చెపుతున్నవాడల్లా ఆగి కొంచెం నెమ్మదిగా అన్నాడు.

''నన్నపార్థం చేసుకోకుంటే... ఒక్కటడుగుతాను.''

''అపార్థం అనే పదం యొక్క అవసరం కాని, సందర్భంకాని ఇంతవరకూ మా మధ్య రాలేదు. అలాంటిది, అలా ఎందుకుంటున్నాడో అర్థం కాలేదు నాకు. అయినా నా అనుమానాన్ని దాచుకొని ''ఏవిటి...?'' ప్రశ్నించాన్నేను.

''పోయిన నెలలో పెట్టిన నా లీవ్ శాంక్షన్ కాలేదు. అందుకని ఈ నెలలో జీతం రాలేదురా. ఎలాగైనా ఓ రెండొందలు సర్దుకున్నావంటే... తప్పకుండా వచ్చే నెలలో యిచ్చేస్తాను...''

# సగటు మనిషి

అది వినగానే నా కర్థమయింది, అతను 'అపార్థం' అనే పదం ఎందుకుపయోగించినదీ.

అతనిది ఎర చూపి, చేపను పట్టే తత్వం కాదని నాకు తెలుసు. రాబడి నాశించి ఖర్చు పెట్టే ఉద్దేశ్యం అతనికేకోశానా లేదని నాకు బాగా తెలుసు. అతడు ఆ సహాయం అడగటానికి ఎంత సంకోచించినదీ నాకు బోధపడింది.

ఏమాత్రం వీలున్నా అతనికి సహాయం చెయ్యాలనే తపన నాలో కల్గింది. కాని నా అసహాయ పరిస్థితికి నామీద నాకే కోపమొచ్చింది. ఎలాగోలా తెగించి యిస్తామన్నా, నా దగ్గిర వున్న ఎనిమిది వందలలో, కనీసం పదిరూపాయలు తగ్గినా సర్దుబాటు చెయ్యటం కష్టమయ్యే స్థితినాది.

అతడు చూడకుండా ఇంకోమారు జేబు తడుముకొన్నాను.

నా దగ్గర ప్రస్తుతం డబ్బు వున్న విషయమూ, నా యిబ్బందులూ అన్నీ చెప్పి క్షమాపణ కోరాలన్పించింది నాకు. అయితే అతనికి అడిగిన డబ్బు యివ్వలేనని చెప్పేదానికి ఈ వివరాలన్నీ చెప్పటం అనవసరమన్పించింది.

అందుకే ఆప్తమిత్రుడితో ఒక చిన్న అబద్ధం ఆడాను.

''సారీ ... మురళీ, నాకు మొన్ననే జీతాలొచ్చాయి. అప్పులవాళ్ళు గద్దల్లా వచ్చి నిమిషాలమీద ఎగరేసుకు పొయ్యారు ... నీకు సహాయం చెయ్యలేకపోతున్నందుకు ఎంతగానో బాధపడుతున్నాను. కాని ఏం చెయ్యను ? '' నిస్సహాయతను వ్యక్తం చేసాను.

ఆ సమాధానం విని అతడు నీరుగారి పొయ్యాడు.

అబద్ధం చెప్పానన్న మాటేగాని, నాలో ఆందోళన బయలుదేరింది. ''ఒకవేళ ఉన్నట్టుండి అతడు నా జేబులో చెయ్యి పెట్టి తడిమితే నేను దొరికిపోనూ ! ఆ తర్వాత అతడి ముందు, ఆ ఆప్తమిత్రుడి హృదయంలో ఉన్న స్థానాన్ని పోగొట్టుకొన్న తర్వాత, నేను తలెత్తి నిలబడగలనా ?' పిచ్చి పిచ్చి ఆలోచనలు ముసురుకొంటున్నాయి.

అయినా అతగాడిది, అలాంటి స్వభావం కాదనే ధైర్యం నన్ను కొంత ఊరడిస్తోంది.

ఎందుకో మరి, 'నిజమే చెప్పివుండాల్సింది.. నిజమే చెప్పివుండాల్సింది' అంతరాత్మ వెక్కిరిస్తోంది నన్ను.

ఎలాగైనా త్వరగా అతన్ని వదలి, ఇంటికి వెళ్ళాలనే కోరిక ఎక్కువయింది.

''సరేలేరా ... పాపం ... నువ్వేం చేస్తావ్'' నిర్లిప్తంగా అన్నాడు మురళి.

ఎలాగైతేనేం, అతనికి వీడ్కోలు చెప్పి, టౌన్ బస్ నెక్కాను నేను.

ఎక్కడో టవర్ క్లాక్ మ్రోగుతోంది. లెక్కపెడుతున్నాను, ఒకటి...రెండు...మూడు... పది. శబ్దం ఆగిపోయింది. బస్సు కదిలింది. ఇంటికి ఇంత ఆలస్యంగా వెళ్తున్నాననే బాధ నాలో ఎక్కువయింది. కనీసం జీతమొచ్చిన రోజైనా, కాసిని మల్లెపూలు, ఓ స్వీటు తీసికెళ్ళి భార్యకిచ్చి, ఆవిడను (చంటాడుతో సహా) ఫస్ట్ షో సినిమాకు తీసికెళ్ళి మురిపించలేకపోయానన్న అశక్తత నన్ను వేధించసాగింది.

ఎందుకో మరొక్కసారి జేబు తుడుముకొన్నాను.

అంతే .. ఒక్కసారిగా వెయ్యి వోల్టుల కరెంటు షాకు తగిలినట్లయింది.

బస్సు ఎక్కడ కెళ్తుందో తెలియటంలేదు.

''స్టాప్ .. స్టాప్ ... '' పిచ్చివాడిలా అరువసాగాను

నా కోసం కాకపోయినా ఎలాగూ తరువాత స్టాపింగ్ రావటంతో బస్సు ఆగింది. నా వంక విచిత్రంగా చూస్తున్న ప్యాసింజర్లను గమనించకుండా ఒక్క వుదుటున క్రిందకు దిగాను.

బస్సు కదలి వెళ్ళిపోయింది.

వెళ్తున్న బస్సును చూస్తుంటే నాకన్పించింది— 'ఒకవేళ బస్సులోనే పడిపోయిందేమో !'

కనీసం బస్సులో వెతకాలనే ఆలోచనకూడా రానందుకు వెర్రివాడిలా జుట్టుపీక్కున్నాను.

'ఇప్పుడు ఎక్కడని వెదకాలి ? ఏం చెయ్యాలి ? ఇప్పటికే ఎవరికన్నా దొరికివుంటే.. ఎవరిస్తారు ? ఇక నా పరిస్థితేమిటి ?..' అలమటిస్తున్నాన్నేను.

లక్ష రూపాయల బహుమతిని గెల్చుకున్న టిక్కెట్టును పోగొట్టుకున్నా ఇంత బాధ పడి వుండను. కాని కష్టార్జితం —

...పాలవాడు, పనిపిల్ల, అముల్ స్ప్రే, పాలపీక, మల్లెపూలు — మరోసారి కళ్ళముందు మెదలాయి

మార్కాపురంలో ఇటీవల ఎస్.వి.కె. కళానిలయం నెలనెలా వెన్నెల కార్యక్రమంలో 'అనంతగీతం' కావ్యావిష్కరణ సభలో ప్రసంగిస్తున్న సంస్థ అధ్యక్షులు శ్రీ బోయిన వెంకటేశ్వరరావు, సభాధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి, కృతికర్త శ్రీ అడిదం పాపారావు, కృతిభర్త శ్రీ కె. చంద్రయ్య (ఐ.ఏ.ఎస్.) గార్లని చిత్రంలో చూడవచ్చు.



'మురళికి ఆ అబద్ధం చెప్పటం మూలాన్నే ఈ ఘోరం జరిగిందేమో !' చిన్న సెంటిమెంట్ చోటు చేసికొంది నాలో.

నా కళ్ళలో నీళ్ళు సుడులు తిరుగుతున్నాయి.

నాకు తెలియకుండానే, వడివడిగా నా కాళ్ళు మురళి ఇంటివేపు నడువసాగాయి.

'అయినా మురళి దగ్గరకెళ్ళి ఏమని చెప్పాలి. ఇందాక తనవద్ద డబ్బులున్న సంగతి తెలిస్తే ఇక అతను నాతో స్నేహం చేస్తాడా ? కనీసం మాట్లాడ్తాడా ?' నా అనుమానానికి అర్థం లేకపోలేదు.

ఏమయినాసరే, జరిగిందంతా అతడితో చెప్పుకోవాలి. అతడు ఏమనుకొన్నాసరే, ప్రస్తుతం ఓదార్పు నాకు అవసరం.

స్థిర నిర్ణయంతో మురళి ఇల్లు చేరుకున్నాను .. అతని భార్యాబిడ్డలు పుట్టింటి కెళ్ళిన విషయం నాకు తెల్సు. ఒక్కడే మాగజైను తిరగేస్తున్నాడు''మురళీ..''జీరబోయిన స్వరంతో పిలిచాను.

''అరె... ఏంటిరా . . ఇంటికెళ్ళలేదా ! రా... కూర్చో'' అన్నాడు. ఆ మర్యాదకు నేను అనర్హుడనేమో నన్పించింది.

ఎలా మొదలుపెట్టాలో తోచటంలేదు నాకు.

''ఏం జరిగిందిరా... అదోలా వున్నావ్'' ఆ పరామర్శకు తట్టుకోలేక జరిగిందంతా చెప్పేసి బావురు మన్నాను నేను.

అతడేమీ బదులు పల్కలేదు మౌనంగా లేచివెళ్ళి ప్రక్కనే వున్న బీరువా తెరిచాడు.

అతని ప్రవర్తన నాకేమీ అర్థంకాలేదు. నాకు ఉచ్ఛ్వాస, నిశ్వాస లధికమయ్యాయి. ఆత్రుతగా అతనివైపే చూస్తున్నాను.

అతను బీరువా మూసి ఇటువేపు తిరిగాడు.

అయోమయంగా చూచాన్నేను

అతని చేతిలో డబ్బు... అన్నీ పది రూపాయల కాగితాలు... అవే నోట్లు...

''ఇది... నీవు పోగొట్టుకొన్న డబ్బే'' నా అయోమయాన్ని పటాపంచలుచేస్తూ అన్నాడు మురళి.

నాకు వూపిరి సలపటంలేదు.

లాటరీలో పది లక్షలు వచ్చినా అంత సంతోషపడనేమో... కాని నా కష్టార్జితం... నాకు దక్కుతున్నదని తెలిసినపుడు... అందుకే అనిర్వచనీయమైన ఆనందానుభూతితో వుక్కిరిబిక్కిరవుతున్న నాకు వూపిరి సలపటంలేదు.

అతనే మాట్లాడసాగాడు.

''నీ వెక్కిన బస్సు, అలా కదలిందో లేదో, ఎందుకో క్రిందకు చూచిన నాకు, ఒక చిన్న పొట్లం కన్పించింది. విప్పిచూచాను, డబ్బు — చుట్టూ చూచాను, సమీపంలో ఎవ్వరూ లేరు. దూరంగా వున్నవాళ్ళలో నన్నెవ్వరూ గమనించటంలేదు. లెక్కపెట్టాను ఎనిమిది వందల రూపాయలు. నాకు కల్గిన సంతోషం అంతా యింతా కాదు. ఇల్లు చేరుకున్న నేను ఏదో అనుమానం వచ్చి దాన్ని చుట్టివున్న కాగితాన్ని చూచాను. గుండె ఝల్లుమంది. అది నీ దస్తూరీయే... ఎవ్వరెవరికి ఎంతెంత ఇవ్వాలో వివరంగా వ్రాసివున్న పట్టీ. ఈ డబ్బు నీదేనని బోధపడిన నాలో మొదట కల్గిన సంతోషం హరించుకుపోయి, మరొక విధమైన సంతోషం కల్గింది. నీవు పోగొట్టుకున్న డబ్బు నాకే దొరికిందని నేను పొందిన ఆనందం మాటల్లో చెప్పలేను... నీవిలా వస్తావని నాకు ముందే తెలుసు... కాకపోతే నీ రియాక్షన్ ఎలా వుంటుందో తెలుసుకోవాలనే కుతూహలంవల్ల, నీవు రాగానే ఆ విషయాన్ని చెప్పలేకపోయాను. ఇదిగో... తీసుకో.'' డబ్బును అందించబోయాడు.

అచేతనంగా నిలబడివున్న నాకు మాటలు పెగలటంలేదు నన్ను ఎన్నో ఆలోచనలు పెనవేసుకుంటున్నాయి. నాలో ఎన్నో భావాలు చెలరేగుతున్నాయి.

అతనికెలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలియటంలేదు. 'ఇప్పుడసలు ఈ సొమ్ము దొరక్కపోయి వుంటే... నేనేం చెయ్యగలను?' అప్పుడు నా పరిస్థితి ఎలా వుండేదో ఆలోచించిన నేను, నా బాధ్యతలను, బాధలనూ అన్నింటినీ విస్మరించి నేనందుకొన్న సొమ్ములో రెండు వందలు లెక్కపెట్టి, అతని చేతిలో పెట్టాను.

''నన్నపార్థం చేసుకోవద్దు''నొక్కిపలికాను

కాని అతడు ఆ సొమ్ము నాకే తిరిగి యిచ్చివేస్తూ, ''నీవు జేబులో డబ్బు వుంచుకొని, నాతో అబద్ధం చెప్పావంటేనే నీ పరిస్థితి నర్థం చేసుకోగలిగాను. ఈ డబ్బు నాకంటె నీకే ఎక్కువ అవసరం. ఉంచుకో. నేనెలాగో తంటాలు పడ్తాను'' అని బదులిచ్చాడు.

ప్రస్తుతం అతను చూపుతున్న ఔదార్యం ముందు, క్రితంలో నేను చూపిన సంకుచితత్వం— తలచుకొంటేనే, గుండెల్లో గునపాలు దిగినట్లుంది నాకు.

మహాపర్వతం ముందు నిలబడిన చిట్టెలుకలా వుంది నా స్థితి.

''టేకిట్ యీజీ...'' నా భుజం తట్టాడు మురళి.

ఇంత జరిగినా అతను సులభంగా తీసికొని, నన్నపార్థం చేసుకోకుండా, ఆత్మీయతను చూపుతుంటే —

నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

అతని చేతిని నా చేతిలోకి తీసుకొని ఆప్యాయతతో గట్టిగా నొక్కాను.

'నువ్వు, నిజంగా నా ప్రాణ స్నేహితుడివి' కోటి గొంతుకలతో, మూగగా మూల్గింది నా హృదయం.

ఇక అక్కడ నిలబడలేక, పరుగులాంటి నడకతో ఇల్లు చేరుకొన్నాను.

అయితే మురళికి కూడా ఆ రోజే జీతాలు వచ్చాయని, నన్ను డబ్బులు అడిగినప్పుడు, అతని జేబులో కూడ తొమ్మిదొందలకు పై చిలుకుగానే డబ్బు వున్నదని, ఆ విషయం చెప్పి అప్పు అడగలేక, అతను కూడ అవసరం కొద్దీ, తనలాగే ఓ చిన్న అబద్ధం ఆడాడని వూహ మాత్రంగానైనా అనుకోలేదు నేను. తర్వాత ఎప్పుడో అతడు చెప్తేనే తెలుసుకొన్న నేను అతడూ నాలాగే 'సగటు మనిషే'నని తలపోసాను. ★






# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "రాజకుమార్"లో రమణి పాట్లు

జస్టిస్ జగన్నాధరావు బంగళా ముందు కారు ఆగింది. అందులోంచి ఆయన కొడుకు రాజ్‌కుమార్ (శోభన్‌బాబు) దిగాడు. కాలింగ్ బజార్ మీట నొక్కాడు. తలుపు తెరుచుకుంది. మేక్సీలో ఉన్న శ్రీదేవి ( జయసుధ ) తొంగి చూసింది.

"నమస్తే ! నా పేరు రాజ్‌కుమార్ !" కొంటెగా అన్నాడు.

చిలిపిగా చూస్తూ, "అలాగా ? రండి — రండి !" అంటూ శ్రీదేవి, అతన్ని లోనికి తీసుకెళ్లి, సోఫా చూపించింది.

"థాంక్స్ ! ఇంతకీ మీరు ? "

"నేను జడ్జి జగన్నాధరావుగారి దగ్గర ఉంటూ, లాయర్ ప్రాక్టీస్ చెయ్యాలని వచ్చానండి."

"ఆల్ రెడీ ఈ ఇంట్లో ఆయన కొడుకొకడు లాయర్ ప్రాక్టీస్ చేస్తున్నట్లున్నాడు ? "

శ్రీదేవి నెత్తి బాదుకుంటూ హేళనగా "జగన్నాధరావుగారి అబ్బాయి గురించి అడుగుతున్నారా ? వద్దండి, బాబూ, వద్దండి ! పేరుకి లాయర్ గాని, పనికి మాత్రం ఉత్త అప్రయోజకుడండి. తిండి దగ్గర రెండు మూడు కంచాలు లేపేస్తాడు. ఏదైనా కేసొస్తే, పది పన్నెండు గ్లాసులు నీళ్లు తాగేస్తాడు."

ఉడికిపోయిన రాజకుమార్, శ్రీదేవి చెవి మెలివేస్తుండగా, అటు వచ్చిన అతని తల్లి అన్నపూర్ణమ్మ (జానకి) "అరెరె ! ఏమిట్రా ఇది ?" అంది.

"ఈ వసపిట్టనీ, వాగుడుకాయనీ, గయ్యాళి గంగమ్మనీ ఇంట్లోకి ఎందుకు రానిచ్చావమ్మా?"

"మిస్టర్ ! చెవి వదులు ! ఆడపిల్ల చెవి పట్టుకుంటే, ఆర్నెల్లు జైలు శిక్ష పడుతుంది. అసలు నువ్వెవడివి ?"

"నన్ను — నువ్వు అంటావా ? చెట్టంత మగాణ్ని పట్టుకొని నువ్వంటావటే ? మర్యాద— మర్యాద ... గివ్ రెస్పెక్ట్ ! మీరు—అను."

"నేను నా మొగుణ్నొక్కడ్నే మీరు...వారు — అని పిలుస్తాను. చెప్పు ! నీకు రెస్పెక్ట్ కావాలా ? మీరు అని పిలవనా ? "

"వద్దు. వద్దు. నాకు రెస్పెక్ట్ వద్దు. బహువచనం వద్దు — ఏకవచనంతో నువ్వు అనే అను. కావాలంటే, ఒరే — అని కూడా అను, తల్లీ ! "

"తల్లిని పక్కన పెట్టుకుని, నన్ను తల్లీ అంటావా ? అసలు నేను నీకు ఏవౌతాను ?"

"మా అమ్మ అన్న కూతురివి."

"అంటే, పెళ్ళాన్నవుతాను."

"అశ్వత్థామ హతః కుంజరహః" అంటూ రాజకుమార్ అమాంతంగా చెవులు మూసుకున్నాడు.

"వినిపించే వరకు అరచి చెప్పడానికే నేను ఇక్కడకొచ్చి, మకాంవేశాను," అంటూ శ్రీదేవి, అతని చేతులు లాగింది.

"ఇక లాభంలేదురా, బాబూ !" అంటూ రాజకుమార్ అక్కడ్నుంచి తుర్రుమన్నాడు.

అన్నపూర్ణమ్మ నవ్వుకుంది.

గుత్తా రామినీడు దర్శకత్వంలో ఆలపాటి రంగారావు నిర్మించిన శ్రీనాథ్ మూవీస్ "రాజకుమార్" చిత్రానికి కోగంటి భాస్కరరావు నిర్మాణ సారథి.

'రౌడీరాజా'లో తులసి



## "సింహపురి సింహం"లో విజయ్ శపథం

"ఈ చిత్రంలో చిరంజీవి రెండు విభిన్నమైన పాత్రలు ధరిస్తున్నారు," అంటూ విజయశాయి ఫిలిమ్స్ "సింహపురి సింహం"



సెట్‌లో కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కోడి రామకృష్ణ చిత్రీకరించబోయే సన్నివేశం యొక్క పూర్వాపరాలు వివరించారిలా.

విజయ్ (చిరంజీవి), మాధవి (మాధవి) కాలేజ్ మేట్స్, ఇద్దరి మనసులూ కలిశాయికూడా. కాని, ఆ తర్వాత విజయ్ ఒక హంతకుడి కొడుకని తెలిసి అతన్ని మాధవి ఏవగించుకో సాగింది. ఐతే, మాధవి తండ్రి ఫారెస్ట్ రేంజర్ (రమణమూర్తి)కి విజయ్ నిస్వార్థచింతన, ధర్మ సంస్థాపనార్థం అతను నిరంతరం జరిపే పోరాటం ఎంతో నచ్చాయి. సీతారామస్వామి (మారుతీరావు)కి భయపడి ఆ ఊరు ఊరంతా విజయ్‌కు నీడనివ్వడానికి కూడా సంకోచిస్తే, అతన్ని మాధవి తండ్రి తన ఇంటికి తీసుకొచ్చి ఆశ్రయమిస్తాడు. ఇది మాధవికి నచ్చలేదు. హంతకుడి కొడుక్కి ఆశ్రయం ఇవ్వడం మంచిది కాదని వాదించింది. విజయ్ ఆత్మాభిమానం దెబ్బతిన్నది. తన తండ్రి హంతకుడు కాదని, నిర్దోషి అని నిరూపించేవరకు వాళ్ళింట్లోనే ఉండి, నిజమేమిటో ఆమెకు తెలియజేస్తానని మాధవి ఎదుట శపథం చేస్తాడు.

కె. ఎస్. నారాయణశెట్టి సమర్పణలో మహేష్, గోపీనాథ్ ఈ చిత్ర నిర్మాతలు.



కృష్ణ, జయప్రద ''ప్రజా రాజ్యం''లో

## ''భార్యాభర్తల సవాల్''లో విజయ్ సవాల్

అడవిలో ఒక లోయలో ఎన్నో ఎకరాల పొలంలో పంటలు సిద్ధం చేసి, కోయవాళ్ళు లారీలలోకి ఎక్కిస్తున్నారు. చక్రవర్తి (రావు గోపాలరావు), మేనక(జయమాల) చూస్తున్నారు. ఇంతలో ఫారెస్ట్ ఆఫీసర్ విజయ్ (మోహన్‌బాబు) వచ్చి, ''ఆపండి! ఈ పంటంతా ఎవరి కష్టంతో పండిందో వాళ్ళకు చేరనివ్వండి !'' అన్నాడు.

''ఎవరు వాళ్ళు ?'' అన్నాడు చక్రవర్తి.

''మీ కంటికెదురుగా కనబడుతున్న కష్ట జీవులు... పండించే వాడే రైతు. దున్నేవాడిదే భూమి.''

''ఇంకా నయం. గొరిగే వాడిదే తల, ఉతికే వాడిదే బట్ట, పెళ్ళి చేసిన పురోహితుడిదే పెళ్ళాం అన్నావు కాదు. ఈ భూములు మావి. మేమెంతో కాలంగా సాగు చేసుకుంటున్నాము. కావాలంటే వాళ్ళనే అడుగు.''

''పిల్లికి ఎలుక సాక్షి మక్కర్లేదు. ఎంతో కాలంగా మీరు అనుభవిస్తున్నారని నాకు తెలుసు. కాని, ఎంతో కాలంగా నేను ప్రయత్నించి ఈ పొలం రికార్డులు సంపాదించానని మీకు తెలియదు ఈ భూములు వాళ్ళవని వాళ్ళకు తెలియదు. మీ కథ కంచి కెళ్ళింది. ఈ పంటను, భూమిని వదిలి మర్యాదగా వెళ్ళండి.''

''మా కథ కాదురా; నీ కథే కంచి కెళ్తుంది,'' అంటూ చక్రవర్తి పక్కనున్న రౌడీలతో ''చూస్తారేం రా?'' అన్నాడు. వెంటనే ఆ రౌడీలు, విజయ్ మీద పడ్డారు. హోరాహోరీ పోరాటం జరిగింది. చివరికి ఆ రౌడీలను విజయ్ చిత్తు చేస్తూంటే చక్రవర్తి భయపడి, ''ఆగండిరా, ఆగండి ! మిస్టర్ విజయ్ ! కుక్క గొడుగులకు నీడ పట్టబోయి, నీ తల మీదున్న గొడుగు కాస్త పోగొట్టుకోకు !''

''పోయినా ఫరవాలేదు. తాను ఎండకెండినా తన దగ్గరికి చేరిన వాళ్ళకు నీడ నివ్వడం చెట్టుకు అలవాటు. అదే దాని గొప్పతనం,'' అన్నాడు విజయ్.

''చెట్టు ఎంత గొప్పదైనా గొడ్డలికి లోకువ.''

''గొడ్డలి ఎంత పదునైనా నిప్పుల కొలిమికి లోకువ.''

''ఏ నిప్పయినా, నింగైనా మనిషి మెదడుకు లోకువ. అడ్డుకోబోయే ముందు ఆవేశమే కాదు; ఆలోచన కూడా ఉండాలి.''

''ఆవేశమే కాదు; ఆత్మబలం కూడా ఉండాలి. ఆ రెండూ నాకు పుష్కలంగా ఉన్నాయ్,'' అని విజయ్ అనేసరికి చక్రవర్తి నోట ఏ మాటా పెగల్లేదు.

పి. చంద్రశేఖరరెడ్డి దర్శకత్వంలో ఆర్ రామకృష్ణంరాజు, కె. ఎల్. ఎస్. ఎస్ రామచంద్రరాజు నిర్మించే పద్మజా కళామందిర్ ''భార్యాభర్తల సవాల్'' చిత్రానికి ఎస్. వి. సుబ్బరాజు కథకుడు.

విజయశాంతి, సుమన్
'పండంటి కాపురానికి 12 సూత్రాలు'





'సింహపురి సింహం' చిరంజీవి, మాధవి



# సినిమా

## "లంకె బిందెలు"లో ముసలి ప్రియురాలు

గోపి (కృష్ణ) కన్న కలల ప్రకారం తోట ఏపుగా పెరిగింది. చేపల చెరువు కూడా నిండుగా ఉంది. గోపి నడుముకి తుండు చుట్టుకుని, పారతో మట్టి తీసి, పక్కనున్న చెట్లకు నీళ్ళు వదలసాగాడు. ఇంతలో ఒక పండు ముసలమ్మ చేతికర్రతో తడబడుతూ వచ్చింది. "ఒరే, నాయనా ! గోపాలకృష్ణమూర్తంటే నువ్వేనా, బాబూ ?" అంది.

"అవునవ్వా, ఏమిటి విశేషం ?"

"ఏం లేదురా... పొద్దున్న పేపర్లో నీ ఫోటో చూసి, నిన్ను లవ్ చేసి వెతుక్కుంటూ వచ్చాలే !" అంది ముసలమ్మ వణుకుతూ.

"అవ్వా ! నువ్వా, అవ్వా ?"

"అవ్వనైతేనేం ? మనది జన్మ జన్మల బంధంరా, గోపాలా ! నీకోసం మూగమనస్సుల్లో గౌరిలా గోదారి గట్టున పడుతున్నారా. ఒకసారి కావలించుకో," అంటూ గోపీమీద పడింది. అప్పుడామె తలమీది ముగ్గుబుట్టలాంటి విగ్గు కాస్త తొలగడంతో ఆమె రమ (జయసుధ) అని ఇట్టే గుర్తించగలిగాడు గోపి. కథ అడ్డం తిరిగినందుకు రమ సిగ్గుతో పరుగుతీసింది. ఆమెను గోపి వెంబడించాడు.

"ఆ తర్వాత డ్యుయెట్ సాంగ్‌ను పిక్చరైజ్ చేస్తాం," అన్నారు విజయనిర్మల. ఈమె స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే

శరత్‌బాబు, సనత్, సింహళ తార మాలిపీఫోన్ సెకా, 'ఉక్కుమనిషి'లో






"లవ్‌సీన్‌లో హీరోయిన్ని నడ్డిమీద తన్నినట్టు తంతాడు. ఆయన దగ్గర వేషం వెయ్యటం కష్టం !"

రంజిత్ క్రియేషన్స్ "లంకె బిందెలు" చిత్రానికి కానూరి రంజిత్‌కుమార్ నిర్మాత, ఎం బాలకృష్ణ సహనిర్మాత.

## దాసరి అంగీకరించిన కొత్త చిత్రాలు

లోగడ "ముద్దబంతి పువ్వు" నిర్మించిన మాటూరి జగన్మోహనరావు, ఆర్. సుబ్బారావు కలిసి జనచిత్ర బానర్‌లో నిర్మించే చిత్రానికీ, ఎం. కె మావుళ్ళయ్య నిర్మించబోయే చిత్రానికీ దర్శక రచయిత దాసరి నారాయణరావు అంగీకరించారు.



శ్రీదేవి, కమలహాసన్ 'వెన్నెల వెలుగులు'

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

రామ్‌ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ ''నిప్పురవ్వలు'', ఆంధ్ర వాహినీ సినీస్టూడియోస్ ''చైతన్యరథం'', గురజాడ ఆర్ట్ థియేటర్ ''ఎంతెంత దూరం'', ఎస్. ఎస్. మూవిటోన్ ''కిల్లాడి దొంగలు'', శబరిగిరినాధన్ పిక్చర్స్ ''నన్ను చూడు నా అందం చూడు'', ముద్దు ఆర్ట్ మూవీస్ ''త్రిమూర్తులు'', శ్రీ రమణ చిత్ర కంబైన్స్ ''చట్టానికి సవాల్'', శాంతాకార చిత్ర ''చిగురించిన జీవితాలు'', వర్మ ప్రొడక్షన్స్ ''మానవుడు'', టి. పి. ఆర్ట్ పిక్చర్స్ ''మాయలాడి'', గీతా క్రియేటివ్ ఆర్ట్స్ ''యుముడికి మొగుడు'', శ్రీ శరత్ ఆర్ట్స్ ''కోటీశ్వరుడు'', విశ్వచిత్ర కంబైన్స్ ''సుందోప సుందులు''.

## దాసరి, శోభన్ కాంబినేషన్‌లో "జగన్"

''సెంటిమెంటల్ ఆక్షన్ చిత్రం,'' అన్నారు దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో వడ్డె సుబ్బారావు, విజయశంకర్ నిర్మించే లలితాలయ మూవీస్ ''జగన్'' చిత్రం షూటింగ్ జూలై 15న మొదలైంది. ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది. శోభన్ బాబు, జయసుధ, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, అల్లు రామలింగయ్య ప్రభృత తారాగణం. చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, భాస్కరరాజు శిల్పం, వి. కృష్ణంరాజు కూర్పు, కమల్‌తేజ్ సహ దర్శకత్వం వహిస్తున్నారు.

'ఈపిల్లకు పెళ్లవుతుందా?' జ్యోతి, పూర్ణిమ, తులసి, శ్యామలగౌరి.



## బాపు దర్శకత్వంలో జయకృష్ణ చిత్రం

''హీరోయిన్‌గా పూర్ణిమా జయరాంను పరిచయం చేస్తున్నాం,'' అన్నారు జయకృష్ణ. ఈయన జూన్ 16న ముద్దు ఆర్ట్ మూవీస్ పతాకంలో కొత్త చిత్రాన్ని అల్లు రామలింగయ్య క్లాప్, అల్లు అరవింద్ కెమెరా స్విచ్ ఆన్‌లతో ప్రారంభించారు. చిరంజీవి, తులసి, శ్రీలక్ష్మి, దేవికారాణి, 'శుభలేఖ' సుధాకర్, అల్లు రామలింగయ్య, నూతన్ ప్రసాద్, రాళ్ళపల్లి నటిస్తున్నారు. ముళ్ళపూడి వెంకటరమణ రచయిత, ఇళయరాజా స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు. లోక్‌సింగ్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, అనిల్ దత్తాత్రేయ కూర్పుతో ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న బాపు ''సెప్టెంబర్‌లో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు.

# తెరపొరలు

★ "తోడూ నీడ, ఊహా సుందరి, ప్రేమ సాగరం, ఇంటిగుట్టు" వగైరా చిత్రాల్లో నటించే నళిని కుటుంబంలోని వారంతా సినిమారంగంతో సంబంధం ఉన్నవారే. తండ్రి వైకోంమూర్తి నృత్య దర్శకుడు. తల్లి ప్రేమ నర్తకి. అన్న కుమార్ సహాయ నృత్య దర్శకుడు. మరో అన్న రాజు ఛాయాగ్రాహకుడు. ఇంకో అన్న వాసు ఎమ్. ఎమ్. థియేటర్‌లో ఆపరేటర్ .. నళిని తొలి తమిళ చిత్రం "ఉయిరుళ్ళవరై ఉష"లో స్విమ్మింగ్ డ్రెస్‌లో జలకమాడే సన్నివేశంలో నటించినందుకు ఇంటిల్లిపాదీ కోప్పడ్డారట. ఇప్పుడీమె నటిగా తన వ్యవహారాలన్నీ తనే చూసుకుంటోంది. కథ చక్కనిదైతే వెంటనే అంగీకరిస్తుంది. పారితోషికం విషయంలో ఎంత కరెక్ట్‌గా ఉంటుందో షూటింగ్‌లకు హాజరయ్యే విషయం లోనూ అంత కరెక్ట్‌గా ఉంటుందట. షూటింగ్‌లకు తనవాళ్ళ నెవరినీ తీసుకెళ్ళదు.

★ బాపు న్యాయశాస్త్రంలో పట్టభద్రుడు. ఈయనకు చిత్రలేఖనం హాబీ అయితే, చిత్ర దర్శకత్వం వృత్తి. తొలుత బొంబాయిలోని జె. జె. స్కూల్ ఆఫ్ ఆర్ట్స్‌లో చిత్రలేఖనాన్ని వాణిజ్యపరంగాను అభ్యసించాలనుకున్నారు. కాని, అడ్వకేట్ అయిన ఈయన తండ్రిగారు "ముందు ఓ వారం రోజులపాటు లా కాలేజీకి వెళ్ళి చూడు. నచ్చకపోతే ఆ తర్వాత ఆర్ట్స్ స్కూల్‌లో చేరొచ్చు," అని సలహా ఇచ్చారు. బాపు లా కాలేజీలో చేరిన కొంతకాలానికి తండ్రిగారు పరమపదించారు. "ఆయన కోర్కె తీర్చడం కోసం లా చదివాను నా ఆశయం మేరకు బొమ్మలు," అంటారు బాపు.

★ "రజియా సుల్తానా" చిత్రం నిడివి దాదాపు 18 వేల అడుగులు. షూటింగ్‌లో డైరెక్టర్ కె. ఆసిఫ్ 2,25,000 అడుగుల ఫిల్మ్‌ను ఎక్స్‌పోజ్ చేశాడు. 110 రీల్స్‌ను ఓకే చేసి, 18 రీల్స్‌కు కుదించమని ఎడిటర్ బి. ఎస్. గ్లాడ్‌తో చెప్పాడు. ఎడిటర్ అతి నైపుణ్యంతో తన పనితనాన్ని చూపాడు. ఇప్పుడీ చిత్రం ప్రదర్శన కాలం 3 గంటల 3 నిమిషాల 30 సెకెండ్లు. "మొఘల్—ఇ. ఆజమ్" చిత్రం కన్నా ఒక్క నిమిషం తక్కువ! ఈ చిత్రంలో నటించడం కోసం ధర్మేంద్ర దాదాపు 500 సార్లు ముఖానికి నల్లమేకప్ వేసుకున్నాడట. గుర్రాలు వరుసగా పడిపోయే ఒకే షాట్‌ను చిత్రీకరించడానికి విదేశాలనుంచి సాంకేతిక నిపుణులు పిలిపించబడ్డారు. ఒక విందు సన్నివేశాన్ని చిత్రీకరించ డానికి 10 రోజులు పట్టింది. ఇందులో 1500 మంది ఆర్టిస్టులు పాల్గొన్నారు. వాళ్ళు తృప్తిగా భోంచేసిన ముఖభావం కనిపించడం కోసం వెండిపళ్ళెలలో స్వచ్ఛమైన నేతితో తినుబండారాలు వడ్డించబడ్డాయి. "ఇన్ని కోట్లు ఖర్చయినా ఒక చక్కని కళాఖండాన్ని రూపొందించినందుకు కమల్ అమ్రోహికి ఎంతైనా కృతజ్ఞులం," అన్నారట ఈ చిత్ర నిర్మాతలు మిశ్రా సోదరులు!

ఇటీవల నెల్లూరులో నెఫ్జా సంగీత నృత్య కళాపరిషత్ వారు నిర్వహించిన సంగీత నృత్య పోటీల సందర్భంగా పరిషత్ తరఫున నృత్య దర్శకుడు శ్రీ ఎస్. ఆర్. రాజుకి డి. పి. ఆర్. వో. శ్రీ చంద్రశేఖరయ్య, సినీనటి కుమారి సులక్షణకి జిల్లాపరిషత్ ఛైర్మన్ శ్రీ బాల చెన్నయ్య సన్మానం చేశారు. నెఫ్జా అధ్యక్షుడు శ్రీ సుందర రామిరెడ్డిని కూడా చిత్రంలో చూడవచ్చు.





## సినిమా

### "చట్టానికి సవాల్"

"కన్న తండ్రిని అమానుషంగా చంపిన వ్యక్తులపై అతి నేర్పుతో పగ తీర్చుకుని తండ్రి ఆత్మకు శాంతి చేకూర్చే పాత్రలో మాధవి చాలా బాగా నటించింది. పోలీస్ ఆఫీసర్‌గా సుమన్, ప్రియురాలుగా స్మిత పాల్గొన్నారు," అన్నారు గుండు సత్యనారాయణ. ఈయన నిర్వహణలో సి. హెచ్. శశికుమార్ నిర్మించే జి. సి. ఆర్ట్స్ "చట్టానికి సవాల్" చిత్రానికి రాజశ్రీ రచయిత. శంకర్ గణేశ్ సంగీత దర్శకులు. నాగేశ్వరరావు సంకలకర్త. ఛాయాగ్రహణం, దర్శకత్వం : కర్ణన్.



జయసుధ 'లంకెబిందెలు'

### "ఇంటి ఇల్లాలు"

"జూలై 16న ఔట్‌డోర్‌లో రెండవ షెడ్యూల్ మొదలెట్టాం. ఇది పక్షంరోజులపాటు జరుగుతుంది," అన్నారు జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి. ఈయనా, వెంకట నరసింహారావూ నిర్మించే విష్ణుప్రియ సినీ కంబైన్స్ "ఇంటి ఇల్లాలు" చిత్రంలో ఎ. ఎన్. ఆర్., జయసుధ, గుమ్మడి, పుష్పలత, మరో నవ నటి పాల్గొంటున్నారు. పరుచూరి సోదరులు మాటలు రాశారు. వేటూరి, రాజశ్రీ గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. సెల్వరాజ్ ఛాయ, భాస్కరరాజు, శిల్పం, వీరప్ప కూర్పుతో సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు.

## "వెన్నెల వెలుగులు"

"తాతకి తగ్గ మనవడి కథ మనవడుగా కమలహాసన్, ప్రేయసిగా శ్రీదేవి నటించారు వాగేష్ హాస్యం విశేషాకర్షణ," అన్నారు గాయత్రీ దేవి ఈమె సమర్పించే శర్వాణీ ప్రొడక్షన్స్ "వెన్నెల వెలుగులు" చిత్రానికి పి వి రమణ మాటలు, జి ఎల్ ఎన్ శాస్త్రి పాటలు రాశారు ఎం ఎస్ విశ్వనాథం సంగీత దర్శకుడు కృష్ణన్‌పంజు దర్శకత్వంలో డి అంజిరెడ్డి, చెల్లా రామకృష్ణారెడ్డి నిర్మించే ఈ చిత్రం ఆగస్టు విడుదల ఈ చిత్రంలో కె ఆర్ విజయ ఒక క్లిష్టమైన భూమికను నిర్వహించింది



'ప్రేమసాగరం'లో నళిని.

## "ప్రేమ సాగరం"

"చక్కని ప్రణయగాథ గంగ, నళిని అనే యువతారలు, గెస్టు పాత్రలో సరిత మరపురాని నటనను ప్రదర్శించారు మరో విశేషమేమి టంటే నటుడు, సంగీత దర్శకుడు, కథకుడు, స్క్రీన్‌ప్లే రచయిత, డైరెక్టర్‌గా పేరుగాంచిన టి రాజేందర్ ఈ చిత్రానికి దర్శకుడు," అన్నారు పి స్వర్ణసుందరి ఈమె నిర్మించే ఆదిత్య క్రియేషన్స్ "ప్రేమ సాగరం" చిత్రం తుది మెరుగులు దిద్దుకుంటోంది

# ప్రముఖ కన్నడ హీరో
# డాక్టర్ రాజ్ కుమార్



ఈయన తొలి చిత్రం ''బేడర కణ్ణప్ప'' (1954). ఇందులో పండరీబాయి నాయిక. 1955 లో కూడా ఈయన ఒకే చిత్రంలో నటించారు. 1956 లో మూడు, 1957 లో రెండు, 1958 లో ఏడు, 1959 లో అయిదు, 60లో ఆరు, 61లో ఎనిమిది, 62 లో పదిహేడు, 63 లో ఏడు, 64 లో పన్నెండు, 65లో పన్నెండు, 66లో అయిదు, 67 లో ఆరు, 68 లో పదహారు, 69 లో పది, 70 లో పన్నెండు, 71 లో పది, 72లో ఎనిమిది, 73లో ఆరు, 74లో అయిదు, 75 లో మూడు, 76లో అయిదు, 77 లో అయిదు, 78 లో మూడు, 79 లో రెండు, 80 లో రెండు, 81 లో మూడు, 82 లో మూడు, 83 లో మూడుచిత్రాలలో నటించారు.

ఈయన సరసన నాయికగా జయంతి 32 చిత్రాలలో నటించింది. అలాగే భారతి 26, లీలావతి 30, పండరీబాయి 11, బి. సరోజాదేవి 8, కల్పన 14, ఆరతి 10, షావుకారు జానకి 6, ఆదోని లక్ష్మి 3, జమున 3, కృష్ణకుమారి 6, వందన 1, శ్రీరంజని 1, సంధ్య 2, ఎం.వి.రాజమ్మ2, మైనావతి 1, ప్రతిమాదేవి 1, జి.వరలక్ష్మి 1, హరిణి 5, చంద్రకళ 2, సరిత 3,మాధవి 1, జయమాలా 7, అంబిక 2, రూపాదేవి 1, సులక్షణ 1, సుమలత 1, కాంచన 3, లక్ష్మి 5, జయప్రద 3, జయచిత్ర 1, రేఖ 1, సురేఖా 3, ఉదయ చంద్రిక 2, రాజశ్రీ 3, బి. వి. రాధ 2, గాయత్రి 1, వాణిశ్రీ 2, పద్మప్రియ 3, లత 1, మంజుల 8, రాజసులోచన 1 చిత్రాలలో నాయికలుగా నటించారు.

ఈయన 25వ చిత్రం ''నాగార్జున''లో జి. వరలక్ష్మి నాయిక. 50 వ చిత్రం ''శ్రీ రామాంజనేయ యుద్ధం'' లో ఆదోని లక్ష్మి, 75 వ చిత్రం ''తూగుదీప''లో లీలావతి, 100వ చిత్రం ''భాగ్యద బాగిలు'' లో వందన — బి. వి. రాధ, 125 వ చిత్రం ''బాళు బెళగితు'' లో జయంతి — భారతి, 150వ చిత్రం ''గంధద గుడి'' లో కల్పన, 175వ చిత్రం ''రవిచంద్ర'' లో లక్ష్మి—సుమలత, 183 వ చిత్రం ''కవిరత్న కాళిదాస''లో జయప్రద నాయికలు.

ఈయన ప్రప్రథమంగా గానం చేసిన చిత్రం ''ఓహిలేశ్వర'', ఇంతవరకు 37చిత్రాలలో 104 పాటలు పాడారు. ఎస్. జానకితో కలిసి 32, వాణి జయరాంతో 6, పి.సుశీలతో 2, సులోచనతో 3, పి. బి. శ్రీనివాస్‌తో 4, ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యంతో 1, కస్తూరి శంకర్‌తో 1, హెచ్. పి. గీతతో 1, సరోజినితో కలిసి 1 — పాటలు పాడారు.

ఈయనకున్న బిరుదులు : వరనట, నట సార్వభౌమ, రసికరరాజ, కళాజ్యోతి, అభినయ కళాతపస్వి, గాన గాంధర్వ. ఈయనకు 1976 లో మైసూరు విశ్వవిద్యాలయం ''గౌరవ డాక్టరేట్'', 1982లో అమెరికా సంయుక్త రాష్ట్రాలు ''కెంటుకి కర్నల్'', 1983లో కేంద్రప్రభుత్వం ''పద్మభూషణ'' గౌరవాలు లభించాయి.

కర్నాటక రాష్ట్రంచే అయిదుసార్లు అత్యుత్తమ నటుడుగా ఎన్నుకోబడ్డారు. అవి: 1967లో ''బంగారద హూ'', 1970లో ''కుల గౌరవ'', 1974లో ''భక్త కుంబార'', 1977 లో ''బభ్రువాహన'', 1982 లో ''హొస బెళకు''.

ఈయన చిత్రాలు కొన్ని 54 వారాలు, 104 వారాల చొప్పున ప్రదర్శింపబడ్డాయి కూడా.

ఈయన గురించి ప్రముఖుల కితాబులు: ''కర్నాటక రాష్ట్రపు మకుటంలేని మహారాజు'' (కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణ హెగ్గడె) ''ఈయన నిత్యనూతనవరుడు హి ఈజ్ ఎ బాయ్, ఎ టైగర్, ఎ యోగి'' (ఎ. ఎన్. ఆర్). ''ఈయన కన్నడ రాజ్య కుమార్'' (దాసరి నారాయణరావు).

[—జి. వి. జి.]



అనంతపురంలో జరిగిన కే. శే. రొద్దం హనుమంతరావుగారి స్మారక నాటిక పోటీలలో శ్రీ రాఘవేంద్ర నాట్యకళామండలి(అనంతపురం) ప్రదర్శించిన 'తులసీ తీర్థం'లో ఉత్తమ నటిగా ఎన్నికైన కుమారి బి. రాధారాణి.

## సినిమా

### మాదాల "వీరభద్రుడు"గా జయకృష్ణ సమర్పించే చిత్రం

''రచయిత పినిశెట్టి పుత్రుడు, దాసరి శిష్యుడు అయిన పినిశెట్టి రవిని డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నాం,'' అన్నారు జయకృష్ణ. ఈయన సమర్పించే ముద్దుకృష్ణ మూవీస్ ''వీరభద్రుడు'' చిత్రంలో మురళీమోహన్, రాధిక, సుహాసిని, ఒక వెరైటీ పాత్రలో మాదాల రంగారావు నటిస్తారు. ''నాకు తోడ్పడటానికి మాదాల ఈ కమర్షియల్ చిత్రంలో నటించడానికి అంగీకరించినా, ఆయన పాత్ర ఆయన నమ్ముకున్న సిద్ధాంతాలకు అనుగుణంగానే రూపొందించబడింది,'' అన్నారు ఈ చిత్రాన్ని నిర్మించే సంకలనకర్త సి. హెచ్. సుబ్బారావు. వేటూరి గీతాలు, ఇళయరాజా సంగీతం, కోటేశ్వరరావు ఛాయ, భాస్కరరాజా శిల్పంతో ఆగస్టులో షూటింగ్ మొదలవుతుంది.

### ''పద్మవ్యూహం''

''గొల్లపూడి కథ, మాటలు సమకూర్చడమే కాక ఒక సరికొత్త తరహా పాత్రను కూడా పోషిస్తారు,'' అన్నారు రాజాచంద్ర. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో దిడ్డి శ్రీహరిరావు నిర్మించే ''పద్మవ్యూహం'' చిత్రం షూటింగ్ సెప్టెంబర్‌లో ప్రారంభమవుతుంది. ★

# The stove that not only glows but glitters




# chetak
## Gas Stove

IS : 4246

ISI

**Highlights :**

- Perfectly Engineered.
- Swiss Technology Control Valve for Prevention of Gas leakage
- Plated Burner Tops Rust free
- Better fuel efficiency
- Economically Priced

**DISTRIBUTORS FOR ANDHRA PRADESH**
MADICON INDO-INTERNATIONAL
1-10-197/4, First Floor, Ashok Nagar X Roads
Hyderabad - 500 020. A.P INDIA
Phone 61286 64757 Grams MADICON

**PRODUCT OF**
**JAINCO INDUSTRY**
NEW DELHI

MAYURA

ప్రసిద్ధి చెందిన హిందుస్థాన్ పెట్రోలియం, భారత పెట్రోలియం మరియు ఇండియన్ గ్యాస్ డీలర్ల వద్ద కూడ లభించును.

సీరియల్

# మానస మురళి

కొమ్మూరి సాంబశివరావు

13

(గత సంచిక తరువాయి)

''హల్లో! ఎవరది మాట్లాడేది?'' అవతలనుంచి ఒకరకమైన మోటు స్వరం వినిపించింది.

''ఇంతకూ మీరెవరు?—'' అసహనంగా అడిగాడు విజయ్

''నేనెవరో తెలీదా? ఈ ఊర్లో ఎవర్ని అడిగినా చెబుతారే సర్లే. నేను కాంట్రాక్టర్ అప్పలరాజును మాట్లాడుతున్నాను ఇనస్పెక్టర్ విజయ్ వున్నాడా?''

ఆ ధోరణికి విజయ్‌కి మరింత అసహనం కలిగింది

''యస్ నేనే విజయ్‌ను''

''నువ్వేనా సామీ! మరి చెప్పవేం? అద్సరే, ఏంది మావాడిని అరెట్టుచేసావంట నీ వరసేం బాగాలేదు. నీకీ ఊరు కొత్తలావుంది నా పలుకుబడి తెలిసిన వాళ్లెవరూ ఇంతవరకు నా జోలికి రాలేదు అనవసరంగా నాతో పేచీ పెట్టుకోక మావాడిని వదిలేయ్—''

విజయ్ ముఖం కోపంతో ఎర్రబడింది దవడ ఎముక బిగుసుకున్నది

''మీరెవరైతే నాకెందుకు? సుకుమార్ మీ కుమారుడా?''

''ఆఁ. వాడు నా ఒక్కగానొక్క కొడుకు''

''అతను తప్పుచేస్తూ దొరికిపోయాడు రేపు కోర్టులో హాజరుపెట్టేంతవరకు విడుదల చేయము—''

''ఎట్టా! మమ్ముల్ని కోర్టుకూడా లాగుతావా? నీ యవ్వారం ఏం బాగాలేదు కుర్ర సన్నాసి తెలియక ఏదో గడ్డి కరవబోయాడు ఈసారికి వదిలేయ్—''

**జరిగిన కథ: — 6** విజయ్, మురళి కాశీకి పోతూ రైల్లో యాదృచ్ఛికంగా కలుసుకుంటారు. విజయ్ గడిచిపోయిన తన జీవితాన్ని సింహావలోకనం చేసుకోసాగాడు — విజయ్ పోలీసు ఇన్‌స్పెక్టరుగా ట్రయినింగ్ అవుతున్నాడు. మురళి ప్రయివేటు కంపెనీలో టైపిస్టుగా పని చేస్తూంటుంది మురళి మంచితనం చూచి ఆమెను ప్రేమిస్తాడు విజయ్ మురళితో తను ఆమె స్నేహాన్ని కాంక్షిస్తూన్నట్లు చెపుతాడు మురళి పిన్ని తన చిన్నాన్న కొడుకు పెళ్ళికి వెళ్ళేందుకు డబ్బు కావాలని మురళితో ఘర్షణ పడుతుంది. అందుకై మురళికి డబ్బు సహాయం చేస్తాడు విజయ్ ఇష్టపడితే ఆమెను వివాహం చేసుకుంటానంటాడు ఆమె తన నిర్ణయం తెలిపేందుకు కొంచెం టైమ్ కావాలని కోరుతుంది. విజయ్ ప్రేమను అంగీకరిస్తుంది మురళి శివశంకరం మురళిని తన ప్రియురాలు మీనాగా భ్రమ చెందుతాడు తన మనవడి కోరికపై రాజమణి మురళిని తన ఇంటి కోడలుగా చేసుకుంటానని మురళి పిన్నికి చెపుతుంది. కారణం చెప్పకుండా విజయ్‌ను దూరమవ్వమంటుంది మురళి పుష్కరాల్లో దొరికిన తనను పెంచి పెద్ద చేసిన వారి కోసం త్యాగం చేయాలనుకుంటుంది మురళి శివశంకర్‌కు బ్లడ్ కేన్సర్ అని తెలిసి దిమ్మెరపోతుంది ఈ విషయం ముందే తెలిసి ఉంటే విజయ్‌ను దూరం చేసుకునుండను కదా! అని వాపోతుంది శివశంకర్ మురళి సాహచర్యంలో ఉల్లాసంగా, ఆనందంగా ఉంటూంటాడు ఒకరోజు మురళి శివశంకర్ కోరికను తిరస్కరిస్తుంది అతను ఆమెను మురళీప్రియగా గుర్తిస్తాడు ఆమె ఆ విధంగా నాటకమాడుతున్నది తన డబ్బు కోసమే అని నిందిస్తాడు ఊహించని విధంగా అతను ఆమె మెడలో పసుపుతాడు కడతాడు మురళి మెడలో తాళికట్టిన మూడురోజులకే మరణిస్తాడు శివశంకర్ మురళి చెప్పిన కథ విని సానుభూతిగా చూసాడు విజయ్ ఆమె కోరగా తన కథను చెప్పసాగాడు — హోటల్ పంజులో జరిగిన పోలీసు రైడింగ్‌లో మానస, సుకుమార్‌లను అరెస్ట్ చేస్తాడు ఇన్‌స్పెక్టర్ విజయ్.

''లాభంలేదు. ముందు ఫోను పెట్టేయండి—'' చికాగ్గా అన్నాడు విజయ్

''ఏంటే వదలవా? నాతో పగ పెంచుకోకు సర్వనాశనమైపోతావు.''

''ఏం బెదిరిస్తున్నారా?''

''బెదిరించడంకాదు నా ప్రతాపం చేసి చూపిస్తాను''

''మీ ఇష్టం ఏం చేసుకుంటారో చేసుకోండి—'' విజయ్ విసురుగా ఫోను పెట్టేశాడు అతని మనసంతా అసహనంగా, చికాగ్గా వుంది అప్పలరాజు బెదిరింపు అతనిలో అశాంతిని, అసహ్యాన్ని కలిగించింది

విజయ్ ఆ నగరానికి ఓ వారం రోజుల క్రితం కొత్తగా వచ్చాడు వస్తూనే నగరంలో పెద్ద సంచలనాన్ని లేవదీసాడు బ్రాకెట్టు కంపెనీలపైన, క్లబ్బులపైన దాడిచేసి మూయించాడు సినిమా బ్లాకు టిక్కెట్లు అమ్మేవాళ్లను, జేబుదొంగల్ని వరసగా అరెస్టు చేసాడు దుర్మార్గుల పాలిట సింహస్వప్నమైపోయాడు అవినీతి గుండెల్లో ఆటంబాంబులు పేల్చాడు 'కొత్త ఇనస్పెక్టరు మంచి అసాధ్యుడు—' అని కొందరు ముందే జాగ్రత్త పడ్డారు. కొందరు లంచాలు ఇవ్వబోయి మరింత శిక్షకు లోనయ్యారు. విజయ్ రాకతో ఆ నగర వాతావరణమే మారిపోయింది. రోజూ ఎవర్నో ఒకర్ని అరెస్టు చేస్తూనే వున్నాడు ఇలా ఫోన్లో ఎవరో ఒకరు బెదిరిస్తూనే వున్నారు.

ఎవరి బెదిరింపులకు లొంగేవాడు కాదు విజయ్.

కానీ, తన కర్తవ్య నిర్వహణకు అడ్డు తగిలే వాళ్లను చూస్తే విపరీతమైన కోపం. జుగుప్స కలుగుతాయి ఈ రోజూ అంతే అయింది అప్పలరాజు బెదిరింపు ఆయన మూడ్ చెడగొట్టింది.

మరో పదినిమిషాల తరువాత మళ్లీ ఫోను మ్రోగింది.

అప్పలరాజేమోనని కోపంగా ఏదో అనబోయి ఆగిపోయాడు విజయ్ ఆ ఫోను మినిష్టరు గారి దగ్గర్నుంచి. ఫోనులో ఆయన ఆజ్ఞలు జారీ చేసాడు. విజయ్ ఏదో చెప్పబోతే ''నాకన్నీ తెలుసు నేను చెప్పినట్లు చేయడం మీ డ్యూటీ—'' అనేసరికి విజయ్ ముఖం మలినమయింది.

అరగంటసేపు విపరీతమైన సంఘర్షణకు గురయ్యాడు

చివరకు పరిస్థితులతో రాజీపడక తప్పలేదు. నిజానికి ఆడ — మగ కలిసి వ్యభిచారం చేస్తూ పట్టుబడితే శిక్ష ఒక్క ఆడదానికే వేయాలి అది చట్టం! కానీ సహజంగా ఇద్దర్నీ అరెస్టు చేస్తారు మగవాడి మీద మరో నేరం మోపి శిక్ష వేస్తారు అంతేగానీ వ్యభిచార నేరం క్రింద

పురుషుడ్ని శిక్షించే హక్కు పోలీసు డిపార్టు మెంటుకు లేదు.

వ్యభిచారం స్త్రీ పురుషు లిద్దరూ కలిసి చేసే తప్పు పని. మరి ఒక్క స్త్రీనే శిక్షించమని చట్టం చెబుతోంది. ఇదేమి న్యాయం ? ఇదేమి చట్టం ?

విజయ్ అప్పుడప్పుడూ చట్టంలోని ఇలాంటి లోపాలనుగురించి తీవ్రంగా ఆలోచనసాగిస్తాడు. ఉద్యోగి ధర్మము ప్రకారం తన ఆలోచనలు, సిద్ధాంతాలు ఒక్కోసారి పనికిరాకుండా పోతాయి. మంత్రిగారు స్వయంగా ఫోను చేసి సుకుమార్‌ను వదిలేయమని ఆజ్ఞ ఇచ్చాడు. కాదనే హక్కు



తనకు లేదు.

చివరకు సుకుమార్‌ని విడుదల చేయక తప్పలేదు.

కానీ అక్కడనుంచే విజయ్ సంఘర్షణ మరింత పెరిగింది.

'ఇదెక్కడిన్యాయం ? అతన్ని వదిలేసి నన్నింకా ఖైదు చేస్తావెందుకు ? —' అని ఆమె నిలవేసి అడుగుతున్నట్లు అనిపించింది విజయ్‌కు.

'అవును. ఇద్దరు కలిసి తప్పు చేసినప్పుడు — అతన్ని వదిలేసి ఆమెను నిర్బంధించడం ఏమి న్యాయం ? శిక్షించగలిగితే ఇద్దర్నీ శిక్షించాలి. వదిలేస్తే ఇద్దర్నీ వదిలేయాలి —' అని అనుకుని కానిస్టేబుల్‌ను పిలిచి ఆమెను విడుదల చేయమని చెప్పాడు

మానస భుజంచుట్టూ కొంగు పరుచుకుని వచ్చి నిలబడింది.

విజయ్ ఆమెను ఒక్క క్షణం ఆపాద మస్తకం పరిశీలనగా చూసాడు. 'ఈమె వళ్ళమ్ముకుని జీవిస్తోందా ? చూడ్డానికి సంసార స్త్రీలా, పొందికగా వున్నది. ఇదేంబుద్ధి ? —' తనకు తెలియని ఏదో అవ్యక్తమైన బాధ చెలరేగింది అతని మనసులో.

మానస సూటిగా అతని కళ్లలోకి చూళ్లేకపోతోంది.

"చదువుకున్నదానిలా కనిపిస్తున్నావు.

ఎందుకలాంటి పని చేసావు ?—'' అతని కంఠంలో ఒక రకమైన ఏవగింపు తొంగి చూసింది.

ఆ మాటలు మానస మనసును బలంగా తాకాయి. సూటిగా తలెత్తింది.

''మంచి ప్రశ్న వేశారు. మరొక ప్రశ్న వేసి వుంటే సమాధానం చెప్పడానికి మొహమాట పడేదాన్ని — '' పేలవంగా నవ్వింది మానస.

''అంత మొహమాట పడేదానివి ఈ వృత్తిలో ఎందుకు దిగావు ?''

''అసలు ఏ ఆడదయినా ఈ వృత్తిలోకి ఎందుకు దిగుతుందో మీకు తెలుసా ? వళ్లు బలిసి కాదు గతిలేక . మరో మార్గం లేక—''

''ఎంత గతిలేకపోయినా అభిమానం గల ఏ ఆడదీ ఇలా బరితెగించదు—'' విజయ్ ముఖం కఠినంగా మారిపోయింది

''అభిమానం అన్నది మనసుకు సంబంధించినది ఈ వృత్తిలో మనసుతో పనిలేదు ''

''షటప్ ! చేసింది చాలక పైగా సిగ్గులేకుండా సమర్ధించుకుంటున్నావా ? నీలాంటి ఆడవాళ్లు వుండబట్టే స్త్రీ జాతి పరువు బజారు కెక్కుతోంది —'' కోపోద్రేకంతో అతని వదనం ఎర్రగా కందింది

మానస రోషంగా చూసింది

''సిగ్గుపడాల్సిన పని నేనేం చేయలేదు అసలు నేను తప్పు చేయడం మీరు కళ్లారా చూసారా ?''

''పట్టిగ్గా దొరికిపోయారు, ఇంకా ఏం చూడాలి ?''

''పొరపాటు ఇన్స్పెక్టరుగ్గారూ ! నిజానికి మేము అక్కడికి తప్పు చేయడానికే వెళ్లాము కానీ, తప్పు చేయకుండానే దొరికి పోయాము కళ్లతో చూసేదంతా యదార్ధం కాదు దోషిలా మీముందు ఎందుకు తల దించుకుంటున్నానో తెలుసా ? నాకూ ఓ మనసుంది కాబట్టే ''

విజయ్ వ్యంగ్యంగా నవ్వాడు

''మీలాంటి వాళ్లక్కూడా మనసులుంటాయా ?''

''మాలాంటి వాళ్లకు మనసులున్నాయో



లేదో తెలుసుకోవాలంటే ఎదుటి వారికి మనసుండాలి పశువులకు మృగప్రాయులకు మేమెలా అర్ధమవుతాము ? వాళ్ల దృష్టిలో మేము విలాస వస్తువులం. చలి బొమ్మలం !

వాళ్లకు కావల్సింది డబ్బుతో కొనుక్కుంటున్నారు. మాకు కావల్సిన డబ్బుకోసం మానాభిమానాలు అమ్ముకుంటున్నాము. ఈ సమాజంలో ఎంతోమంది పెద్ద మనుషులుగా చెలామణి అవుతూ, తెర వెనుక చేసే నీచకృత్యాలు కన్నా చండాలమైన పనులేమీ మేము చేయడంలేదు. అందాన్ని చూపించి అమ్ముడుపోతున్నాము. ఇందులో మోసంలేదు దగాలేదు. ఇది తప్పని మీరంటే— మా అందాలకు వెలకట్టే వెధవలంతా తప్పుడు గాళ్లే !

అలాంటి వెధవలు నూటికి తొంభై మంది వున్నారీసమాజంలో !

మరి మేము ? నూటికి పదిమందికన్నా ఎక్కువ వుండము.

ఇప్పుడు చెప్పండి

తొంభై మంది తప్పుడు వెధవలున్న ఈ సమాజంలో మాలాంటి శాపగ్రస్తులు పదిమంది వుండడం తప్పా ? మీరంతగా సంస్కరించ దలుచుకుంటే ముందుగా ఆ వెధవల్ని సంస్కరించండి అప్పుడు స్త్రీజాతి గౌరవాలు నిలుస్తాయి అప్పుడే మాలాంటి వాళ్లు క్షమింప బడతారు '' మానస కనుకొనుకుల్లో నీళ్లు దుముకబోతున్నాయి. బలవంతాన అణుచుకుంది

ఆమె మాటలకు విజయ్ విస్తుబోయాడు.

మళ్లీ మానస అన్నది వెంటనే ''నేను మాట్లాడిన మాటల్లో తప్పుందనుకోవడంలేదు ఒకవేళ మీ మనసును నొప్పించి వుంటే క్షమించండి. 'నీవు చెడిపోయావు—' అని ఓ ఆడదాన్ని వేలెత్తి చూపడం తేలికే ! కానీ నీ వెందుకు చెడిపోయావు ? నీవిలా ఎందుకు మారావు? అని అడిగి సానుభూతి చూపగల సంస్కారులు చాలా అరుదుగా కనిపిస్తారు

ఒక ఆడది చెడిపోయిందంటే అందుకు ఓ మగవాడు బాధ్యుడు.

కానీ, నేను ఆ కోవకు చెందినదాన్ని కాదు నన్నెవరూ చెడగొట్టలేదు నేనే చెడిపోయాను కారణం ! నేనో దౌర్భాగ్యురాల్ని అదృష్టహీనను—'' అంతే! మానస దుఃఖానికి ఆనకట్ట వేయలేకపోయింది. గిరుక్కున వెనుదిరిగి అక్కడ నుంచి వడివడిగా వెళ్లిపోయింది

విజయ్ దిగ్భ్రాంతిగా ఆమె వెళ్లిన దిక్కే చూస్తూ వుండిపోయాడు ఓ అయిదు నిమిషాల తరువాతగానీ మామూలుమనిషి కాలేకపోయాడు ఆ రోజంతా ఆమె మాటలు అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

'మాలాంటి వాళ్లకు మనసుందో లేదో తెలుసుకోవాలంటే ఎదుటివారికి మనసుండాలి పశుప్రాయులకు, మృగాలకు మేమెలా అర్ధమవుతాము ?—' ఆ మాటలు విజయ్ని అమితంగా బాధించి కదిలించాయి

## 14

''మానసా ! మానసా ! అరె ఇదేమిటమ్మా నీవింకా తయారు కాలేదా?'' గోడకు చేరగిలబడి దిగులుగా శూన్యంలోకి చూస్తున్న కూతుర్ని చూసి కంగారు పడిపోయాడు ఉమాపతి

మానస తలెత్తి తండ్రివంక చూసింది.

ఆ చూపుల్లో శతకోటి భావాలు ! ఆ ఇంట్లో ఎవరికీ అర్ధంగాని భావాలు ఆ కళ్లలో అతనొక్కడే చూడగలడు కాని చూడనట్లు, అర్ధంగానట్లు నటిస్తాడు

కారణం ? అతనొక మధ్యతరగతి మనిషి. ఇలాంటి మనుషులు ఎంతటి కఠినమైన సత్యాలనైనా ఇట్టే మింగేస్తారు పరిస్థితులతో రాజీ పడడం వీరికి వెన్నతో పెట్టిన విద్య

''ఎందుకమ్మా దిగాలుగా వున్నావు ? వద్దు తల్లీ ! నీవిలావుంటే ఈ ఇంటికి కళ వుండదు మేమందరం నవ్వుతూ వుండాలంటే నీ ముఖంలో నవ్వులుపూయాలి. లే. . లే . నీవలాచూడకు, నేను భరించలేను.. ''అని ఎవరో












తరుముతున్నట్లు చప్పున అక్కడనుంచి వెళ్ళి పోయాడు ఉమాపతి.

'పిచ్చినాన్న! నిన్ను చూసి ఏడ్వాలో నవ్వాలో తెలీదు.' అని నీరసంగా నవ్వుకున్నది మానస. నెమ్మదిగా లేచి పదినిమిషాల్లో బయటకువచ్చింది మానస.

వాకిట్లో రిక్షా సిద్ధంగా వుంది.

ఉమాపతి బయట రోడ్డుమీద వెళ్ళి నిలు చున్నాడు కూతురుకోసం ఎదురుచూస్తూ.

మానస వెళ్లబోయినదల్లా తల్లి పిలుపుతో ఆగిపోయింది

"చీకటి పడకముందే వచ్చేయ్ తల్లీ ! అసలే రో జు లు బా గా లే దు–" అని అన్నది తల్లి మీరాబాయి.

నవ్వింది మానస ! గుండెలోంచి నవ్వుతో పాటు కన్నీళ్లు కూడా తన్నుకొచ్చాయి. తమా యించుకుని తలూపింది. అడుగు ముందుకు పడ లేదు వెంటనే 'తను ఎక్కడకి వెళుతుందో అమ్మకుతెలిస్తే ? – ' అన్న ఆలోచన మానస మనసును పిండింది.

"మానసా ! త్వరగా రా... టైమవు తోంది–" బయటనుంచి తండ్రి పిలుపు.

దీర్ఘంగా నిట్టూరుస్తూ ముందుకు నడి చింది మానస. రిక్షా ఎక్కించి "జాగ్రత్త తల్లీ. నేను చెప్పినవి గుర్తున్నాయిగా ? " అని ఆగి "నాకు తెలుసు నీవు పని సాధించుకువస్తావు–" అని అక్కడ నిలబడకుండా ఇంట్లోకి వెళ్ళి పోయాడు ఉమాపతి

ఆ క్షణంలో మానసకు గుండెలు పగిలేలా ఏడ్వాలనిపించింది ఏడ్వురాలేదు గానీ ఓవిచిత్రమైన నవ్వు ఆమె పెదవులపైన కదలి మాయమయింది

రాత్రి పదకొండు గంటల సమయం ! నగరంలో ఆ సమయంనుంచి ఎవరూ సంచారం చేయకూడదు అది కొత్తగా విజయ్ ఏర్పరచిన రూల్ అందు వలన రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయి ఆ సమయంలో విజయ్ మోటర్ బైక్‌మీద నాలుగురోడ్లూ చుట్టి వస్తాడు పొర పాటున ఎవరైనా ఎదురైతే, అనుమానంగానీ కలిగితే యక్షప్రశ్నలు వేసి లక్ష ఆరాలు తీస్తాడు. అందువలన జనం పదిగంటలకే తమ తమ పనుల్ని ముగించుకుని ఇళ్లకు చేరుకుంటున్నారు. సెకండ్ షో వదిలాక రోడ్లమీద నరసంచారం కనిపించదు.

విజయ్ అలవాటుప్రకారం మోటర్ బైక్ మీద మెయిన్ రోడ్డుమీద పోతున్నాడు. ఇంతలో ఒక చీకటి సందులోంచి ఓ స్త్రీ ఆర్తనాదం వినిపించింది. విజయ్‌చటుక్కున బైకును ఆ సందులోకి ఫోకస్‌చేస్తూ పోనిచ్చాడు సందు చివర్లో నలుగురు వ్యక్తులు పరారీ అవుతూ కనిపించారు. విజయ్ ఆలస్యంచేయకుండా బైకును ముందుకు దూర్కించాడు కానీ, వాళ్లు అప్పటికే తప్పించుకుని వెళ్లిపోయారు.

ఇక అక్కడ మిగిలింది ఒక యువతి ! ఆ యువతిని గుర్తించి అతని కనుబొమలు ముడి వడ్డాయి. 'ఈమె... ఈ వేళప్పుడు ఇక్కడేం చేస్తోంది ? – '

మానస సిగ్గుతో, పరితాపంతో కలదించేసు కుంది.

"ఇక్కడేం చేస్తున్నావు ? ఆ పారిపోయిన వాళ్లెవరు ? – " నిశబ్దాన్ని చీల్చుకుని ఖంగు మన్నది అతని గొంతుక ఆమె గుండెలు వడి వడిగా కొట్టుకున్నాయి. రౌడీలబారినుండి తనను రక్షించినా, ఆ సమయంలో అతని కంటబడడం ఆమెకు తల తీసేసినట్టుగా వుంది జవాబు చెప్పడానికి పెదవులు సహకరించడం లేదు.

"మాట్లాడవేం ? ఆడపిల్లవు. . ఇంత రాత్రివేళ ఇల్లువదలి ఎందుకు వచ్చావు ? వృత్తి కోసమా ? ఎంత వృత్తి అయితే మాత్రం వేళా పాళా లేదూ ?"

ఆ మాటలకు ఆమె హృదయం సిగ్గుతో చచ్చింది.

"క్షమించండి ఇంకెప్పుడూ రాను – " అర్థింపుగా, మెల్లగా అన్నది మానస అతను రెండు క్షణాలాగి "పద మీ ఇంటిదగ్గర వదలు తాను– " అన్నాడు.

మానస మరేం అన్లేదు అతని బైకు నెమ్మదిగా పోతుంటే ప్రక్కనే కుచించుకు పోయినట్లు నడవసాగింది. అలాంటి పరిస్థితిలో ఇ రు క్కు పో యి న ం దు కు తనను తాను తిట్టుకున్నది. తమ్ముడికి ఉద్యోగం వేయించమని పంపిన తండ్రిని తిట్టుకున్నది. ఉద్యోగం ఇస్తానని ఇంతసేపూ వేధించి, తన శరీరంతో ఆడుకున్న ఆఫీసర్ని తిట్టుకున్నది. ఆఫీసరు గెస్ట్‌హౌసు నుంచి తిన్నగా రిక్షాలో ఇంటికెళ్దా మంటే సమయానికి రిక్షాలు లేవు. అంచేత రిక్షావాళ్లను తిట్టుకుంది .. తనను పరాభవించ బోయి పారిపోయిన రౌడీలను తిట్టుకుంది.

'భగవంతుడా ! నా ఈ పరిస్థితి ఏ ఆడదానికీ రాకూడదు – ' అని లోలోన దుఃఖిం చింది.

విజయ్ ఆలోచనలు మరో విధంగావున్నాయి.

## 15

"ఆడపుటక పుట్టాక కాస్త సిగ్గూ లజ్జా వుండాలి. అవ్వ! ఇంత రాత్రిదాకా ఆడపిల్ల ఊరుమీదపడి తిరిగితే ఇక దీనికి పెళ్లెలా అవుతుంది ? నలుగురికీ తెలిస్తే ఇంతకన్నా అప్రదిష్ట ఏంకావాలి ? అయినా దాన్నని ప్రయోజనం ఏమిటి ? కూతుర్ని అదుపాజ్ఞల్లో పెట్టలేని నిన్ను దుమ్మెత్తిపోయాలిరా – " అని తన అక్కసును వెళ్లగక్కింది నాంచారమ్మ.

ఉమాపతి అసహనంగా తల్లిని మంద లించాడు.

"ఎందుకే ఊరికే గొంతు చించుకుంటావు ? ఇప్పుడది కాని పనేంచేసింది ? ఆఫీసులో కాస్త పని ఎక్కువై ఆలస్యంగా వచ్చింది. ఇంతలోనే కొంపలంటుకుపోయినట్లు ఏమిటా అరుపులు ? అయినా నీకెందుకీ ఆరాలన్నీ – వేళకింత తిని మూలన పడివుండు ఊరకే సణగకు . " అని విసుక్కున్నాడు

అయినా నాంచారమ్మ నోరు మూతబడ లేదు తల్లి ఒకరు చెబితే వినేరకం కాదని, ఆమె ధోరణి ఎరుగున్నవాడు గనుక, మరేం అన్లేక ఇవతలకు వచ్చాడు ఉమాపతి.






తన గదిలో పడుకుని వున్న మానసకు ఆ మాటలన్నీ వినిపిస్తూనేవున్నాయి.

"అత్తగారు అనడం గాదుగానీ, మానస వరసేం బాగాలేదండీ ... వేళాపాళా లేకుండా ఈ తిరుగుళ్లేమిటి? —" భర్త గదిలోకి రాగానే మెల్లగా అన్నది మీరాబాయి.

"ఉద్యోగం చేసేవాళ్లకు ఎన్నో పనులుంటాయి. అయినదానికీ కానిదానికీ ఇలా బాధపడుతూ కూర్చుంటే మన బ్రతుకులు దొర్లవు. ఇక ఊరుకో ... అమ్మాయి వింటే బాధపడుతుంది —" అని సర్దిచెప్పాడు ఉమాపతి.

మానస కళ్లు చెమ్మగిల్లాయి.

ఆ ఇంట్లో నాయనమ్మదో రకం మనస్తత్వం. ఆవిడ పాతకాలం మనిషి కావడంతో ఆమె ఆలోచనా విధానం ఎవరికీ నచ్చదు. ఇక తల్లి అచ్చమైన ఆడది! ఆడవాళ్లకుండే భయాలు — అనుమానాలు ఆమెకున్నాయి. తండ్రి సరేసరి! పరిస్థితులకు రాజీపడిపోయే సగటు మనిషి.

నిరుద్యోగి అయిన తమ్ముడు భాస్కర్, టెన్త్ తప్పి ఇంట్లో వుండిపోయిన చెల్లెలు రాధిక, మశూచితో రెండు కళ్లూ పోగొట్టుకుని అంధకారంతో అలమటిస్తున్న చిన్న తమ్ముడు ఆనంద్. ఇందరి ఆశల పట్టుగొమ్మ మానస! ఏనాడూ ఎవర్నీ నొప్పించిగానీ, ఎదిరించి మాట్లాడంగానీ చేయలేదు. ముఖ్యంగా తండ్రి మీద విపరీతమైన సానుభూతివుంది. అందుకే ఆయన మాట కాదన్లేదు ...

సుదీర్ఘమైన ఆలోచనలతో ఆ రాత్రి మానసకు సరిగ్గా నిద్ర పట్టలేదు.

ఉదయం పెరట్లో ముఖం కడుక్కుంటుండగా తమ్ముడు భాస్కర్ వచ్చాడక్కడికి.

"అక్కా! నా ఉద్యోగ విషయం రాజగారేమన్నారు? ఆయన నీకు బాగా తెలుసటగా, నీ మాట విన్నారా? నాకు ఉద్యోగం వేయిస్తారా?" ఆశగా అడిగాడు భాస్కర్.

"ఆఁ ... తప్పకుండా ఇస్తానన్నారు. ఓసారి నీ సర్టిఫికెట్లు తీసికెళ్లి ఆయన్ని కలిసిరా."

ఆ మాటలకు భాస్కర్ వదనంలో కొత్త కాంతులు విరిశాయి. ఆరిపోతున్న ఆశాజ్యోతి గుప్పున వెలిగింది. ఇక ఈ జీవితకాలంలో వుద్యోగం రాదనుకున్న భాస్కర్‌కు ధైర్యం కలిగింది. "అలాగే అక్కా! రాజుగారు ఆ మాత్రం భరోసా ఇచ్చారంటే తప్పకుండా సాయం చేస్తారు. చాలా థ్యాంక్స్ అక్కా ... నీ మేలు మర్చిపోలేను ..." అత్యంత సంతోషంగా అన్నాడు. ఎందుకో మానసకు సిగ్గు కలిగినట్లయింది.

* * *

## బొమ్మలపై నిషేధం !

చిన్నపిల్లల్లో హింసా ప్రవృత్తిని, యుద్ధాలపై ఆసక్తిని కలిగించే ఆట బొమ్మలను నిషేధించాలని పశ్చిమజర్మనీలో వినిమయదార్ల సంఘం కోరింది వీటితో ఆడే ఆటల్లో ఓటమి, నాశనం ఉంటూయని వారు పేర్కొన్నారు బొమ్మ తుపాకుల వలన యుద్ధాల పట్ల అనవసర కుతూహలం పెరుగుతుందనివారు అన్నారు. అయితే ఆ ప్రభుత్వ ఆర్థిక శాఖకు చెందిన సెనేటరు ఒకరు వీరి కోరికను తిరస్కరించారు. స్వేచ్ఛా సమాజంలో హింస, అహింసలను బోధించటం తలిదండ్రుల బాధ్యత అని ఆయన అన్నారు. వీడియో చిత్రాలలో మాత్రం హింసాత్మక ధోరణులను అరికట్టాలని ఆ ప్రభుత్వం వీడియో తయారీ దార్లను కోరింది.

"మానసా ! ఈ రోజు రెండో తారీఖు " అని గుర్తు చేసింది మీరాబాయి.

"ఎందుకమ్మా ?" మామూలుగా అడిగింది మానస

"ఎందుకేమిటి ? నిన్న జీతాలు ఇచ్చి వుంటారు కదా, ఇంట్లో సరుకులన్నీ నిండుకున్నాయి. పాలవాడు నిన్ననే గొడవ చేశాడు. ఇంటాయన నాలుగు రోజుల నుంచే తిరుగుతున్నాడు, పోయిన నెలలో కూడా ఇవ్వనందున.."

పరిస్థితి అర్థమయింది మానసకు. సమాధానం చెప్పడానికి తన వద్ద సమాధానం లేదు. ఆ చెప్పే సమాధానంతో సమస్యలు తీరవు. చేతల్లో చూపించాలి. తను ఉద్యోగం చేస్తుందని, నెల తిరిగేసరికల్లా డబ్బు ఠంచనుగా వస్తుందని తల్లి భావన. ఇన్నాళ్లూ మానస కూడా అలాగే నమ్మిస్తూ వస్తుంది. ప్రతి నెలా తన సంపాదన తల్లి చేతిల్లో పెడుతుంది. అంచేత మామూలుగా జీతం సంగతి, ఇంటి సమస్యలను గుర్తుచేసింది మీరాబాయి.

మానస మరేం మాట్లాడలేదు. హాల్లో కూర్చున్న తండ్రి దగ్గరకు వెళ్ళింది.

"ఇంట్లో సరుకులు తేవాలి నాన్నా –" మెల్లగా అన్నది.

"అవునమ్మా నేనే నీకు చెబుతామనుకున్నాను."

ఎందుకో మానస హృదయం కలుక్కుమన్నది.

ఇంట్లోకి సరుకులు రావాలంటే తాను గడప దాటాలి. తను గడప దాటితేగానీ డబ్బు రాదు ఆ డబ్బు లేకపోతే బండి నడవదు. ఇంటిల్లిపాదికి తనొక్కతే ఆధారం పరిస్థితుల్ని అర్థం చేసుకుని గడప దాటడానికి తనకు తాను సిద్ధపడినపుడు మానస అంతగా బాధపడదు కానీ; ఆ మాట తండ్రి చెప్పినపుడే చాలా బాధ కలుగుతుంది.

అలా చెప్పడం ఆయనకూ చిన్నతనంగా, సిగ్గుగానే వుంటుంది. కానీ కూతురు గడప దాటనిదే ఇల్లు గడవదని తెలుసు అందుకే సిగ్గు విడిచి చెబుతుంటాడు. ముందు బాధ కలిగినా తండ్రి అసమర్థతను అర్థం చేసుకుని తల వంచేస్తుంది మానస.

"చెప్పు నాన్నా ఎక్కడికి వెళ్లమంటావో.." ఎటో చూస్తూ అడిగింది.

ఉమాపతి రెండు క్షణాలు తటపటాయించి, అటు ఇటు చూసి, ఎవరూ వినడంలేదని నిర్ధారణ చేసుకొని మెల్లని స్వరంతో ఏదో చెప్పాడు. చెప్పి కూతురు ముఖంలోకి చూసే ధైర్యం లేక తల దించేసుకున్నాడు.

మానస బరువెక్కిన హృదయంతో భారంగా కదిలింది.

*　　*　　*

విజయ్ మోటార్‌బైక్ శబ్దం వింటూనే, పేవ్‌మెంటుమీద చిల్లర వ్యాపారాలు చేసే వాళ్ల గుండెలు జల్లుమన్నాయి. పొంగడాలు, దోసెలు పోసే అవ్వ– బొగ్గుల పొయ్యి జంగిడి, అక్కడే వదిలేసి ఎదురు సందులోకి పారిపోయింది. చిలక జోస్యం చెప్పే అతను తన సరంజామా ఎత్తుకొని కాలి సత్తువ కొద్దీ పరుగుతీసాడు. మిఠాయి బండ్లు, పళ్లబండ్లు వాళ్లు తమ తమ బళ్లను ప్రక్క సందుల్లోకి గొందుల్లోకి త్రిప్పుకోసాగేరు. ఇంతలో విజయ్ రానే వచ్చాడు. అతని కళ్లలో పళ్లబండి పడనేపడింది అంతే! విసురుగా మోటార్‌బైక్‌తో బండిని గుద్దేశాడు

బండ్లలోని పళ్లన్నీ చెల్లాచెదురై, ప్రక్కనున్న మురుగు కాలువలోను, పేవ్‌మెంటుమీద పడిపోయాయి కొన్ని నజ్జు నజ్జుగా చితికిపోయాయి.

బండివాడు బిక్క చచ్చిపోయి గబ గబా క్రింద పడిన పళ్లను ఏరుకోబోయాడు. విజయ్ బైక్‌ను స్టాండ్ చేసి, బండివాడి చొక్కా పట్టుకున్నాడు.

"రాస్కెల్ ! నీకు రోజూ చెబుతూనే వున్నాను, ఇక్కడ బండి పెట్టవద్దని. ఇది నడిబజారునుకున్నావా, లేక నీ ఇల్లనుకున్నావా?" అని ఫెడీలుమని చెంప పగులగొట్టాడు.

బండివాడు వణికిపోతూ "సార్... తప్పయిపోయింది.. ఇంకెప్పుడూ పెట్టను. ఈసారికి వదిలేయండి ... పేదవాణ్ణి ..." అంటూ ఇనస్పెక్టర్ కాళ్లకు చుట్టుకుపోయాడు.

విజయ్ విసురుగా అతన్ని విదిల్చి "ముందా





# ధర్మపథం

బులుసు వేంకటరమణయ్య

## అసంతృప్తి

మానవుని సుఖజీవనానికి సృష్టిలోని పదార్థాలన్నీ ఉపయోగ పడుతున్నవి. ప్రాణికి మిక్కిలి బాధ కలిగించేవీ, ప్రాణాపాయకరాలైనవీ కూడా కొన్ని సమయాల్లో మనకు ఎక్కువ ఉపయోగపడేవే! ఇలా ఉన్నా కూడా వానిని సరిగా ఉపయోగించుకోలేనప్పుడు అసంతృప్తి కలుగుతుంది.

అందరి మనస్తత్వాలూ ఒక్కమాదిరిగా ఉండవు. వేర్వేరు రీతుల్లో ఉంటాయి. ఆలోచనలూ విభిన్నంగానే ఉంటాయి. పెక్కు మతాలు ఏర్పడడానికి ఈ అనైక్యత కారణం. అలాగే కార్యకలాపాలలోనూ అభిప్రాయభేదాలు కానవస్తాయి. వీని మూలంగా మత విద్వేషాలు, జాత్యభిమానాలు, ప్రాంతీయ దురభిమానాలు విజృంభించి, కొట్లాటలకు, హత్యలకు కూడా దారి తీస్తున్నవి. ఒక మతంలోనే అంతర్భేదాల మూలంగా పరస్పర విరోధాలు ఏర్పడుతూ ఉంటాయి. ఇతర రాష్ట్రాల లోని కొన్నిభాగాలు తమ రాష్ట్రంలో చేరాలనీ, నదీజలాలలో తమకు ఎక్కువ వంతు కావాలనీ—ఈ విధమైన తగాదాలు తరచు తలయెత్తుతునే ఉన్నాయి. ఇతర ప్రాంతీయులు తమ రాష్ట్రాలలో నివాసం కల్పించుకోకూడదనీ, వారిని పంపి వెయ్యాలనీ కొందరి పట్టుదల.

సర్వమత సహనంకోసం, జాతి విభేదం నశించడానికోసం, సర్వమానవ సోదరభావం కోసం ప్రభుత్వం ప్రబోధం చేస్తూనే ఉన్నది. ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నవి. కాని తగిన ఫలం మాత్రం కనబడలేదు. తాత్కాలికంగా కొన్ని విషయాల్లో ఫలితం కానవచ్చినా, అది కొంతకాలం మాత్రమే !

అయితే వీటన్నిటికీ ప్రధాన కారణం అసంతృప్తి అని గ్రహించాలి మానవునికి అసంతృప్తి లేకుండా ఉంటే—జీవితం సుఖంగా సాగిపోతూ ఉంటే – మతాలు గాని, జాతులు గాని అడ్డురావు. విద్వేషాలు వాటంతట అవే అణగిపోతాయి. అందువల్ల మొదట కావలసినది మానవుని సుఖజీవనానికి తగిన సదుపాయాల ఏర్పాటు. అది సక్రమంగా సాగితే అసంతృప్తి నశిస్తుంది. తగాదాలకు అవకాశం వుండదు. ★

---

బండిని అవతలకు తీయ్. మరోసారి రోడ్డుమీద బండితో కనిపించావా ప్రాణం తీస్తాను—'' అని హుంకరించాడు.

గోడవారగా ముసలమ్మ పొంగడాల పొయ్యి, పెణ్ణాన్ని చూసాడు. అతని ముఖం కఠినంగా మారింది. ఏ మాత్రం జాలిలేకుండా అక్కడ కెళ్లి బూటుకాలితో పెణ్ణాన్ని పొయ్యిని తన్ని, మంటను ఆర్పేశాడు.

ఆ దృశ్యాన్ని చూస్తున్న షాపుల వాళ్లు, అంగళ్లముందు, హోటల్ ముందు నిలబడ్డ వాళ్లు అవాక్కైపోయారు. ఆ తరువాత విజయ్ మామూలుగా తన బైక్‌మీద వెళ్లిపోయాడు.

అతను వెళ్లేంత వరకు ఎవరూ రోడ్డు మీదకు రాలేదు వాన కురిసి వెలిసినట్టుగా వున్నది. అతను చేసిన పనిని జనం రకరకాలుగా వ్యాఖ్యానించసాగేరు.

''ఇతను వచ్చాక ఊరు సగం బాగుపడింది. అందర్నీ గడగడలాడించేస్తున్నాడు —''

''ఎంత డ్యూటీ అయితేమాత్రం బీదా బిక్కిని ఇలా దండుకు తింటాడా ? పాపం

## మానవ మురళి

ఆ బండివాడి పళ్లన్నీ పాడైపోయాయి.'' అని ఒకతను సానుభూతి గుమ్మరించేడు.

''అలా దౌర్జన్యం చేయకపోతే వీళ్లు మాత్రం మాట వింటారటయ్యా ? లేకుంటే ఇది రద్దీగా వుండే సెంటర్. ఇక్కడ బండ్లు పెట్టి వ్యాపారాలు సాగిస్తే జనానికి ఎంత ఇబ్బందో చూడు... మంచిగా చెబితే విన్లేదు కాబట్టే దౌర్జన్యానికి దిగాడు. ఇక రేపటి నుంచి ఇక్కడ ఏ బండ్లూ కనిపించవు చూడు —''

ఇలా ఎవరికి తోచిన రీతిగా వాళ్లు వ్యాఖ్యానించసాగేరు :

ఆ రోజు సాయంత్రమే మరో సంఘటన జరిగింది. ఓవర్‌లోడు ఎక్కిస్తున్న సిటీబస్సును ఆపి తగిన చర్య తీసుకున్నాడు విజయ్. డ్రైవర్ని, కండెక్టర్‌ను వార్నింగ్ ఇచ్చి వదిలేసాడు. ఎక్కడ అన్యాయం జరిగితే అక్కడ విజయ్ ప్రత్యక్షమవుతున్నాడు.

అతన్ని అడ్డగించలేకపోతున్నారు. విజయ్ లోని ధైర్య సాహసాలకు, నిజాయితీకి, కఠినత్వానికి భయపడి ఎవరూ అతని జోలికి రావడంలేదు.

డ్యూటీలో వున్నప్పుడు అతను చాలా కఠినంగా వుంటాడు. మిన్ను విరిగి మీదపడినా చలించనట్లు వుంటాడు. థియేటర్ యజమాన్లకు, లారీ, సిటీబస్సు ఓనర్లకు విజయ్ గొంతులో గుండుసూదిలా అడ్డుపడుతున్నాడు.

కొందరతన్ని ఆ ఊరునుంచి బదిలీ చేయించాలని ప్రయత్నాలుకూడా చేసారు. ఏ కొద్ది మంది స్వార్థపరులకుతప్ప విజయ్ నిజాయితీ, కార్యదీక్షత చాలామందిని ఆకర్షించాయి. ముఖ్యంగా స్టూడెంట్స్ అతన్ని విపరీతంగా లైక్ చేస్తూ ప్రోత్సాహిస్తున్నారు. కొందరు ఎదురుగావచ్చి అభినందనలు తెలుపుతున్నారు. కొందరు చాటుగా తిట్టిపోసుకుంటున్నారు. దూషణ, భూషణలను సమంగా తీసుకుంటూ, తనధర్మకోసం, ప్రజల రక్షణకోసం నిరంతరం శ్రమిస్తున్నాడు ఇనస్పెక్టర్ విజయ్.

(ఇంకా వుంది)

# జీవిత రహస్యం

శాతకర్ణి



"మా(వా నాకు మంచి సీర కొనిపెట్టు" గోముగా అడిగింది చం(దమ్మ భర్త నరసింహాన్ని.

చం(దమ్మ క్యారేజీలు మోస్తుంది. అంట్లు గూడా తోముతుంది. నరసింహం రిక్షా లాగుతాడు.

చం(దమ్మకు నరసింహం (ప్రాణం. చూడ ముచ్చటైన అన్యోన్యదాంపత్యం గడుపుతున్న జంట.

"యేందీ సం(ది కొత్తగా అడగతున్నావు నాకాడ డబ్బులేదయ్యే. రెక్కాడితే డొక్కాడని బతుకులే మనయ్యి గొప్పోల్లా మనం జనమ ఎత్తనేదే. కావాలిత్తే మల్లిపూలు తెత్తాను. ఎరుకలమ్మ కొట్లో పకోడీలట్టుకొత్తాను. యిలాంటివేవో కోరాలి మన తావతుకు తగ్గట్టు గాని, సినిమాటూరులా సీరలు కావాల, నగలు కావాలంతే మరి నాను రిచ్చా తొక్కడం మానెయ్యాల. మరంతే నీవాలోసించుకో" నరసింహం మందలించాడు చం(దమ్మను

చిన్నబుచ్చుకుని చిరబురలాడలేదు పెద్దింటి గృహిణిలా ఉండడానికి భవంతి లేదు కాబట్టి అలకపాన్పు ఎక్కలేదు, జుట్టు విరగబోసుకుని గుడిలో అమ్మవారిలా భయంకరంగా తయారవలేదు. చం(దమ్మకు తెలుసు నరసింహం పెద్ద మనసు. ఆ మనస్సులో చోటెంత వుందో కూడా తెలుసు. అవుసరం వస్తే నరసింహం (ప్రాణం అర్పిస్తాడని చం(దమ్మకు గట్టినమ్మకం.

కస్సు బుస్సుమని పాములా చ(రువలేవకుండా నరసింహం (ప్రక్కనే వొదిగి కూర్చొన్నది. చం(దమ్మ దరిచేరి పొందికగా కూర్చొంటే సినిమాలో హీరో హీరోయిన్లు డ్యూయెట్టుసాంగ్ పాడుకొన్నంత అనుభూతి పొంది (ప్రపంచాన్నే మరిచిపోతాడు నరసింహం. మంచు కరిగి నీరైనట్లు కరిగి చం(దమ్మ పాదాలముందు మోకరిల్లుతాడు.

"మావా నీకాడ డబ్బునేకపోతే మానియ్యి గాని నీవు బాదపడితే నాకు కట్టమనిపిత్తాది" చం(దమ్మ బాధపడుతూ అంది.

"యేవో సం(ది నీవు బాధపడితే నాను సూడ్లేనే. ఎలాగోనాగ నాను తెత్తాను. అన్నట్టు మరిసిపోనాను ఒలే సం(ది రిచ్చా యియ్యాళ జెండాపెట్టుకాడ కట్టుకొత్తా క్యారేజీలట్టుకొని అక్కడే నిలబడు వత్తామరి" చం(దమ్మను ముద్దు పెట్టుకొని సంతోష తరంగాలలో ఓలలాడుతు వెళ్లిపోతున్న నరసింహం వైపు (పేమగా చూస్తుండిపోయింది చం(దమ్మ.

*　*　*

విశాలి భర్త విశ్వ(ప్రసాద్. చం(దమ్మ విశాలి ఇంట్లో పనిమనిషే కాకుండా విశ్వ(ప్రసాద్‌కు క్యారేజీకూడా తీసుకుని వెళ్తుంది.

అంట్లు తోమేందుకు పా(తలు ముందు వేసింది విశాలి

"చం(ది, వేగంగా కడిగిపెట్టు అయ్యగారీవేళ ఆఫీసుకు వేగంగా వెళ్లాలట"

"చం(ది చాలా చురుకైన మనిషిలే" పల్లికిలిస్తూ మధ్యలో కలుగజేసుకున్నాడు విశ్వ(ప్రసాద్.

విశ్వ(ప్రసాదును చూస్తే చం(దికీ ద్వేషం ఆకలి చూపులు చూస్తాడని తప్పించుకు తిరుగుతుంది. విశ్వ(ప్రసాదును చూచి తలొంచుకుని తనపని చేసుకుంటున్నది.

"చం(దిలాంటి నిజాయితీగల మనుష్యులు లోకంలో చాల అరుదు. ఎప్పుడైనా పా(తల్ను ఎత్తుకుపోవడంగాని, కావాలని చితగగొట్టడం గాని చూసామా ?" చం(ది ఫేవర్ సంపాదించాలని తైరుకొట్టాడు.

పుల్లవిరుపుగా నవ్వింది చం(ది. విశ్వ(ప్రసాద్ అదే మహా(ప్రసాదంలా భావించాడు. విశ్వ(ప్రసాద్ గూర్చి నరసింహంతో చేస్తే మక్కెలు విరగ్గొట్టేస్తాడు. పనిపోతుంది. పెద్దింటోళ్లు చిలవలు పలువలు కూర్చి పక్కింటోళ్లతో

చెప్తారు. దాంతో చుట్టు ప్రక్కల కాతాలన్నీ గోవిందా . అవి పోతే తామిద్దరి బ్రతుకేం కావాలి? మదిలో తలపోస్తూ అవకాశం కోసం ఎదురు చూస్తున్నది చంద్రమ్మ

* *

"ఏయ్ రిక్షా" యాభై యేళ్ల వ్యక్తి పిలిచాడు.

అతనివైపు పరికించి చూచాడు నరసింహం సూటులో నీటుగా కనిపిస్తున్నాడు మనిషిలో హుందాతనం కూడా కనిపిస్తోంది నాల్గు డబ్బులొచ్చే బేరమని నిశ్చయం కలిగింది నరసింహానికి

"వత్తున్నా బాబయ్యా" రిక్షా ముందుకు లాక్కొచ్చి నిలబెట్టాడు

"రిట్జ్ లాడ్జికి ఎంత తీసుకుంటావోయ్"

"తమకు తోసిందిప్పించండి మీలాంటోళ్లికి మా కష్టం తెల్దాయేటిబాబు" లౌక్యం తెలియని నరసింహం మొహమాటపడుతూ అన్నాడు

సూటువాలాకు నరసింహం మాటలు ఒబీడియన్స్ నచ్చాయి. "రెండు రూపాయలిస్తాను వస్తావా?" అన్నాడు సంతోషంగా ఒప్పుకున్నాడు. రిక్షాలో కూర్చొన్నాడు సూటువాలా పది నిముషాల్లో చేరుకుంది రిక్షా గమ్య ప్రదేశాన్ని

"చూడవోయ్ తిరిగివచ్చేటంతటి వరకు వుంటే పదిరూపాయలు తిరుగు సవారీలో ఇస్తాను."

సూటువాలా దాతృత్వ గుణానికి మురిసి పోయి సంతోషంగా ఒప్పుకున్నాడు

"అక్కడే నీ వుండవోయ్" చీకటిగావున్న ప్రదేశాన్ని చూపిస్తూ సూటువాలా లాడ్జి లోపలకు వెళ్లిపోయాడు రెండురూపాయల నోటును బొడ్డు లోపల దోపుకుని చంద్రికి చీరెలా కొనిపెట్టాలని ఊహాగానం చేయడం మొదలుపెట్టాడు. సూట్‌వాలా చూపించిన ప్రదేశంలో రిక్షా చేర్చాడు

బీడి వెలిగించి గుండెల నిండా పొగపీల్చాడు బీడీ చంద్రి ఎదురుగా కాల్చితే సుతారంగా మందలిస్తూ వుంటుంది చంద్రి ప్రేమ వాత్సల్యాలకు రిక్షాలో కూర్చొని మురిసి పోతున్నాడు నరసింహం.

ఉలిక్కిపడ్డాడు ఒకసారిగా బాంబుల వర్షంపడ్తే వచ్చే భీతి కలిగింది నరసింహానికి ఆ దృశ్యాన్ని చూచి గుండె వేగం పెరిగింది అతి కష్టంమీద ఆపుకున్నాడు కళ్లు చిట్లించి చూచాడు మరోసారి. సందేహం లేదు ఆమె . ఆమె ప్రక్క అతడు. తన కళ్లు పొరబడటం లేదు. చత్వారం అసలే రాలేదు.

ఆమె విశాలి.

అతడు . విశ్వప్రసాద్.

రిట్జ్‌లాడ్జంటే వ్యభిచారులుండే గృహమని తనకు తెలుసు భార్యాభర్తలిద్దరూ మరిక్కడ కెందుకొచ్చినట్టు. ఇంట్లో అడ్డంకులున్నాయను కుంటే అత్తమామలు, ఆడపడుచులు కనీసం పిల్లలుకూడా లేరే. ఆనందం అనుభవించడాని కింతకంటే మంచి ప్రదేశం వీళ్లకు దొరకలేదా అనుకున్నాడు వాళ్లకు కనిపించకూడదనుకుని రిక్షా టాప్‌వేసి మరలా కూర్చొని ఆత్రుతతో చూస్తున్నాడు!

చుట్టూ ముసుగు కప్పుకుంది విశాలి. 'తీసేయి ఎవరైనా చూస్తే ఆ బాపతనుకుం టారని' కాబోలు విశ్వప్రసాద్ అంటున్నాడని అర్థం చేసుకున్నాడు ఆమె వెంటనే ముసుగు తొలగించగనే తనూహించినది కరక్టని ఆనంద పడ్డాడు.

అప్సరసలా తయారైంది. సాధారణ దుస్తుల్లో వున్నప్పుడు ఇంటి దగ్గర ఆమెను నరసింహం చూసాడుగాని అందంగా తయారయి నప్పుడు ఎప్పుడూ చూడలేదు. ఆమెది ఒక మాదిరి అందం. సోకుగా తయారయి యిలాంటి ప్రదేశాలకు కూడా వస్తుందని ఊహించని నరసింహం కనుదోయికి విడ్డూరంగానే కనిపించింది మరి.

లాడ్జి నుంచి ఐదు నిముషాలు పోయిన తరువాత విశ్వప్రసాద్ తిరిగి వచ్చాడు. లాడ్జికి దగ్గర్లోవున్న పాన్‌షాపులో సిగరెట్లు కొనుక్కొని త్రాగుతున్నాడు!

నరసింహం మదిలో వెయ్యి అనుమానాలు కలిగాయి ఏవోవో ఊహించుకుంటున్నాడు విశ్వప్రసాదంటే ఓ రకమైన గౌరవముంది. అతనలాంటివాడు కాదనభిప్రాయానికొచ్చాడు అతడు అందరిలాంటి మగవాడే సిగ్గు, అభిమానం, పౌరుషం మగలక్షణాలన్నీ వున్నాయి. ఇప్పుడు తను చూచిన భావార్థానికి ఆంతర్యం తెలియక తికమక పడ్డాడు గింజుకుంటున్నాడు జరగబోయేందేవిటో కాసేపట్లో తెలియకపోదని నిశ్చియించుకున్నాడు మరింకో బీడీ వెలిగించుకున్నాడు.

గంట గడిచింది అతి భారంగా విశ్వప్రసాద్ సిగరెట్లు పెట్టె కాల్చాడు నరసింహం కూడా కట్ట బీడీలు

మున్ముందుగా విశాలి తడబడుతూ గాబరాగా అడుగులు వేస్తూ వచ్చింది. అయిదు నిమిషాల గ్యాప్‌లో సూట్‌వాలా వచ్చాడు నరసింహం దగ్గరకొచ్చి ఐదు నిముషాలాగమని విశాలి, విశ్వప్రసాదులను కలుసుకుని ఏవో మాటలాడి తొందరగా తిరిగివచ్చాడు సూట్‌వాలా.

నరసింహం ఊహలకు పటిష్టమైన ఆధారం ఇప్పుడు దొరికినట్లైంది. సందేహం లేదు తనూహించనదే అనుకున్నాడు.

రిక్షాలో సూట్‌వాలాను అతనింటి దగ్గర దింపేసాడు. మగవాళ్లలో యిలాంటి వాళ్లుంటారా..? ఉండడమేమిటి తనుచూచినది నిదర్శనం కాగా రిక్షా వేసుకుని విచారంగా ఇంటికి వెళ్లిపోయేడు

* * *

"చంద్రి నేను వూరు వెళుతున్నాను. వేళకువచ్చి పాత్రలన్నీ తోమేసి ఇల్లూ వాకిలీ కాస్త తుడిచిపెట్టు అదనంగా డబ్బులిస్తాను" విశాలి ప్రయాణమయే రోజు ఆవేళే. అందుకోసం చంద్రిని బ్రతిమలాడుతున్నది.

చంద్రి గుండెల్లో రాయి పడింది. తనొంటరిగా విశ్వప్రసాదు దగ్గర పని చేయాలా. మనిషిని తినేసేలా చూస్తాడు కామాంధుడు, తనకేమైనా అయితే మామ ఏమైపోవాలి కుదరదని నిర్మొహమాటంగా చెప్పాలనుకుంది.

చంద్రి దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లుంది.






''ఎలాగైనా నాకీ వుపకారం చేసిపెట్టవే. కాదు కూడదనుకుంటే ఎంతో ఐదు రోజుల్లో వచ్చేస్తానుగా. కాదనకు తల్లి, మా ఆయన వర్తి అమాయకులు, ఇల్లంతా అసహ్యంగా తయారు చేసి పిచ్చివాడిలా తయారవుతారు. ఒప్పుకోవే నీకు పుణ్యముంటుంది.'' చేతులు పట్టుకొని బ్రతిమలాడింది.

అయిష్టంగానే ఒప్పుకోవలసి వచ్చినందుకు తన దురదృష్టాన్ని తిట్టుకుంది చంద్రి.

మరుచటి రోజు రాత్రి నరసింహంతో చెప్పివచ్చింది పని చేయడానికి బుద్ధిమంతుడిలా ప్రవర్తించాడు. రెండోరోజున అటూ ఇటూ చంద్రిచుట్టూ తచ్చాడాడు కొద్దిగా భయం వేసింది. మూడోరోజున చంద్రినుంచి రెస్పాన్స్ రాకపోయేసరికి చల్లబడ్డాడు. నాల్గో రోజు మామ్మూలుగా జరిగింది. అయిదో రోజు గడిచి పోతే ఆరోరోజు ఉదయం నాల్గంటల బండికి విశాలి వచ్చేస్తుంది. నాల్గురోజులు ఏమీ జరుగక పోయినందుకు భగవంతుడికి కోటి నమస్కార ములు పెట్టింది.

అయిదో రోజు రాత్రి పని చేస్తున్నది ఈ రాత్రితో తన కప్పజెప్పిన పని అయిపోతుంది. తన గండం గట్టెక్కినట్లే ఏవేవో వూహించు కుంటున్నది.

వెనుకనుంచి వచ్చి పట్టుకున్నాడు విశ్వప్రసాద్ ఇల్లు తుడుస్తున్న చంద్రిని. పొంచివున్న పులిలా కాచుకు కూర్చొన్న విశ్వప్రసాద్ నైజం కనిపెట్టలేకపోయింది చంద్రి. లేడిలా బెదిరిపోయింది. గట్టిగా అరవబోతుంటే నోరు మూసాడు పులినోట్లోపడ్డ లేడిలా గింజు కుంటున్నది కాస్పేపట్లో తన మానం మంట కలవబోతున్నది. అశ్రుధారలు అవిరళంగా కారుతున్నాయి. అరుద్దామంటే విశ్వప్రసాద్ ఒక చేత్తో గట్టిగా నోరు మూసేసాడు.

శారీరకంగా అతడు బలవంతుడు. పశుత్వంతో కొట్టుమిట్టాడుతున్న కామాంధుడు

తను అబల. కాలం గడుస్తున్నకొద్దీ తన బలం క్షీణించిపోతున్నది. ప్రతిఘటించే శక్తి నివ్వమని భగవంతున్ని ఎన్నో విధాలుగా మూగ ప్రార్థన చేసింది

''గట్టిగా అరవకే . . నన్ను సంతోషపెడ్తే వంద.. వంద రూపాయిలిస్తానే. మంచి చీర కొనిపెడ్తానే. విశాలినెందుకు వూరికి పంపించా ననుకున్నావ్ నీకోసమేనే'' ప్రాధేయపడుతున్నాడు.

పట్టు సడలింది, తుపుక్కున ఉమ్మేసింది చంద్రి. తుడుచుకోడానికి చేయి తీసాడు. ఆ ఒక్కక్షణం !... ఆ క్షణం అదే... !! చంద్రి పాలిట వరమైన క్షణం !! చంద్రి మానాన్ని కాపాడిన విలువైన క్షణం !!!

అంతే .. !!!

దబ్బున పడ్డాడు విశ్వప్రసాద్ . చంద్రి తన్నిన తాపుకు. ఏంటి నుంచి వెలువడిన బాణంలా రివ్వున బయటకు పరుగెత్తింది విశ్వప్రసాద్‌కు తల దిమ్మెక్కిపోయింది. చిరుచెమటలు పడు తున్నాయి మెల్లగా తేరుకున్నాడు .చల్లని వణకు వెన్నెముక నుంచి మొదలయ్యింది మెల్లమెల్లగా వ్యాపించి శరీరంలో ప్రకంపన మొదలయ్యింది

కేసు ఫెయిలయ్యింది. ఫెయిలయితే అయింది గాని తరువాత జరిగే పరిణామం . . చంద్రి.. చంద్రి మామ కండలు తిరిగిన వస్తాదు కాకపోయినా వాడి పెళ్ళాన్ని చెరచేందుకు ప్రయిత్నించావని కక్ష తీర్చుకోబోతే ?!

అమ్మో!!! భయం! . భయం !! భయం!!! శరీరమంతా వ్యాపించింది

పరువు ప్రతిష్టలు కూడా మంట కలవ బోతున్నాయని ఆలోచించేసరికి ఏం చేయాలో తోచడం లేదు విశ్వప్రసాదుకు

ఎలా తప్పించు కోవాలి ?

ఏం చేయాలి ఈ దుస్థితి నుంచి తప్పించు కోడానికి ??

పిరికితనం ఆవహించింది దబ్బున తలుపులు బంధించి లోపల గడియపెట్టి దాపుగా మంచం, పెట్టెలు అడ్డుపెట్టి సిగరెట్ పెట్టె అందు కున్నాడు

* * *

రాత్రంతా కలతగానే నిద్రపోయాడు సరిగ్గా నిద్రపట్టక పోవడంవల్ల కళ్ళు ఎర్ర బడ్డాయి. చంద్రి మొగుడు అర్ధరాత్రి వచ్చి అల్లరి చేస్తాడేమోనని తెగ భయపడిపోయాడు

తెల్లవారుజామున నాల్గుగంటలు కావొస్తున్నది సిగరెట్టు కాలుస్తున్నాడు . ప్లాన్ వేస్తున్నాడు విశాలి రిక్షాలోంచి దిగుతున్నది కొండంత ధైర్యం వచ్చింది విశ్వప్రసాదుకు భార్యను చూడగనే !

ఇంకో గంటలో చంద్రి వచ్చేవేళ అది రాదేమో, రాకూడదు ఎందుకు రాలేదంటే సర్ది చెప్పేయ వచ్చిరోజుకు రేపు ఎల్లుండు రాకపోతే విశాలి అనుమానించడానికి అస్కారముంటుంది ఏది ఏమైన విశాలికి సర్ది చెప్పేయవచ్చు నరసింహంగాడ్ని ఉదయాన్నే వెంట బెట్టుకొస్తే! ఎన్నో అనుమానాల్తో సతమత మౌతున్నాడు విశ్వప్రసాదు

పరధ్యానంగా వున్న భర్తను చూచి విశాలి నొసలు ముడిచింది మెల్లగా అడుగులు వేస్తూ అదే సమయానికి చంద్రి వస్తున్నది

చంద్రి వెనుక ఎవరైనా వున్నారేమోనని చూచాడు, ఉన్నట్లు జాడలగుపించలేదు చంద్రి కాస్సేపట్లో క్లయిమాక్సుకు కధను తీసుక్కు రావడం జరుగుతుంది కాకపోతే దీని జోలికి ఎన్నడు పోగూడదని నిర్ణయించుకున్నాడు మదిలో

విశాలిని చూచి ''ఎప్పడొచ్చినారమ్మగోరు'' పలకరిస్తూనే జీవం లేని నవ్వు నవ్వింది

''వచ్చి గంటయ్యిందే చంద్రి పనులన్నీ బాగా చక్కబెట్టినట్టు కనపడుతున్నది లేకపోతే అయ్యగారు వచ్చిరావడంతోనే నామీద విరుచుకు పడుండేవారు'' విశాలి అసలు విషయం తెలియక గుడ్డినమ్మకంతో అంది

''నాను. . నాను యీరోజునుంచి మీ యింటికాడ పనికి రాను నాకు రావల్సింది దిచ్చీయ్యండి'' నిర్మొహమాటంగా చంద్రి పలికింది.

ఆశ్చర్యంతో నోరు తెరచింది విశాలి

''ఏం ఎందుకని?'' భర్తవంక చూచింది

చెప్పడానికి తటపటాయిస్తున్నాడు విశ్వప్రసాద్. నోరు పెగలడంలేదు చెప్దామను కుంటుంటే గొంతువరకు వచ్చిన మాటలు కాకతాళీయంగా వెనుక్కు వెళ్లిపోతున్నవి. స్తబ్దుగా వుండిపోయాడు

''నాను సెప్తాను ఆడేటి సెప్తాడుగాని'' నరసింహం రంగప్రవేశం చేశాడు. నరసింహం ఉగ్ర నరసింహావతారంలా కనిపిస్తున్నాడు విశ్వప్రసాద్ చక్షువులకు

విశాలి గతుక్కుమంది ఏదో ఘోరం తన భర్త చేసాడని ఊహించింది అక్కడున్న వాతావరణంబట్టి

''సూడు అదెందుకు పని మానేత్తా నందో . జాగరతగా ఇనుకో యిసాలమ్మా నువ్వు. సమించు నీ మొగుడ్ని, యిలాగంతన్నా నని. ఈడికి గానం నేదు .. బుద్దినేదు . సిగ్గు నేదు .. సెరంనేదు పౌరుసం అంతకంటేనేదు.. ఆ మాటకొత్తే ఈడికేటీనేదు . మగోడు కాడీడు'' ధూ అని ఉమ్మివేసాడు.

## స్కూళ్ళలో పిల్లల కొరత!

పశ్చిమ జర్మనీలో ప్రాథమిక పారశాలలో విద్యార్థుల సంఖ్య బాగా తగ్గింది దీనితో ఉపాధ్యాయులు పిల్లలను వెతుక్కుంటూ వీధిన పడుతున్నారని ప్రజలు తమాషాగా చెప్పుకుంటున్నారు విద్యార్థుల కోసం అనవసర ప్రచారం చేయవద్దని ప్రభుత్వం స్కూళ్ళను హెచ్చరించింది. దీనికంతకూ కారణం పశ్చిమ జర్మనీలో జననాల రేటు తగ్గటమే. పశ్చిమ జర్మనీలో 1960 నుంచి జననాల రేటు తగ్గుతున్నది. కాలేజీలు, యూనివర్శిటీలలో మాత్రం రద్దీ పెరుగుతున్నది జననాల రేటు అధికంగా ఉన్న రోజుల్లో జన్మించినవారికి ఇంకా ఉద్యోగాలు దొరకలేదని ప్రజలు చెప్పుకుంటున్నారు మొత్తంమీద విద్యా రంగంలో ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది.

ఒక్కొక్కమాట శూలాల్లాగుచ్చుకున్నాయి ముల్లుల్లా బాధపెట్టాయి

'ఒరే.. నీలాగ నాను పెల్లాన్ని తారసన్రేదా దొంగనాయాళా'' ప్రక్కలో బాంబు పడినట్లు ఫీలయ్యింది విశాలి ఈ రహస్యం వీడికెలా తెలిసిందని నిర్ఘాంతపోయింది నోటిమాట రాలేదు.

పెదవి విరిచి నవ్వాడు అంతరాళాల్లోకి చొచ్చుకునిపోయింది ఆ నవ్వులోని భావన.

''నాకెలా తెలిసిందనుకుంతన్నావా యిసాలమ్మా రిటిజ్ నాడ్జికాడ నిన్ను సూటేసుకున్న బావు కప్పజెప్పేసినాడు కాదా. అప్పుడు నానక్కడే వున్నాను

'ఓరే' పరువు మర్రాదల్ని మంటగలిపేసినావు గదరా యెదవనన్నాసీ అనుకున్నానానాడే చంద్రిని మీకాడ పని మానిపించేదావనుకున్నాను నా సంద్రి మంచిదైనప్పుడు, నాను నీలాగ తారుపుగాడ్ని కానప్పుడు నాకేటి బయం అనుకున్నాను కాని—

నువ్వీ అగాయిత్తం సేత్తావని నేనుకోనేదురా దొంగనాకొడుకా నీ పెల్లాన్ని తారుసుకున్నట్టు నా పెల్లాం రంకుతనానికి వొప్పుకుంతాదని యెలాగనుకున్నావెహె. సంద్రంతే నిప్పురా. నీ పెల్లాం నాగ్గాదురా, నీలాగ పమోసనొత్తాదని కక్కుర్తి పడనేదురా కుక్కా'' వుల్లవిరిచి పొయ్యిలోపడేసినట్లు విరిచేస్తున్నాడు మాటల్తో భార్యాభర్తలను.

తిరిగి జవాబిద్దామనుకుంటే వీడికి చాలా రహస్యాలు తెలుసునని కిమ్మనకుండా వుండిపోయారు. మాటకు మాటకు చేర్పు చిలికి చిలికి గాలివానైనట్లు తామిద్దరు ఏమి మాట్లాడినా వీధిలోకి తీసుకు రావొచ్చు నరసింహం పెదవులు విప్పడానికి సాహసించలేదు.

''నీ టోరీ అంతా నాకు తెలుసురా. సూటుబాబును నాడ్జికాడకు ఆనాడు నా రిచ్చామీదనే తీసుకొచ్చినాను. ఆ బాబెవరోగాని మా దొడ్డ మడిసిలే పదిరూపాయలిచ్చినాడు ఆ బాబెవరో ఆరాతీసినా దొరకనేదు సాన్నాళవరకు. మీ యాపీసు కాడనుంచి వోరోజున రిచ్చామీద పోతున్నా. సూటుబాబు ఆపీసు నుంచి సరిగ్గా వొచ్చి రిచ్చా ఎక్కేసినాడు. బావు ఈ ఆఫీసులో సేత్తున్నారేటి వుద్యోగం అన్నా అదేదో పెద్ద మాటే అన్నాడు, అప్పుడు నా కరదమయిపోనాది.

నీ జనమలో వొకటి గాపకం వుంచుకో. అందరూ నీలాంటోల్లుండరు. నీ పెల్లాల్లాటోలుండరు. బతుకులు పేదవయినా బుద్దిగానంలో పేదల్లోయిపోర్రా ఆ మాతరం బుద్ది నీకు నేకపోనాది సదివావు సదువు గంగలో కలపెయిరా నీ సరిపికట్లును. రాయే సంద్రి ఇలాటి కుక్కకు కొడ్తే నా చేయి మైలపడిపోద్ది. నీకు బుద్దొత్తాదని తిడుతున్నాను అసలు నీకొత్తదా అని నాకు అనుమానం ఏత్తావుంది!

వత్తే అదుట్టమంతుడివే నేకపోతే మరి నీ పెల్లాం నీకెప్పుడో యిచ్చేతాది యేండ్.''

విశాలి హృదయంమీద ఒక్కొక్క మాట సమ్మెటపోటుల్లా తగులుతున్నాయి విశ్వప్రసాద్‌కు తల తీసినట్లు అమితమైన బాధ పడ్డాడు

నరసింహం చెప్పిన మాటల్లో నగ్నసత్యం ఎంతైనా వుంది. మార్పు అవస్యమనిపించింది ఇప్పుడు భార్యాభర్తలిద్దరకు

''రాయే సంద్రి పోదాం ఈళ్లకి ఇదిసాల్లే జనమలో మరింకెప్పుడు సెయ్యరు'' నరసింహం చంద్రి చేయి పట్టుకుని వెళ్లిపోతున్న వైపు పశ్చాత్తప హృదయులై చూస్తున్నారు వేదాంతం చెప్పి జీవితరహస్యానికి విముక్తి తెలిపిన పరమహంసలా నరసింహం, అతన్నే అనుసరిస్తున్న చంద్రి ఎంతో ఉన్నతమైన మనుష్యుల్లా కనపడ్డారు. ★

# ఫాలాక్షుని డైరీ

## ఆట కట్టించిన ఆడ పోలీసు !

మద్రాసులో వో సిటీబస్సులో 30 ఏళ్ళ అగస్టిన్ అనే వో మన్మధరావు ప్రయాణం చేస్తూ తన పక్కనే నిలబడ్డ నిత్యకుమారి అనే వాహామెను రాసుకు పూసుకుంటూ ప్యారీసు కార్నర్ స్టాపులో ఆమె దిగుతే తానూ దిగి ఆమెను వెంబడించి, నీ రేటు ఎంత, ఎక్కడి కెళ్దామనడిగాడట. ఆమె విరువిరుమని వెళ్తూంటేకూడా పడ్డ ఆతను వున్నట్టుండి కుయ్యబారిపోయాడట. కారణం ? ఆమె వో ఆడపోలీసు అధికారిణి అట. దగ్గర్లో వున్న పోలీసు సహాయంతో ఆతన్ని పోలీస్టేషనుకు చేర్పించదట.

## నాటకంకోసం జీవితభీమా !

ప్రఖ్యాత హాలీవుడ్ నటీమణి ఎలిజబత్ టెయిలరు అందుకు తీసిపోని నటుడు రిచ్చర్డ్ బర్టన్ను రెండుసార్లు వివాహం చేసుకుని, రెండు సార్లు విడాకులిచ్చుకున్నారట. ఇపుడు వీరిద్దరూ కలసి "ఆంతరంగిక జీవితాలు" అనే నాటకంలో నటిస్తున్నారట. నాటకంలో తమకుగాని, ప్రేక్షకులకుగానీ ఎదురుచూడని ఆవేశమేమైనా వచ్చి ఏ వుపద్రవమైనా జరుగుతుందేమోనని భయపడి ఎలిజబత్ టెయిలరు తన జీవితాన్ని ఆ నాటక కాలంలో 32,50,000 డాలర్లకు ఇన్సూరు చేసిందట – అమ్మతల్లే !

## ఖరీదైన జైలు !

ప్రపంచంలో కల్లా అతి ఖరీదైన జైలు జర్మనీ బెర్లినుకు చెందిన స్పాన్డు జైలట. సుమారు నూరు సంవత్సరాల క్రితం కట్టిన యీ జైలు ఆరొందల మంది ఖైదీలుండడానికి వీలున్నదట. ఇప్పుడీ జైలులో ఎవరూ లేరట. వున్న నూటయిదు మంది సిబ్బందికీ ఏ యిబ్బందీ కలుగకుండా జీతాలివ్వడానికి ఏటికి నాలుగొందల పాతిక వేల డాలర్లు ఖర్చవుతోందట.

## మాయమైన టాంక్‌లు !

ఇటలీదేశం వెస్ట్ జర్మనీ నుంచి 1968–70 లలో నూరు యుద్ధ టాంకులను కొన్నదట. కానీ యీనాడు ఆ ట్యాంకులను లెక్కచూస్తే అరవయ్యే వున్నాయట. లెక్కకు తేలని యీ నలభై ట్యాంకులగతి ఏమిటని ఏ నాధుడూ పట్టించుకోవటం లేదట. యునైటా అనే దిన పత్రిక యీ విషయంమీద వ్యాఖ్యానిస్తూ "ఏవైయ్యుంటాయి ! అమ్మడుబోయి, బాగా చక్కని డబ్బుగా మారి ఏ అధికారుల జేబుల్లోనో మారుంటాయి" అన్నదట.

## మోకాళ్లపై 1400 మైళ్ల నడక !

అబ్దుల్ ఖాసిమ్ జోనియడ్ అనే వో మనస్తత్వ శాస్త్రవేత్త సౌదీ అరేబియాలోవున్న మక్కాను 30 సార్లు దర్శించాడట. ఈయన మక్కా మొదటిసారి వెళ్ళినపుడు ఆ పద్నాను గొందల మైళ్ళూ మోకాళ్ళతో నడిచి వెళ్ళారట.

## కొత్త జబ్బులు !

ప్రపంచంలోని ఈనాటి నాగరికత లక్షణాలకు కనీ వినీ ఎరుగని కొన్ని కొత్త జబ్బులొస్తూంటే వైద్యులు వాటికి అవి ఎందువల్ల వచ్చాయో కనుక్కుని ఆ పేరెట్టి పిలుస్తున్నారట టెలివిజను గంటల తరబడి కూర్చుని చూడడంవల్ల మోకాళ్ళలో వో రకం నొప్పులు బయలుదేరుతాయట టెలివిజను థ్రాంబోసిస్ అని యీ రోగానికి పేరు పెట్టారట. ఆనక బిగుతుగా వుండే జీన్స్ తొడుక్కోడంవల్ల తొడల మీద, గజ్జలలోనూ వున్న చర్మం మీద ఓ రకం చర్మవ్యాధి అల్లుకుంటోందిట, దీనికి జీన్స్ డెర్మటోసిస్ అని పేరెట్టారట. ఇహ "ఫంక్" అనే వో రకం బాల్‌రూము డ్యాన్సులో తల భయం కరంగా వూపడంవల్ల రక్తం కళ్ళల్లోకి ఎగదన్ని, ఎర్రని జీర వచ్చి, అది స్థిరపడుతూన్నదట, ఈ రోగానికి పంక్ సిండ్రోమ్ అని వో ముద్దు పేరు పెట్టారట–ఆకలి లేకపోతే అజీర్తి జబ్బు–అదుంటే అతిజీర్తి జబ్బా . అంతేకదా !!

## పైప్ పోటీలు !

రోమ్‌లో "ఎక్స్‌పో–పైప్ 83" అనే వో ఆట ఆడారట 38 పైప్ క్లబ్బుల నుంచి 231 మంది మగవారు, 19 మంది ఆడవారూ యీ ఆటల పోటీలో పాల్గొన్నారట ఇటాలియన్ నేషనల్ టీముకు ప్రథమ బహుమతి వచ్చిందట ఈ టీములోని మెంబర్లు ఒకే పైపును మార్చి మార్చి రెండు గంటల 46 నిముషాలసేపు ఆరిపోకుండా కాల్చారట !

## దక్షిణ ఆఫ్రికాలో జాతి విచక్షణ !

సౌత్ ఆఫ్రికాలో "అమెరికా–షా–నా-నా" అనే వో పాప్ మ్యూజిక్ గ్రూపు లీడరు డెన్నీ గ్రీన్ అనే నీగ్రో ఓ పాప్ సాంగ్ పాడుతూ ఆ పాటకు తనతో అడుగులు వేయరమ్మని చూపరులలో వోహమ్మాయిని పిలిస్తే ఛిక్ అన్నదట ఇదేముక్క మరో ముగ్గురమ్మాయిలూ అని, నీకేం జాతిబేధం తెలీటంలే, మేం తెల్లవారము అని ఛీత్కరించిందట–






# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వజ్రోత్సవం
ఆంధ్ర సచిత్ర వారపత్రిక
75
1908-1983
ANDHRA SACHITRA VARAPATRIKA
PLATINUM JUBILEE

## [16-9-1983]

## వినాయక చవితి సంచిక

## వజ్రోత్సవసంచికగా వెలువడుతుంది!

**1908** లో వినాయక చవితినాడు వారపత్రికగా జన్మించిన ఆంధ్రపత్రిక తెలుగువారికి చేస్తూవచ్చిన సేవ ఇంతా అంతా కాదు. ఇప్పటికి ఏడున్నర దశాబ్దాలుగా ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఆంధ్రుల ఆదర్శాలకి, ఆశయాలకీ, వారి సంస్కృతికీ ప్రతిబింబంగా ఉంటూ వచ్చింది. పాఠకులు, ఇతర శ్రేయోభిలాషుల ఆదరాభిమానాలతో, మరింత ఉత్సాహంతో ఈ సేవని కొనసాగించాలన్న కృతనిశ్చయంతో ఉంది.

తెలుగువారి సర్వతోముఖ వికాసానికి 75 సంవత్సరాల కాలంలో ఆంధ్ర సచిత్ర వారపత్రిక చేస్తూ వచ్చిన కృషి ఎటువంటిదో కొంతవరకయినా ఈ వినాయక చవితికి వెలువడే వజ్రోత్సవ సంచిక తెలుపగలదు!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంచికలో అప్పటివారివి, ఇప్పటివారివి ఎన్నో రచనలు ఉంటాయి — కథలూ, వ్యాసాలూ, కవిత్వం, బొమ్మలూ మొదలయినవి!

ఆంధ్ర సచిత్ర వారపత్రిక వజ్రోత్సవ సంచిక కనీసం రెండు వందల పేజీలతో, పూర్తి అఫ్‌సెట్ ముద్రణతో వెలువడుతుంది!

**నేడే మీ కాపీ రిజర్వు చేసుకోండి!**



# నల్లకలువ

రావినూతల సువర్ణాకన్నన్

"గుడ్ మాణింగ్ డాక్టర్ !..."

కల్పన ఆలోచనలతో పరధ్యానంగా నడుస్తున్న కేశవ్ తృళ్ళిపడి చూశాడు.

ఎదురుగా పది గజాల దూరంలో డాక్టర్ సుభద నిల్చుంది.

"గుడ్‌మాణింగ్!... మెటర్నటీ వార్డ్‌కా?" అన్నాడు నవ్వుతూ.

"అవును !... అన్నట్టు... నాకు పార్టీ ఎప్పుడు ?" కుతూహలంగా అంది సుభధ.

"త్వరలోనే !" నవ్వేశాడు కేశవ్.

"కంగ్రాచ్యులేషన్స్ !" మెల్లగా అంది సుభద.

"ధ్యాంక్స్ !"

ఇద్దరూ మాట్లాడుకుంటూ దారులు చీలారు.

నిన్న సాయంత్రం పెళ్ళి చూపుల కెళ్ళొచ్చాడు కేశవ్. పెళ్ళికూతురు కల్పన ఎంతో నచ్చిందతనికి.

సుభదని, కల్పనవి పక్క పక్కన ఊహించుకుని నవ్వుకున్నాడు. చీకటికి, వెలుతురికి ఉన్నంత తేడా ఉందనుకున్నాడు !

డాక్టర్ సుభద ఓ పేద బడిపంతులి తొలి సంతానం ! రిటయిరైన తండ్రికి, ఆయన కన్న మరో నలుగురు సంతానానికి ఆమే ఆధారం.

తల్లి పోవడంతో ఆ పిల్లలకి తానే తల్లై పెంచింది ! నల్లని నలుపు! విశాలమైన నుదుట ఏదో గీసుకున్న మచ్చ !... నల్లని పెద్ద కళ్లలోని అమాయకత్వం ఆమె డాక్టరంటే ఓ పట్టాన నమ్మనివ్వదు.

కేశవ్ వాళ్ళ బంగ్లాకానుకుని ఉన్న ఓ చిన్న డాబా ఇంట్లో అద్దెకుంటోంది.

కల్పన నిమ్మపండు ఛాయ.

విశాల నేత్రాల్లో అల్లరి, చిలిపితనం పోటీ పడుతూంటాయి.

ఓ లక్షాధికారి ఏకైక ముద్దుల పట్టి.

కల్పనని చూసిన దగ్గర్నించి కేశవ్ మనసు మనసులోలేదు. కళ్ళు తెరిచినా, మూసినా కల్పన రూపమే మెదిలి అల్లరి పెట్టేస్తోంది.

వెంటనే పిల్ల నచ్చిందని చెప్పేద్దామనుకున్న కేశవ్ ఆమెతో ఏకాంతంగా ఓ పది నిమిషాలు మాట్లాడాలన్న కోరికతో తన అంగీకారాన్ని కాస్త వాయిదా వేశాడు.

అది కల్పనక్కూడ నచ్చడంతో ఫలానారోజు ఫలానాచోట కలుసుకోవాలని నిర్ణయం జరిగిపోయింది.

అయితే అదృష్టవశాత్తు అనుకోకుండా కేశవ్, కల్పనలు ముందే కలుసుకున్నారు.

కల్పన ఫ్రెండ్స్‌తో పిక్‌నిక్ కెడితే అదే చోటికి కేశవ్ కూడా రావడం తటస్థించింది.

కేశవ్‌ని ఫ్రెండ్స్‌కి పరిచయం చేసింది కల్పన. పెళ్ళిచూపులప్పటికంటే మరీ అందంగా కనిపిస్తున్న కల్పనని చూసి మురిసిపోయాడు కేశవ్.

అందరూ కలిసి ఎన్నో కబుర్లు చెప్పుకున్నారు !

పేకాడుకున్నారు !

టేప్ రికార్డర్ పెట్టుకున్నారు.

ప్రొద్దుగూకుతుండగా లేచారు వెళ్ళడానికి

అయితే . ఓ తమాషా ఆట చూపిస్తామని అందరూ కేశవ్‌ని గెస్ట్‌హౌస్‌కి తీసికెళ్ళారు

* * *

కల్పన దగ్గర్నించి వచ్చింతర్వాత కేశవ్‌కి అన్నం తినబుద్ధికాలేదు !

కంటిమీదికి కునుకు రాలేదు !

ఆమెను పెళ్ళిచూపులు చూసొచ్చిననాటి కంటే గొడవ పెట్టిందతని హృదయం !

తెల్లవార్లూ కలతనిద్రతో, ఆలోచనల్తో గడిపిన కేశవ్ ఒక నిర్ణయానికొచ్చి ఉత్సాహంగా లేచాడు.

వెంటనే కల్పనకి, ఆమె ఫ్రెండ్స్‌కీ సాయంత్రం అయిదింటికి రమ్మని ఫోన్ చేశాడు.

వీడియోలో మంచి పిక్చరుందని, తప్పకుండా రమ్మని ఆహ్వానించాడు.

తన ఫ్రెండ్స్‌ని కూడా కొంతమందిని పిల్చాడు. అందమైన అతని ఆలోచనల్లో నల్లకలువ సుభద్ర కూడా మెదిలి ప్యూన్‌చేత ఆవిడకూ కబురు చేశాడు.

తల్లిదండ్రులు ఏదో పెళ్ళి కెళ్ళడంతో... అతి ఉత్సాహంగా ఏర్పాట్లు పూర్తి చేశాడు.

* * *

సాయంత్రం అయిదున్నర అయింది !

కేశవ్ ఫ్రెండ్సంతా వచ్చేశారు.

సుభద్ర కూడా అప్పుడే అడుగుపెట్టింది.

''రండి !'' ఆప్యాయంగా ఆహ్వానించి కూర్చోపెట్టాడు కేశవ్.

సుభద్ర పొడవైన జడ కుర్చీలోంచి పాములా జారుతోంది !

ఆమె కట్టుకున్న వెంకటగిరి చీరతో పోటీ పడుతున్నాయి. ఆమె జడలోని తెల్లని జంట గులాబీలు !

ఆరౌతూండగా వచ్చింది కల్పన ఫ్రెండ్స్‌తో సహా... పరిచయ వాక్యాలయ్యాయి.

అందర్నీ ఆదరంగా ఆహ్వానించి కూర్చో బెట్టాడు కేశవ్.

అందరికీ కుతూహలంగా ఉంది, అతను చూపించబోయే ఫిలిం ఏమిటి ? అని !

టిఫిన్స్, కూల్‌డ్రింక్స్ సేవించడాలయి పోయాయి ? ''ఇంక చెప్పాలి !'' చిన్న నోరు మరీ చిన్నదిగా ముడిచి అదోలా అడిగింది కల్పన.

కేశవ్ నవ్వాడు

అతని నవ్వు ఎంతో మంది హృదయాల్ని గిలిగింతలు పెట్టింది.

భూలోకానికి దిగివచ్చిన దేవకన్యలా మెరిసి పోతున్న కల్పనని అలా చూస్తూండి పోయింది సుభద్ర.

''భగవంతుడెంత పక్షపాతి ! అందం ఆకర్షణ, ఆస్థి అంతస్తు, చదువు సంస్కారం, అన్నీ ఒకే చోట కుప్పలా పోశాడు !'' మొదటి సారిగా అసూయపడింది.

''మీకు ఫిలిం చూపించే ముందు ఓ చిన్న గేమ్ చూపిస్తాను !... అది మీరు చూడాలే తప్ప .. మధ్యలో ప్రశ్నలు వెయ్యకూడదు !'' అన్నాడు కేశవ్

'ఓ ! అలాగే !' ఉత్సాహంగా అన్నారంతా

కేశవ్ ఫ్రెండ్ ఒకతను ఓ చిన్న డబ్బా, రెండు పావురాళ్ళున్న పంజరం తెచ్చి కేశవ్ కిచ్చాడు.

అందరూ కుతూహలంగా చూస్తున్నారు.

''ఫ్రెండ్స్ !... నేను చూపించబోయే ఈ రెండు రకాల గేమ్స్ మీలో ఎవరికైనా తెలుసేమో నాకు తెలియదు !...

కానీ... చాలా సరదాగా ఉంటాయి !

ఇదుగో ఈ డబ్బాలో పది తూనీగలున్నాయి. ఈ సూదితో వాటి పొట్టలో గుచ్చి దారం చివర ముడివేసి ఓ మీటర్ దారానికి బెలూన్లలా వేలాడెయ్యాలి ! . ఈ పది దారాలు ఒకటిగా ముడివేసి ఓ కొక్కానికి కట్టాలి !

అప్పుడు పది తూనీగలు, బాధతోనూ, ప్రాణ భయంతోనూ, ఎగురుతూంటాయి ! ఈ దృశ్యం చూడ్డానికి చాలా బావుంటుంది !...''

''ఒక రెక్క విరిచెయ్యాలి ! అప్పుడింకా తమాషాగా ఉంటుంది '' కేశవ్ మాట పూర్తి కాకుండానే ఉత్సాహంగా అంది కల్పన.

''ఎస్! ఎస్ ! నాకా ఆయిడియా రాలేదు!'' అంటూ ఓ తూనీగని, సూదిని చేతుల్లోకి తీసుకున్నాడు కేశవ్.

''ఇప్పుడు దానికి గుచ్చబోతున్నారా ?'' కంగారుగా అంది సుభద్ర

''అవును !'' సూదిని తూనీగ పొట్టలో గుచ్చబోతూ అన్నాడు కేశవ్.

''ప్లీజ్ ! వద్దు !'' దాదాపు అరిచినట్టే అంది సుభద్ర.

కల్పన, ఫ్రెండ్స్ చిరాగ్గా చూశారామెకేసి.

''ఫరవాలేదు ! చూడండి ! చాలా సరదాగా ఉంటుంది !'' నవ్వుతూ అన్నాడు కేశవ్.

''నో ! ఐ కాంట్ సీ !''

''[illegible] .. మరొకటి చూపిస్తాను ! దీని కభ్యంతరం చెప్పకూడదు ! ఓకే !?'' సూదిని, తూనీగని వాటి స్థానాల్లో వుంచుతూ అన్నాడు కేశవ్.

''అలాగే !'' అన్నట్టు చూసింది సుభద్ర. కానీ . ''ఈసారెలాంటి ఘోరం చూడాల్సొస్తుందా'' అన్న భయం ఆమె కళ్ళలో స్పష్టంగా కనిపిస్తోంది.

కల్పనకి చిరాగ్గా వుంది !

''అసలు కేశవ్ ఈవిడగారి మాటలకింత విలువ ఇవ్వడం ఏమిటి ?'' అనుకుని మనసులోనే మండిపడింది

''ఈ పావురాళ్ళ కాళ్ళకి తాళ్ళు కట్టి ఫ్యానుకి వేలాడదీసి ఫుల్ స్పీడ్‌లో ఫ్యాను ఆన్ చెయ్యాలి ! అప్పుడుంటుంది థ్రిల్ ! ఓహ్ !'' పావురాళ్ళ కాళ్ళకి తాళ్ళుకట్టి స్టూల్ ఎక్కి వాటిని ఫ్యానుకి కట్టాడు కేశవ్.

అవి కంగారుగా ఎగిరి ఫ్యానుమీద కూర్చుని బిత్తర చూపులు చూస్తున్నాయి.

సుభద్ర వెన్నులోంచి ఒణుకు వస్తోంది !

''వాటికి ... దెబ్బ తగలదూ ?'' లో గొంతుతో అంది.

''ఎందుకు తగలదూ ?'' నవ్వాడు కేశవ్.

''అంటే ... ?''

''అవి ప్రాణ భయంతో ఫ్యానుతో పోటీగా కాసేపు తిరుగుతాయి ! ... పారిపోవాలని విశ్వ ప్రయత్నం చేస్తాయి ! అఫ్‌కోర్స్ !.. కాస్సేపటికి ఫ్యాన్ రెక్కలకి బలైపోతాయి! అది వేరే సంగతి కానీ ... చూస్తున్నంతసేపూ చాలా సరదాగా






ఉంటుంది!'' ఫ్యాన్ స్విచ్ కేసి నడుస్తూ అన్నాడు కేశవ్.

''డాక్టర్ !'' అరిచింది సుభద్ర. ఆమెకి ఎప్పటిలా కేశవ్‌ని చూస్తే ఆరాధన కలగడం లేదు ! అతని నవ్వు ఆమె హృదయాన్ని గిలిగింతలు పెట్టడం లేదు !

అసహ్యం కలుగుతోంది !

విషం కక్కుతున్నట్టుంది !

''అబ్బ! . ఈసారేమిటి మీ అభ్యంతరం?'' విసుగ్గా చూశాడు కేశవ్.

''ప్లీజ్! డాక్టర్! ఇంత రాక్షస ప్రవృత్తి మంచిది కాదు ! '' రెండు చేతులు జోడించింది సుభద్ర.

ఆమె రెండు కళ్లు నీళ్లతో నిండి పోయాయి.

''ఇందులో రాక్షసత్వం ఏముంది ?''

''ఒక జీవిని హింసించడం రాక్షసత్వం కాదా ?''

''తెల్లారితే వేలాది జీవులు నసిస్తున్నాయి ! ...ఆహారంకోసం ! '' వ్యంగ్యంగా అంది కల్పన.

''కానీ.. వారు సరదాకోసం చంపడంలేదు . ఆయినా ... మిస్ కల్పనా ! మీరు కూడా శాకాహారులేననుకుంటా ! '' సూటిగా చూస్తూ అంది సుభద్ర.

''అయితే ? ... '' తీక్షణంగా చూసింది కల్పన.

''ఆహా ! ... జీవహింస గురించి వివరిస్తుంటేను !''

''నేను శాకాహారినైనంత మాత్రాన మాంసాహారుల్ని ఆడిపోసుకోను !'' కఠినంగా అంది కల్పన.

''నేనూ ఆడిపోసుకోను ! ...కానీ.. మాంసం తింటున్నామని, వాటిని చిత్రహింస చేసి ఆనందించేవాళ్లని మాత్రం అసహ్యించు కుంటాను !'' నిష్కర్షంగా అంది సుభద్ర.

కల్పన కళ్లు కోపంగా ఎరుపెక్కాయి.

''మీరు బ్రతికున్న కప్పల్ని వాటిని కోయలేదూ ? అది చిత్రహింస కాదా ? ... లేక అలాంటివేం కొయ్యకుండానే డాక్టరయ్యారా ?'' అంది హేళనగా.

''హియర్ ! హియర్ ! '' చప్పట్లు కొట్టారు కల్పన ఫ్రెండ్స్.

''అంటే ... అది విజ్ఞానంకోసం ! '' గొణిగింది సుభద్ర.

''అయితే ఇది వినోదం కోసం'' మొండిగా అంది కల్పన.

సుభద్ర నిర్ఘాంత పోయింది !

దైవ సమానమైన డాక్టర్ వృత్తికీ, జీవహింసతో పొందే పైశాచికానందానికీ పోల్చి రెండూ ఒకటేనని వాదించే కల్పనతో ఏం మాట్లాడాలో తోచలేదు సుభద్రకి.

> ## సూర్యుని జన్మరహస్యం!
>
> నక్షత్రవీధిలో గుండ్రని మబ్బు వంటి ఆకారాన్ని కనుగొన్నట్లు జపాను ఖగోళ శాస్త్రవేత్తలు ప్రకటించారు ఈ మబ్బు వంటి ఆకారం నుండే సౌరకుటుంబాలు ఏర్పడుతున్నాయని, సూర్యుని ఆవిర్భావాన్ని గురించి తెలుసుకోవటానికి దీనివలన వీలవుతుందని శాస్త్రవేత్తలు తెలియ చేశారు టోక్యో ఖగోళ పరిశోధనశాలలోని ఆల్ఫా మోడర్న్ రేడియో టెలిస్కోపు సహాయంతో దీనిని కనుగొన్నారు. నల్లని మబ్బు వంటి ఆకారం ముడుచుకుని గుండ్రంగా మారినపుడు, దీని మధ్యలో సూర్యుడు ఏర్పడతాడని, అనేక సూక్ష్మ కణాలు గ్రహాలుగా మారి ఈ సూర్యుని చుట్టూ తిరుగుతుంటాయని శాస్త్ర వేత్తలు విశ్వసిస్తున్నారు ఓరియన్ నక్షత్ర సముదాయానికి సమీపంలో ఈ మబ్బును కనుగొన్నారు. ఇది భూమి నుండి 1500 కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నది. ఈ మబ్బు నిర్మాణం, సౌరకుటుంబాల ఆవిర్భావం గురించి తెలుసుకోవటానికి శాస్త్రవేత్తలు కృషి చేస్తున్నారు.

ఈ సమావేశంలో తను ఇనుమడలేననుకున్న ఆమె మెల్లగా లేచింది

అంతవరకు ఇద్దరి మాటల్ని కుతూహ లంగా వింటున్న కేశవ్ ''అరె ! లేవారేమిటి?'' అన్నాడు.

''సారీ ! డాక్టర్ ! నేను చాదస్తపుదాన్ని ! ఇలాంటి గేమ్స్ చూసి ఆనందించేంతటి శక్తి నాకు లేదు ! మన్నించండి !'' నాలుగడుగులు వేసింది సుభద్ర.

''నో ! నో !. మీరు వెళ్లడానికి వీల్లేదు!'' కేశవ్, అతని ఫ్రెండ్స్ కూడ పట్టుపట్టారు

వారనుకునే థ్రిల్లింగ్ దృశ్యాల్ని కేన్సిల్ చేసేసి పావురాల్ని, తూనీగల్ని వదిలేశారు

కల్పన ముఖం జేవురించింది.

అది చూసి కూడా చూడనట్టు ఫ్రెండ్స్ తెచ్చిన కేసెట్స్ 'వీడియో'లో చూపించి వాతా వరణాన్ని కాస్త తేలిక చేశాడు కేశవ్

* * *

''గుడీవినింగ్ డాక్టర్ ! ''

తనని తప్పుకు తిరుగుతున్న సుభద్రని నవ్వుతూ పలకరించాడు కేశవ్.

తనకి తానుగా ఏనాడూ పలకరించని కేశవ్ తను దూరంగా తప్పుకుంటున్నా పనివేళా వచ్చి ఆప్యాయంగా పలకరించడంతో కాస్త తికమక పడింది సుభద్ర.

''గుడీవినింగ్ !. . ఇంటికేనా ?'' ఏదో అడగాలన్నట్టు అడిగింది

''ఉహూఁ ! అలా కాస్సేపు బీచ్ కెళ్ళొద్దామనుకుంటున్నాను '' ఆమెకేసి పరిశీలనగా చూస్తూ అన్నాడు కేశవ్

''ఓ ! .. వెళ్ళండైతే '' వాచ్ చూసుకుంటూ అంది

''మీరు కూడా రాకూడదూ ?''

''నేనా . ?'' ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవైనాయి సుభదకి

''అవును ! ఏం ? రాకూడదా ?''

''అయాం సారీ!... ఇవాళ నేను పెంద్రాళే ఇంటికెళ్ళాలి !'' గంభీరంగా అంది సుభద

''ప్లీజ్ ! ఫర్ కంపెనీ సేక్ ! ..''

''నా కంపెనీ మీకు ఆనందాన్నివ్వదు !'' పదునుగా ఉందామె స్వరం

''అది నిర్ణయించవల్సింది నేను !. .''

''అంటే ?'' తీక్షణంగా అంది సుభద.

''పోనీ. నాలుగు మాటలు మీతో మాట్లాడాలి ! సరేనా ?'' గంభీరంగా అన్నాడు కేశవ్

కేశవ్ కళ్ళలోని అర్థింపుకు ఆశ్చర్యపోయింది సుభద ఇదే ఇంతకు ముందైతే అతని కోరిక ఆమె హృదయం మీద పన్నీరు కురిసినట్టుండేది. కానీ ఇప్పుడు అతనో కిరాతకుడిలా, ధనబలంతో కళ్ళకు పొరలు కప్పిన విలాస పురుషుడిలా కనిపిస్తున్నాడు అందుకే అతని కోరికని సున్నితంగా త్రోసి పుచ్చింది.

''మరోలా అనుకోకండి డాక్టర్ ! నేను నిజంగానే తొందరగా ఇంటికెళ్ళాలి !'' అంటూ.

కేశవ్ ముఖం సీరియస్‌గా అయిపోయింది

''మిస్ సుభదా ! . పది నిమిషాలు నాతో మాట్లాడితే మీ అవున్నత్యం తగ్గిపోతుందని మీ ఉద్దేశమా ?'' ఆదోలా అన్నాడు.

''ఛ ! ఛ ! అదికాదు ! '' కంగారుగా అంది సుభద

''మరైతే రండి !'' కారు డోర్ తీసి పట్టుకుంటూ అన్నాడు కేశవ్

ఓసారి అతని కళ్ళలోకి సూటిగా చూసిన సుభద మారుమాట్లాడకుండా కార్లో కూర్చుంది.

''థ్యాంక్స్ !'' ఉత్సాహంగా స్టీరింగ్ చేతిలోకి తీసుకున్నాడు కేశవ్

బీచ్‌లో జనం పల్చగా ఉన్న చోటు చూసుకుని కూర్చున్నారిద్దరూ

సముద్రం మీదినించి వచ్చే చల్లనిగాలి సుభద ముంగురుల్ని చెరిపేస్తున్నాది

''చెప్పండి !'' ఇసుక గుప్పెళ్ళతో తీసి ఒదులుతూ అంది సుభద

''నేనంటే మీకు అసహ్యంగా ఉందికదూ ?'' హటాత్తుగా అన్నాడు కేశవ్

సుభద మాట్లాడలేదు సముద్రపు టంచులు చూద్దానికా అన్నట్టు సముద్ర గర్భం లోకి దృష్టి మరల్చింది.

''కల్పన గురించి మీ అభిప్రాయం ఏమిటి?''

త్రుళ్ళిపడింది సుభద వెంటనే తేరుకుని ఆదోలా నవ్వుతూ –

''మీకు తగ్గ ఇల్లాలు ! 'మేడ్ ఫర్ ఈచ్ అదర్స్' అన్నట్టుంటారు మీరిద్దరూ !'' నొక్కి మరీ అంది.

''నో ! ''

''వ్హాట్ ?. '' అదిరిపడింది సుభద.

''అవును ! కల్పన నాకు నచ్చలేదు ! ''.

''కారణం ?'' వ్యంగ్యంగా అంది సుభద' అతని మాటలు నమ్మబుద్ధి కాలేదామెకి

''మా మనస్తత్వాలు ఉత్తర దక్షిణ ధృవాలు !''

పక్కున నవ్వింది సుభద.

''ఎందుకు నవ్వుతున్నారు ?''

''సారీ ! చెప్పండి !'' సర్దుకుని అంది సుభద.

''నేనామెతో సుఖపడలేననిపించింది ! అందుకే ఆమె నచ్చలేదని డాడీతో చెప్పి లెటర్ రాయించేశాను !'' అన్నాడు కేశవ్

''ఇదంతా నాకెందుకు చెప్తున్నారు ?'' వింతగా చూసింది సుభద.

''నాకు నచ్చిన, నన్ను మెచ్చిన వ్యక్తిని చేసుకోవాలనుకుంటున్నాను !''

''మంచిదే ! '' మెల్లగా అంది సుభద

రెండు నిమిషాలు మౌనంగా దొర్లిపోయాయి !

సుభద ఆలోచనలో పడింది! ఎవరా నచ్చిన వ్యక్తి అని

''ఆ వ్యక్తి ఎవరో చెప్పనా ?'' ఆమె కళ్ళలోని భావాలు చదివిన కేశవ్ మృదువుగా అన్నాడు

చెప్పమన్నట్టు చూసింది సుభద

''మీరే !''

''ఏమిటీ? '' బిత్తరపోయింది సుభద

''అవును! నేను ప్రేమించిన వారికంటే నన్ను ప్రేమించిన వారితోనే ఎక్కువ ఆనందం ఉంటుందనుకుంటున్నాను !''

'' కానీ నేను మిమ్మల్ని ప్రేమించలేదు !!'' అభిమానంతో ముఖం కందిపోయింది సుభదకి.

తియ్యగా నవ్వాడు కేశవ్.

''లేదు!.. మీరు అబద్ధం ఆడుతున్నారు!. నన్ను మీరెంతగా ఆరాధిస్తున్నారో మీ కంటే కూడా బాగా తెలుసు నాకు !''

''కానీ . నన్ను ప్రేమించలేనివారు నాకక్కర్లేదు !'' విసురుగా లేచింది.

మళ్ళీ నవ్వాడు కేశవ్.

''నేనో కథ చెప్తాను !. ఆ కథ విన్న తరవాతకూడా అదే అభిప్రాయాన్ని మీరు వెలిబుచ్చితే ఇంక మీ వంక చూడను!'' చనువుగా సుభద చెయ్యిపట్టి ఆపాడు

చెయ్యి విదిలించుకుని మౌనంగా కూర్చుంది సుభద.

''నేను కల్పనని చూసిన రోజు అంత అందమైన అమ్మాయి భార్య కాబోతున్నందుకు

---

సూళ్ళూరుపేటలో ఇటీవల జరిగిన నాటక పోటీలలో ఉత్తమ ప్రదర్శన, ఉత్తమ నటుడు, ఉత్తమ దర్శకత్వం బహుమతులు అందుకొన్న (తడ) నిప్పో రిక్రియేషన్ క్లబ్ వారి ''ఊరుమ్మడి బ్రతుకులు''లో నటించిన జె శివయ్య, నిమ్మరాజు రామమోహన్, కె. విజయసింహ, ఎ. నారాయణరావు (పర్సనల్ ఆఫీసర్), వై. సంతోష్‌కుమార్ రెడ్డి (ఫ్యాక్టరీ మేనేజర్) బి నిరంజన్, యస్. సాయిశ్రీనివాస్‌లని చిత్రంలో చూడవచ్చు.



## నల్ల కలువ

పొంగిపోయాను. అవిడని పదే పదే తల్చుకుని మురిసిపోయాను.

ఆమెతో ఏకాంతంగా కొంతసేపు మాట్లాడితే ఒకర్నొకరు బాగా అర్థం చేసుకోవడానికవకాశం ఉంటుందనుకున్నాను.

కానీ అనుకోకుండా మొన్న రోజా ఆమెను ఫ్రెండ్స్‌తో ఉండగా కలుసుకున్నాను.

మా ఇంటికి మిమ్మల్నందర్నీ ఆహ్వానించి ఏ గేమ్స్ చూపిస్తానన్నానో అవన్నీ నాకు కల్పన చూపించింది

రెక్కలు తెగి రక్తం ఓడుతూ గిలగిల కొట్టుకుంటున్న పావురాళ్ళని చూసి చప్పట్లు కొడుతూ ఆనందిస్తున్న కల్పనని చూస్తుంటే నా కళ్ళల్లోంచి ఒణుకు బయల్దేరింది.

ఆ దృశ్యం చూస్తుంటే మగాళ్లయిన నాకే హృదయం గడ్డకట్టినట్లయిందే... ఓ ఆడపిల్ల! అదే హృదయవిదారక దృశ్యాన్ని నయనానందకరంగా చూసి ఆనందిస్తుంటే... ఓహ్ !... నేను తట్టుకోలేకపోయాను.

ఆమె అందమంతా వికృతంగా కనిపించింది!

వెంటనే మీరు గుర్తొచ్చారు !

మీ కళ్ళల్లోని దయ, జాలి గుర్తొచ్చాయి.

ఓ డాక్టర్‌గా, ఒక ప్రాణదాతగా రాణించాలంటే, ముఖ్యంగా నాలాంటి వాడికి బాహ్య సౌందర్యం కంటే ... ఆత్మ సౌందర్యమే ఎక్కువ పేద తీరుస్తుందనిపించింది.

నాకు తెలిసినంతవరకు మీ హృదయం మంచిది ! నేనంటే ఆరాధన ఉంది.

అందుకే ఫ్రెండ్స్‌తో కలిసి ఓ చిన్న నాటకం ఆడాను

కిరాతకుడిగా కాస్సేపు నటించాను.

నేను నిజంగా ఆ జీవుల్నెక్కడ హింసిస్తానో అని మీరు హడలిపోయారు. కానీ, కల్పన ప్రోత్సహించింది

జీవితాంతం నాతో పయనించే మనిషి నాకు ఆత్మబంధువులా ఉండాలే తప్ప ఆగర్భ శత్రువులా ఉండకూడదు

నల్లగా ఉన్నా కోయిలలా మధుర రసాన్నొలికించాలి !

అంతేగానీ ... అందంగా తాములా ఉంటే జీవితాంతం భయంతోనే బ్రతకాలి.

మీకభ్యంతరం లేకుంటే నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటాను'' ముగించాడు కేశవ్.

నిర్ఘాంతపోయింది సుభద్ర !

ఆమె కళ్ళలో చెప్పలేనంత వెలుగు.

ఇప్పుడామె కళ్ళకి కేశవ్ ఓ అవతార పురుషుడులా ఉన్నాడు.

### ఘరానా వృత్తి !

ఒక పూట
కడుపు నింపు
కోవటానికి
ప్రతి రోజా
దర్శనమిస్తాడు
యాచకుడు
ఐదేళ్ళపాటు
కడుపు నింపు
కోవటానికి
ఒక్కసారి
దర్శనమిస్తాడు
రాజకీయ
యాచకుడు.

– జి. వి. వి. సత్యనారాయణ

''డాక్టర్ ... '' గొణిగింది

''నేను తొందరపడ్డానా ?''

''నో ... కానీ ... నేను పేద

ఆమె మాట పూర్తి కానేలేదు

''కానీ ... నేను కాస్త ఉన్నవాణ్ణే మనం హాయిగా ఉండడానికది చాలు జీవితాంతం మనం తోడూ నీడగా ఉందాం నిజాయితీ ఉట్టిపడుతోందతని గొంతులో

''కానీ ..''

''మీ బాధ నాకు తెలుసు...మీరు లేకపోతే మీ వాళ్ళకాధారం లేదు. కానీ . మనం ఒకటైతే . మీ వాళ్ళూ, మా వాళ్ళూ అంతా మనవాళ్ళే ... '' సుభద్ర కేశవ్ మాటలోని మృదుత్వానికి ఆశ్చర్యపోయింది.

''ఇది. నిజమా లేక కలగంటున్నానా?'' అయోమయంగా అంది

''నో .. ఇది కలకాదు నూటికి నూరుపాళ్ళూ నిజం. మిస్ సుభద్ర త్వరలో మిస్సెస్ సుభద్రా కేశవ్ కాబోతోంది !'' ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు కేశవ్.

ఆనందంతోనూ, సిగ్గుతోనూ సుభద్ర కళ్ళు వాలిపోయాయ్ ! నల్లని చెంపలు విరీతగా మెరిసాయి !

సిగ్గుతో తల దించుకున్న సుభద్ర ఎంతో అందంగా, మరెంతో ఉన్నతంగా కనిపించింది కేశవ్ కళ్ళకి

''పై మెరుగులకే భ్రమపడకోయ్, మనసే మాయని సొగసోయ్'' అన్న పాట దూరాన ఎక్కణ్ణించో మృదు మధురంగా వినిపిస్తోంది ! ★

## మనవి

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు తాము పంపే శీర్షిక పేరు రాసి కేరాఫ్ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక,గాంధీనగర్, విజయవాడ – 520 003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పూర్తి పేరు, చిరునామా యివ్వడం ఎంతైనా అవసరం. —సం.

## కార్టూన్‌లు పంపేవారికి మనవి

కార్టూన్‌లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ—3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్‌లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్‌లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈ కార్టూన్‌లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

# ప్రేమ విలువ

సారె రామమోహనరావు



ఆమె వస్తోంది.

నెమ్మదిగా తలధించుకుని నడుస్తోంది.

ఎల్.ఐ.సి. బిల్డింగ్ మూడో అంతస్థులోంచి స్వామిచరణ్ ఆమెనే తదేకంగా చూస్తున్నాడు

ఆమె ఎల్.ఐ.సి. బిల్డింగ్ దాటిపోయింది. స్వామిచరణ్ మనసునిండా చెప్పలేని దిగులు.

ఆమె వస్తున్నప్పుడెంత ఆనందంగా వుంటుందో – ఆమె ఆ బిల్డింగ్ దాటిపోయాక అంత దిగులుగా వుంటుందతనికి

వారం రోజుల్నుండి స్వామిచరణ్ ఆమెని గమనిస్తున్నాడు. మొదటిరోజు మామూలుగా చూశాడు. అందంగా వుందనుకున్నాడు. రెండో రోజు పరీక్షగా చూశాడు. మరీ అందంగా వుందనుకున్నాడు. మూడోనాడు ఈ అందం తన స్వంతం అయితే బాగుంటుందనుకున్నాడు. నాలుగోనాటి నుంచి ఆమె లేనిదే తన జీవితం వ్యర్థం అనుకున్నాడు. సరిగ్గా రోజూ సాయంకాలం నాలుగున్నరకు అతను అక్కడి నుంచి చూస్తే ఆమె రోడ్డుమీద వస్తూ కనిపిస్తుంది.

విశాలమైన కనుదోయి, చక్కటి పర్శనాలిటీ. ఛాయ మేలిమి బంగారాన్ని మరపిస్తుంది. నుదుట దోసగింజంత బొట్టు. నడక అచ్చు హంసలా వుంటుంది. చేతిలో వేనిటీ బ్యాగ్, అందులో పొందిగ్గా మడిచి పెట్టిన గొడుగు. ఇదీ ఆమె రూపం – వేషం.

రోజు రోజుకు ఆమె రూపం స్వామిచరణ్ మనసులో పెరిగి పెద్దదవుతోంది.

ఆమెతో మాట్లాడటం ఎలా ?

ఎక్కడో జాబ్ చేస్తున్నట్టుంది ! అందుకే రోజూ సరిగ్గా ఈ సమయానికి కనిపిస్తోంది.

తనకి పెద్దగా ఆడాళ్ళతో మాట్లాడే అలవాటులేదు. ధైర్యం అంతకన్నాలేదు.

ఆమె లేనిదే తన జీవితం వ్యర్థం అనిపిస్తోంది. శూన్యంగా గోచరిస్తోంది.

రాత్రిపూట సహితం ఆమెరూపం గుర్తుకొచ్చి అతనికి నిద్రపట్టడం లేదు. పడక అంపశయ్యలా అనిపిస్తుంది. వెంటనే లేచిపోతాడు తలుపు తీసుకుని బయటకి వస్తాడు ఎదురుగా వున్న కొబ్బరిచెట్ల ఆకుల సందుల్లోంచి చంద్రుడు కనిపిస్తాడు. ఆ చంద్రబింబం మధ్య ఆమె రూపమే సాక్షాత్కరిస్తుంది. తననిచూసి చిలిపిగా నవ్వుతుంది. కళ్ళతో ఆహ్వానిస్తున్నట్లుంటుంది.

ఇక తెల్లవార్లూ ఆ చంద్రబింబాన్నే చూస్తూండి పోతాడు. ఆఫీసుకి వెళ్తున్నప్పుడు దారి పొడుగునా ఆమెగురించే ఆలోచిస్తాడు. ఫైళ్ళలో తల దూరిస్తే ఆమె రూపమే ప్రత్యక్షమవుతుంది. తిండి సహించడం మానేసింది.

రోజులు గడుస్తున్నాయి.

ఆమె ఎల్ ఐ సి బిల్డింగ్ ముందునుంచి రోజూ నడుచుకుంటూ వెళ్ళిపోతోంది. స్వామి చరణ్ అలా చూస్తూనే వున్నాడు.

ఆమె మీది బెంగతో చిక్కి సగమయ్యాడు.

ఎప్పటి కప్పుడు ఆమెతో మాట్లాడాలను కుంటాడు కాని ధైర్యం చాలటంలేదు.

ఆ రోజు అతనిమిత్రుడు మధు ఎల్ ఐ సి ఆఫీసుకు లోనుకోసం వచ్చి అతనిని కలుసు కున్నాడు. పండులావుండే స్వామి చరణ్ పుల్లలా అయిపోవడం చూసి బాధపడ్డాడు. విషయం ఏమిటని అడిగాడు.

స్వామిచరణ్ సీరియస్‌గా వుండిపోయాడు చాలా సేపు.

తరువాత —

''ప్రేమలో పడ్డానురా మధూ!''అన్నాడు.

''మరింకేం! పెళ్ళి చేసుకో'' సలహా ఇచ్చాడు మధు.

''ఇంకా ఆ అమ్మాయి నిర్ణయం తెలుసుకో లేదు.''

''ఆలస్యం దేనికి వెంటనే అడిగేసెయ్.''

''నాకెప్పుడూ ఆడాళ్ళతో మాట్లాడే అలవాటు లేదు. ధైర్యం అంతకన్నా లేదు. ఎలారా?'' బేలగా అన్నాడు స్వామి చరణ్.

''ఛా! నువ్వూ ఓ మగాడివేనా? అంత ధైర్యం లేనివాడివి ఎందుకు ప్రేమించావ్? ధైర్యం లేనివాళ్ళకు అసలు ప్రేమించే అర్హత లేదు. ఒకవేళ ప్రేమిస్తే, ధైర్యంగా మాట్లాడాలి. నువ్వు నిజంగా ఆమెని ప్రేమిస్తున్న వాడివైతే నీకు భయం ఎందుకు? నీ ప్రేమను నీలోనే దాచుకుని నీలో నువ్వు కుమిలిపోవడం ఎందుకు? ప్రేమ, సందేహం — ఇవి రెండూ మనిషిని తినేస్తాయి, వెంటనే వాటిగురించి తెలుసుకోకపోతే. ప్రేమించే హృదయానికి ధైర్యం వుండాలి. భయం కాదు'' అన్నాడు మధు.

స్వామిచరణ్‌కి రోషం వచ్చింది.

''నేను మగాడ్ని. నాకెందుకు భయం? ఆ అమ్మాయితో ఈ రోజు తప్పకుండా మాట్లాడతాను'' దృఢంగా అన్నాడు.

''గుడ్! మగాడంటే అలా వుండాలి.'' మెచ్చుకున్నాడు మధు.

సాయంకాలం నాలుగున్నరయింది.

కిటికీలోంచి చూశాడు స్వామిచరణ్. దూరంగా ఆమె వస్తూ కనిపించింది. ఇంకా తన ఆఫీసు వదలటానికి మరో అర్ధగంట టైముంది. ఇంటిదగ్గర అర్జెంట్ పని వుందని మేనేజర్ పర్మిషన్ తీసుకుని బయటపడ్డాడు.

ఆమె సరిగ్గా ఎల్. ఐ. సి బిల్డింగ్ గేటు దగ్గర కొచ్చింది.

గేటు దాటింది.

స్వామిచరణ్ ఆమె వెనక అడుగులు వేశాడు.

మాట్లాడటానికి ధైర్యం చాలడంలేదు.

కాళ్ళు వణుకుతున్నాయి.

ధైర్యం కూడగట్టుకోడానికి ప్రయత్నిస్తు న్నాడు.

మాట్లాడేద్దామనుకుని పిలవబోయాడు.

పక్కనే టూ టౌన్ పోలీస్‌స్టేషన్ దర్శన మిచ్చింది.

ఒకవేళ తను ఆమెని పలకరించబోతే రౌడీ అనుకుని కేకలువేస్తే...

పోలీసు లొచ్చేస్తారు.

లాకప్పులోకి తోసేస్తారు.

'ధైర్యంలేనివాళ్ళకి ప్రేమించే అర్హతలేదు.

ప్రేమ, సందేహం — ఇవి రెండూ మనిషిని తినేస్తాయి, వెంటనే వీటిగురించి తెలుసుకోకపోతే'

మిత్రుడు మధు మాటలు గుర్తొచ్చాయి.

''ఏవండీ! మిమ్మల్నే!'' ధైర్యంగా పిలిచాడు.

వెనుదిరిగి చూసిందామె.

''నేను ఎల్. ఐ. సి ఆఫీసులో క్లర్కుగా వర్క్‌చేస్తున్నాను. రోజూ మిమ్మల్ని నా ఆఫీసు లోంచి చూస్తూంటాను మీరేమీ అనుకోకపోతే మీతో ఓ విషయం మాట్లాడాలి'' ధైర్యంగా ఆమె కళ్ళలోకి చూశాడు.

''ఫరవాలేదు, చెప్పండి'' అందామె.

''నాపేరు స్వామిచరణ్. మీ పేరు?'' ఆమె పక్కనే అడుగులువేస్తూ అడిగాడు.

''ప్రమీల. స్టీల్ ఆఫీస్‌లో క్లర్క్‌గా వర్క్ చేస్తున్నాను'' చెప్పిందామె.

'ప్రమీల! ఎంత చక్కటిపేరు! కంఠం ఎంత తియ్యగావుంది!'

పరవశించి పోయాడు.

''ఏదో విషయం మాట్లాడాలన్నారు?'' అడిగిందామె.

''ఆ విషయం ప్రత్యేకంగా మాట్లాడాలి. అలా సరస్వతీ జంక్షన్ పార్కుదాకా వస్తారా?''

''అలాగే!''

పది నిముషాల్లో ఇద్దరూ పార్కులో కూర్చున్నారు.

కొంచెంసేపు మౌనంగా కూర్చున్నాక స్వామిచరణ్ గొంతు విప్పాడు.

''ప్రమీలగారూ! మీరు నన్ను చూడక పోయినా నేను మిమ్మల్ని చాలారోజుల్నుంచి చూస్తున్నాను. మీ రూపం నన్ను ఆకట్టుకుంది. మిమ్మల్ని నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. మీ అభిప్రాయం ఏమిటి?'' గబగబా అనేసి ఆమె ముఖంలోకి చూశాడు.

ప్రమీల మౌనంగా గడ్డిపూలు పీకుతూ కూర్చుంది. అతని మాటలకు సమాధానం ఇవ్వలేదు.

''మీ మౌనం నన్ను బాధిస్తోంది. నేనందంగ లేనా? నేనంటే మీకిష్టం లేదా? అహో రాత్రులూ మీ గురించి తపించిపోతున్నాను. మీరు కాదంటే నాకిక మరణమే శరణ్యం. నా చావు బతుకులు మీ చేతుల్లో వున్నాయి'' అతని ముఖంలో బెంగ ద్యోతకమయింది.

''అహా! అంత మాటనకండి. నిజం చెప్పాలంటే మీరు నన్ను పలకరించినప్పుడే మీరు నా హృదయాన్ని దోచుకున్నారు'' ప్రమీల కనులలో సిగ్గుదొంతరలు.

స్వామిచరణ్ ఆనందం వర్ణనాతీతం.






## ప్రేమ విలువ

"నేనెంత అదృష్టవంతుడిని ప్రమీలా!" అన్నాడు

అది పార్కు. షికారుకు వచ్చిన జనం చాలామంది వున్నారు. లేకపోతే ఆమెను గాఢంగా గుండెలకు హత్తుకునేవాడే!

"మీరు నన్నిష్టపడ్డానన్నారు. నేను మిమ్మల్నిష్టపడ్డాను. పెళ్ళి చేసుకునే ముందు మన మధ్య రహస్యాలుండకూడదు మీకు నా జీవిత రహస్యం ఒకటి చెప్పాలి. అది ఆలకించాక మీ నిర్ణయం చెప్పండి" అంది ప్రమీల.

"నువ్వెలాంటి రహస్యం చెప్పినా నా నిర్ణయం మారదు ప్రమీలా!" దృఢంగా అన్నాడు స్వామిచరణ్.

"మీ ప్రేమ హృదయానికి నా జోహార్లు. వినండి..." అని కొంచెం ఆగి చెప్పింది ప్రమీల.

"నేను వివాహితను వితంతువును. నాకు ఏడాది పాప వుంది. భర్త పోతే గాజులు, బొట్టు తీసేయాలనే మూఢాచారానికి పూర్తి వ్యతిరేకిని. అందుకే బొట్టు చెరుపుకోలేదు. గాజులు విరగ్గొట్టుకోలేదు. అత్తమామలు, ఆడపడుచులు ఎంత నిందించినా లెక్కచెయ్యలేదు. నా భర్త పోర్టులో ఇంజనీర్‌గా వర్క్ చేస్తూ — మూడు నెలల క్రితం బ్రెయిన్ ఫీవర్ వచ్చి మరణించాడు. నా భర్త కన్ను మూసిన దగ్గరనుండి నా మనసు తోడు కోసం ఆరాటపడుతోంది. ఇకనుంచి పందిరి లేని లతలాంటి నా జీవితానికి మీరు పందిరిగా నిలుస్తారని ఆశిస్తున్నాను. నా ఆశను వమ్ము చెయ్యరని భావిస్తున్నాను."

"ఛీ! ఛీ! పవిత్రమైన స్త్రీ చెయ్యాల్సిన పనేనా ఇది! భర్త పోతే ఆ భర్తను తలుచుకుంటూ గడపక... పైపెచ్చు పెద్దలు పెట్టిన అతి పవిత్రమైన ఆచారాలను త్యజించి బొట్టు గాజులు వుంచుకుంటుందా! మొగుడు పోయి ఇంకా మూడు నెలలవలేదు అప్పుడే తోడుకోసం ఆరాటపడుతోందా! అలా ఆరాటపడుతోంది అంటే ఇది నిస్సందేహంగా కామపిశాచే!! అసలు ఇది ఆడదేనా! ఇలాంటి ఆడదానికోసమా తను అహోరాత్రులూ నిద్రాహారాలు మాని ఆరాటపడింది!" అతని శరీరంలోని అణువణువు ఆమెమీది అసహ్యంతో జలదరించింది.

"మీ నిర్ణయం ఏమిటి?" కుతూహలంగా అడిగింది ప్రమీల

"నీలాంటి ఆడదాన్ని చేసుకునే విశాల హృదయం నాకులేదు" సీరియస్‌గా అని అక్కడి నుంచి లేచి ముందుకు అడుగులువేశాడు

"మిస్టర్ స్వామిచరణ్!" పిలిచిందామె.

వెనుదిరిగి చూశాడు.

"చూడుమిస్టర్ స్వామిచరణ్! నీ రూపాన్ని చూసి నీది చాలా మంచి మనసనుకున్నాను నీ మాటలు విని నువ్వు నన్ను నిజంగానే ప్రేమిస్తున్నావనుకున్నాను అయినా నీ ప్రేమవిలువ ఎలాంటిదో తెలుసుకోవాలని నీకో చిన్న పరీక్ష పెట్టాను నేను వితంతువునని, ఓ పిల్ల తల్లినని అబద్ధమాడాను నా పరీక్షలో ఓడిపోయావు ప్రేమికునికి కావాల్సింది తను ప్రేమించిన ఆడది కాని ఆ ఆడదాని గత చరిత్ర కాదు. నీకు "ప్రేమ విలువ" తెలీదు ప్రేమవిలువ తెలిసిన వ్యక్తి ప్రేమికురాలికే విలువఇస్తాడు కాని ఆమె గతచరిత్రకు కాదు

ఇప్పుడు నువ్వు పశ్చాత్తాపపడి నిన్ను స్వీకరించమన్నా నేను స్వీకరించే స్థితిలోలేను.వస్తాను గుడ్ బై!" గంభీరంగా అని అక్కడినుంచి తీవిగా కదిలి పోయిందామె.

స్వామి చరణ్ నిశ్చేష్టుడయ్యాడు. ★

## ఉత్తరాలు

[4వ పేజీ తరువాయి]

### న్యూఢిల్లీ లేఖ

డా॥ జయ్‌దుబాషీగారి 'న్యూఢిల్లీ లేఖ'లో 'దుబాషీకి దొరికిన రహస్య నివేదిక' చదువుతుంటే ఇంత పెద్ద రహస్యము ఎలా కనుక్కున్నారో అని మాకు ఆశ్చర్యం కల్గింది

జి. విజయలక్ష్మి, ఇతరులు (హొళగుంద)

* * *

ఇటీవల పత్రికలలో వెలువడిన 'న్యూఢిల్లీ లేఖ'లోని డా॥ జయ్‌దుబాషిగారి వాఖ్యానాలు చదివాక, విమర్శించకుండ ఉంటే ఆయన ధోరణి ఇంకా ఎలా సాగుతుందో అన్న భయంచే ఈ లేఖను వ్రాస్తున్నాను. మార్క్సిజం తెలియని వారు ఉంటే దుబాషిగారు చెప్పే మార్క్సిజమే నిజమనుకునే ప్రమాదం ఉంది అసలు చిన్న అవగాహన 'వర్గరహిత సమాజంను ఏర్పరచటమే సోషలిస్టు ధ్యేయం' అన్నటువంటిది ఉండి ఉంటే దుబాషిగారి వాఖ్యానంలో అన్ని పొరపాట్లు దొర్లి ఉండకపోవచ్చు ప్రస్తుత సమాజంలో కోటానుకోట్ల ప్రజల కష్టంతో, వారిని నష్టపరుస్తు కొద్దిమంది మాత్రమే ధనవంతులుగా చలామణి అవుతున్నారు. కనుక అటువంటి వ్యవస్థను నాశనం చేసి శ్రమజీవులందరు, తమ సమిష్టి శ్రమ యొక్క ఫలితాలను అనుభవించేటట్లు చేసే కొత్త, మేలైన సమాజమైన, సోషలిస్టు సమాజంను ఏర్పరచాలంటుంది మార్క్సిజం

8 గంటల పనిదినం కోసం పోరాటం చెయ్యాలి — అని చెప్పింది ఎవరో డా॥ దుబాషిగారికి తెలియకపోవచ్చు. ఒకవేళ తెలిసివుంటే 'మనిషి ఒక యంత్రం' అని కా॥ మార్క్స్ పేర్కొన్నట్లు ఈయన ఎలా వ్రాసేవాడు రక్తం చిందించి 8 గం ల పని కోసం పోరాడిన కార్మికవర్గానికి కా॥ మార్క్స్ చెప్పిన సిద్ధాంతం ఊపిరిగా నిలిచింది ఇకపోతే 'కార్మికులు సమాజంలో భాగం కాదు' అని మార్క్స్ ఏ పుస్తకంలో అన్నారో డా॥ దుబాషిగారు సెలవిస్తే బాగుంటుంది 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి' అని పిలుపునిచ్చిన మహనీయుడు కా॥ మార్క్స్ ఘనతవహించిన డా॥ జయ్‌దుబాషిగార్కి ఈ విషయాలు తట్టనందుకు నిజంగ చింతించాల్సిందే!

నిరంకుశపాలన నుండి గెలుచుకొని, ఏర్పరుచుకున్న ఏ సోషలిస్టు విప్లవమైన కార్మిక వర్గం నియంతృత్వపాలనను సాగించినపుడే విజయవంతమవుతుందన్నది చరిత్ర చెబుతున్న సత్యం. పోషలిజం శత్రువులను ప్రతిఘటించి, శ్రామిక ప్రజలు తమ ఆధిపత్యాన్ని నిలుపుకోవాలంటే కార్మికవర్గ నియంతృత్వం అవసరమని నొక్కిచెప్పినాడు కా॥ లెనిన్ ఈ అవగాహన లేకనే ఈనాడు రష్యా 'అక్టోబర్ విప్లవాన్ని' విజయవంతంచేసి ఏర్పరుచుకున్న సోషలిస్టు వ్యవస్థ, తిరిగి పెట్టుబడిదార్ల చేతులలోకి వెళ్ళింది రష్యా ఈరోజు ప్రపంచ ప్రజల ప్రధాన శత్రువుగా వ్యవహరింపబడుతుందంటే కారణం ప్రపంచ మార్కెట్టును ఆక్రమించుకోవాలని కయ్యానికి కాలుదువ్వుతున్నట్టే, అక్కడ నెలకొన్నటువంటి పెట్టుబడిదారి వ్యవస్థ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ఇటువంటి దుర్వాఖ్యానాలు చూడటం బాధగా ఉంది

రజని (గద్వాల్)

### సినిమా

29-7-83 పత్రికలో శ్రీ ఎ ఆర్ రాజు గురించి మాకు తెలియని అనేక విషయాలు తెలియచేశారు. మన తెలుగులో ఎన్నో సినిమా పత్రికలు ఉన్నప్పటికీ ఇటువంటి వారి గురించి ఎందుకు తెలియచేయరో అర్థం కాదు కాని ఆ పరిచయ వ్యాసంలో చిన్న లోటు కన్పిస్తున్నది. ఏమిటంటే తెలుగు చిత్ర పరిశ్రమలో ఎన్నో రికార్డులు సృష్టించిన 'ప్రేమాభిషేకం' బెంగుళూరులో నాలుగు థియేటర్లలో 100 రోజులు నడిచి ఒక థియేటర్లో ప్లాటినమ్ జూబ్లీ జరుపుకొన్నది. అంతేకాక 60 లక్షలు పైగా వసూలుచేసి రికార్డు సృష్టించింది. ఈ విషయాన్ని ఆ పరిచయవ్యాసంలో పేర్కొనలేదు.

పి సత్యప్రసాద్ (జంగారెడ్డిగూడెం)

### గమనిక

8-7-83 సంచిక 64వ పేజీలోని "అవీ — ఇవీ — అన్నీ" శీర్షిక క్రింద "1983-84 లోనే నేపాల్ దాడి" అని పొరపాటు పడింది.

"1983-84 లోనే పాక్ దాడి" అని ఉండాలి. పాఠకులు గమనించ కోరుతున్నాము

— సం ★

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## తృతీయ ప్రపంచ ఫొటోగ్రఫీ ప్రదర్శనం :

ఫొటోలో కళ ఏముంది ? మక్కీకి మక్కీ కాపీ కొట్టడమే కదా! మానవుని మనోబుద్ధి హృదయాల ప్రమేయం లేకనే యంత్రం బొమ్మను లాగేస్తుంది — అంటారు కొందరు. కాని ఫొటోగ్రఫ్ కూడ కళే. ఏ కోణంలో ఫొటో తీయాలి, ఎలా తీయాలి, ఎలాతీస్తే అందంగా తీయవచ్చు, వెలుగు నీడలు ఏ పరిమాణంలో వుండాలి, ఏది ఇతివృత్తం, ప్రజాసేవలో ఫొటోగ్రఫీ పాత్ర ఏమిటి, దానితో మానవుల హృదయాలు మార్చవచ్చా ? — మున్నగు ప్రశ్నలను తరచి చూచినప్పుడు, ఫొటోగ్రఫీలోను మానవుని మనోబుద్ధి హృదయాల ప్రమేయం చాలా అవసరమని తృతీయ ప్రపంచ ఫొటోగ్రఫీ ప్రదర్శనం చూచిన వారికి ఎవరికైనా స్పష్టమవుతుంది. ఈ ప్రదర్శనం జులై రెండు మూడు వారాలలో కళాభవన్‌లో జరిగింది. స్వర్గమార్గంలో (ఆన్‌దలే టు ప్యారడైజ్) అనే శీర్షిక కింద జరిగిన ఈ ప్రదర్శనంలో. 434 ఫొటోలు ఉన్నాయి వివిధ విభాగాలలో దారిలో, భూమి భౌమిక, నరకం, రాజకీయ విశ్వాసం, భావిజీవితాశ, సంపన్న సమాజం, జనాభా సమస్య, జనుల కేంద్రీకరణ, పరిసరాల విధ్వంసనం, జాతి సంఘర్షణ, దురాక్రమణ, వినాశం, మృత్యువు, సుఖజీవనయత్నం, పలాయన వాదం, సంప్రదాయ పరివేష్టనంలో, వైయక్తిక పరిష్కారాలు, పరిసర్గాలు, పంజరం, భారవిమోచనమార్గంలో, మహిళా విమోచనం, శిశు విమోచనం, యువజన విమోచనం, దేహ విమోచనం, చైతన్యాభివృద్ధి, కమ్యూనికేషన్ సౌకర్యాల అభివృద్ధి, సమైక్య భావనాభివృద్ధి — అనే 27 విభాగాలలో ప్రపంచంలోని వివిధ సుఖ దుఃఖాలను, ఆవేశకావేషాలను, ఆశానిరాశలను, పతనాభ్యుత్థానాలను, సభ్యతా నాగరికతలను, సంప్రదాయాచారాలను, ఉద్యమ ప్రచారాలను, వినాశ వృద్ధులను, ప్రేమోద్రేకాలను కనుల గట్టించేవి ఈ ఫొటోలు. ఒక ఫోటో పది వార్తలపెట్టు అనే జర్నలిజం సూత్రానికి లక్ష్యప్రాయమైంది ఈ ప్రదర్శనం. భూమి—భౌమిక విభాగంలో ప్రపంచంలో వివిధ దేశాలలోని ప్రకృతి రమణీయకం ఆఫ్రికా దేశాల ప్రజల అనాది ఆచారాలు ప్రేక్షకులను ఆకర్షించగా, నరక విభాగంలోని ఆకలి మంటల, యుద్ధానంతర పరిణామాల బీభత్సదృశ్యాలు కరుణాజనకంగా వున్నాయి. భావిజీవితాశా విభాగంలో మందిరాలలో, విహారాలలో, చర్చీలలో హరేకృష్ణ సమాజాలలో ధ్యానమగ్నులయినవారి చిత్రాలు మనలోను ఆశాంకురాలు నాటుతున్నాయి. రాజకీయ విశ్వాసం విభాగంలో రాజకీయ సిద్ధాంతాల సాకులో మానవత్వం కోల్పోయిన చర్యల, ఉత్తర యమన్ రాజధాని సెన్నానగర ద్వారంమీద "రిపబ్లిక్ శత్రువుల" నరికిన తలలు పేర్చిన దృశ్యం భయంకొల్పుతున్నది. ఉత్తర ఈరాక్‌లో స్వాతంత్ర్యానికై ఒక చేత బందూకు మరొకచేత పసిపిల్లలను పట్టుకొన్న కుర్దు మహిళల అభిక్రమణ ఉత్సాహం కలిగిస్తున్నది. జాతి సంఘర్షణ, దురాక్రమణం, వినాశం, మృత్యువు విభాగాలలో దక్షిణాఫ్రికా, అమెరికాలలో వర్ణ వివక్షణ దృశ్యాలూ, వియత్నాం యుద్ధదారుణ దృశ్యాలూ, పాకిస్తాన్, బంగ్లాదేశాల కరువు కాటకాల, భూకంపాల, వరదల, ఆకలి చావుల దృశ్యాలు హృదయ విదారకంగా వున్నాయి. మహిళా విమోచన, యువజన విమోచన, దేహవిమోచన విభాగాలలో మితిమీరిన విమోచనోత్సాహంగల కొన్ని నగ్న చిత్రాలు, సంప్రదాయ పరివేష్టన విభాగంలోని ఆఫ్రికాది ఆదిమ జాతుల నగ్న చిత్రాలు ప్రేక్షకులను ఆకర్షిస్తున్నా, అవి దేశాచార ప్రబోధకాలు గనుక బూతుగా అనిపించలేదు. ప్రదర్శనం ముగింపు సమైక్య భావాభివృద్ధి విభాగం కావడం ప్రశంసనీయం. ప్రదర్శనాన్ని చూచి వెళ్లేవారికి చివరి విభాగం మంచి భావ ముద్ర వేస్తుంది. విజ్ఞాన దాయకమూ, వసుధైక కుటుంబ భావనా ప్రబోధకమూ అయిన ఈ ప్రదర్శనను ఏర్పాటుచేసిన మాక్స్ ముల్లర్ భవన్‌నూ, ఫొటోగ్రాఫిక్ అసోసియేషన్ ఆఫ్ హైదరాబాద్‌ను అభినందిస్తున్నాను.

వియత్నాంలో బాంబుదాడికి వికార స్వరూపుడైన పౌరుడు (తృతీయ ప్రపంచ ఛాయా చిత్ర ప్రదర్శనలోని ఒక ఛాయా చిత్రం)



## రావూరికి క్రోక్విల్ అకాడెమీ నివాళి :

జీవితమంతా బాధతో, సంఘర్షణతో నిండి వుంటుంది. ఆ బరువును మోసే శక్తిని హాస్యం మనకు ఇస్తుంది. హాస్యరసపు కళ్లజోడుతో చూచినప్పుడు అతిముఖ్యమైనదానిమధ్య అముఖ్యమయినది, సమంజసమైనదానిలో అసమంజసమైనది కనిపిస్తాయి. ఆమాత్రం రిలీఫ్ లేకపోతే మనమంతా మతులు కోల్పోయేవాళ్లం — అంటాడు సువిఖ్యాత హాస్యనటుడు చార్లీచాప్లిన్. హాస్యం నవరసాలలో ప్రధానమైనదని నా అభిప్రాయం. శృంగారం, కరుణ ఇత్యాది అన్ని రసాలనూ హాస్యం అంటిపెట్టుకొని వుంటుంది. ఇతర రసాలు మానవుడిలోని వుద్వేగాన్ని పైకి ఉబికేట్టు చేస్తాయి. హాస్యం వాటిని శాంత పరుస్తుంది — అంటారు మొక్కపాటి నరసింహ శాస్త్రిగారు. ఆ పండిత పామరం ఆనందించే సున్నితమైన హాస్యం సృష్టించిన రావూరి సత్యనారాయణరావుకు జులై 17న క్రోక్విల్ అకాడెమీ అనే వ్యంగ్య చిత్రకారుల సంస్థ అశోక్‌నగర్ నగర గ్రంథాలయ సంస్థ గ్రంథాలయంలో నివాళి ఇచ్చింది. ఈ సంతాప సభకు తిరుమల రామచంద్ర అధ్యక్షత వహించారు. డాక్టర్ రావూరిలో మానవత్వం, ఎవరినీ తూలనాడకపోవడం, యువకులను ఆకట్టుకోడం, కృష్ణా పత్రిక సంప్రదాయంవల్ల బాగా చదవడం వంటి ఉత్తమ గుణాలు వుండేవని, ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక తొలిసారిగా కథల పోటీ ప్రారంభించినప్పుడు మొదటి బహుమతి పొందిన బొమ్మ సముద్రం వాస్తవ్యుడు శ్రీ సి. వేణుకు ఆ వార్తను డాక్టర్ రావూరి స్వయంగా వెళ్లి తెలిపారని, దానినిబట్టి రచయితలను ఆకట్టుకోడంలో ఆయన సౌజన్య సామర్థ్యాలు ఎలాటివో తెలుస్తున్నవని తిరుమల రామచంద్ర అన్నారు. డాక్టర్ రావూరి చిరపరిచితులు శ్రీ కె. వి. కుటుంబరావు, రావూరి సౌశీల్యాన్ని వివరించారు.

## కొత్త విమానాలు !

జపానులో ఒక ప్రముఖ నిర్మాణ సంస్థ ప్రయోగాత్మకంగా ఒక కొత్త విమానాన్ని నిర్మిస్తున్నది. దీనికి చిన్న రన్‌వేలు సరిపోగలవు. పైగా వీటి వలన శబ్దకాలుష్యం చాలా తక్కువగా ఉంటుంది. వచ్చే సంవత్సరం మే నెల నాటికి దీని నిర్మాణం పూర్తవుతుంది. తరువాత మూడు సంవత్సరాలపాటు దీనిని ప్రయోగాత్మకంగా ఉపయోగిస్తారు. దీవుల లోనూ, చిన్న నగరాలలోనూ పెద్ద రన్‌వేలు లేకుండా వీటిని ఉపయోగించవచ్చు. వీటి వల్ల విమానాశ్రయాల చుట్టూ, జన సమ్మర్దం ఎక్కువగా ఉండే నగరాలలో శబ్దకాలుష్యంతగ్గించటానికి వీలవుతుంది.

## హైదరాబాద్ నోట్‌బుక్

శ్రీయుతులు అక్కిరాజు జనార్దనరావు, మంగపతి రావు, కె. వి. ఆర్. కృష్ణమాచార్యులు, వంశీ రామరాజు, వ్యంగ్య చిత్రకారులు జి. ఎస్. రావు, ఎస్. బి. రావు, కామేష్, శంకు రావూరి హాస్య ప్రతిభను గురించి ఆయన రచనలను గురించి ప్రసంగించారు. రావూరి పేర ఒక అవార్డు పెట్టదలచామని, ఏటా ఒక ఉత్తమ హాస్య రచయితకో, వ్యంగ్య చిత్రకారునికో ఇస్తామని శ్రీ శంకు అన్నారు. ఆయన అముద్రిత రచనలను ముద్రించాలని, ఆయన నిర్వహించిన భాషా కుటీరాన్ని కొనసాగించాలని శ్రీ వంశీ రామరాజు సూచించారు. రావూరి ఆత్మశాంతికై రెండు నిమిషాలపాటు మౌనం పాటించినమీదట సంతాప సభ సమాప్తమైంది.

ఉపశ్రుతి :

"నేనిప్పుడు బడిపంతుల్లాగవున్నానుగాని, చిన్నప్పుడు, అందంగా వుండేవాడిని" అన్నారే డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు, జూలై 22న రవీంద్ర భారతిలో ఒక సమావేశంలో మరి బడిపంతుళ్లంతా అందవికారులా ? — అనడిగారు నవ్వేక్కక శ్రోత. బడిపంతులకు కావలసింది చదువు సినీనటునికి కావలసింది అందం. ఆయన అన్నమాటలలో తప్పేముంది? — పక్కన వున్న మరొక శ్రోత అన్నారు. ★

*Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3 Editor S. Radhakrishna.*


తొలకరి చినుకులు... శ్యాంమోహన్
మొన్నటిదాకా- స్నానానికి నీళ్ళు లేక మొహం- వాచారు గురూ...
నాకొద్దులే.... అతనికి పట్టండి మీ గొడుగు...
మీ మతిమరుపు మండా... ఇంట్లోకొచ్చారు కదా... ఇంకా అదెందుకు..?
కాస్త పైకెత్తి నడవ్వమ్మా...
వంటయ్యేదాకా అలా పట్టుకోండి!!
ఇవి వర్షాల మీద వేసిన కార్టూన్లు సార్!!
EDITOR

